శ్రీరస్తు.

శ్రీ పరబ్రహ్మణేనమః.

శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ

వరప్రసాదలబ్ధ కవితావిలాస

నందడి. నాగదాస ప్రణీతం బైన

# సకలతత్వార్థదర్పణము.

అను నీవేదాంతశాస్త్రనిఘంటువు.

లేఖక ప్రమాద జనిత దోషంబులు లేకుండునటుల

సవరింపంబడినది.



**REVISED EDITION.**

చెన్నపురి:

బహూదు. త్యాగరాయశాస్త్రులు అండ్ సన్ వారి

స్వకీయ

గీర్వాణభాషారత్నాకరముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1925

వెల,] [రూ. 1.

# పీ ఠి క.

---

లోకమునందు అద్వైతమతావలంబులగు సకలసజ్జనులకు వేదాంతాధ్యయనమం దాసక్తిగలిగియుండియు తత్సాధకగ్రంథములలో త్రిగుణాత్మకతత్వాదులు క్రమముగా తెనుగుటీకాసహితముగా లేనందుచే పరతత్వంబు లింగుల దుర్జ్ఞేయంబుగా నుండుటవలన మోక్షసాధకంబగు నీవిద్య దురవగాహం బని కొందరు ప్రారంభించకనే యున్నారు. కొందరు కొంతకాలమువరకు జదివియు సాధకగ్రంథములు సుశబ్దముగా నుండని హేతువచేతనే వేదాంతవిద్యయందు స్వల్పజ్ఞానవంతులై పరతత్వనిరూపణయందు సందేహము గలవారలై యున్నారు. మేధావంతు లగు మరికొందరు అట్లు దుర్జ్ఞేయములుగానున్న గ్రంథములనే మిగులకష్టముతో చిరకాలము పఠించి అందు సకలతత్వంబులను వానిస్థానధర్మకర్మంబులన్నియు నెరిఁగి పరతత్వస్వరూపులై యున్నారు. ఇట్లనేకహేతువులచేత నీవిద్య బహుకష్టసాధ్యముగా నున్నది. గాన, సుజనులకు శ్రవణాదులు చేసిన కొంతకాలముననే కరతలామలకమువలె ననాయాసంబుగా పరతత్వస్వరూపంబు దెలియగలందులకు విశిష్టశిష్టజనానందకరముగా సద్గురుకారుణ్యమున వేదాంతశాస్త్రంబు చక్కగాపరిశోధించి అందుగల సకలతత్వంబులను క్రమసంఖ్యలుగా నేర్పరచి ఆతత్వంబుల రూప నామ గుణ స్థానాది దైవకర్మములు సంక్షేపంబైయుండునటుల వచనకావ్యంబుగా రచియించి విశేషజ్ఞు లగు మహాత్ముల సహాయ్యముచేత సకలతత్వార్థదర్పణ మను నామముచే ప్రసిద్ధిపరచబడియెను.


విషయసూచిక.

విషయసూచిక ముగిసెను.

శ్రీరస్తు.

అస్మద్గురుభ్యోన్నమః

శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరబ్రహ్మణేనమః.

# సకలతత్వార్థదర్పణము.

## ప్రథమనిరుక్తము.



—(*) ఇష్టదైవస్తోత్రము. (*)—

రాజయోగ విద్యావి|
చారాత్మకజనపయోధిచంద్రమ భవసం|
సారాటవి సుచి లక్ష్మీ|
నారాయణ నిన్ను నామనంబున దలతున్॥

—(*) దేవతాస్తవము. (*)—

క॥ సారచతురాననుల బో|నరులనులక్ష్మీహిమాద్రి తనయలమఱియున్ |
పరికించి శారదాంబను । వరమతి నుతియింతు కావ్య వర్ధనమునకై॥

—(*) కులగురుస్తుతి. (*)—

క॥ పరికింపగాను మత్కుల|గురువగు నల్లానికులయ కూపార నిశా|
కరుడనగవినుతిగాంచిన| గురువరురామానుజార్యుగొలిచెద నెపుడున్॥

—(*) కారణాచార్యసన్నుతి. (*)—

చ॥ మాయను బాపి మోక్షపదమార్గము జూపగ జాలినట్టి నా|
రాయణ మంత్రరాజము నిరామయ తత్వము దెల్పి నాపయిన్ |
బాయని కూర్మిగల్గిన కృపాకరు వెంకటరామయార్యులన్ |
నాయమనలోన నిల్పియు ననారతమున్ వినుతింతు భక్తితోన్॥

—(*) సుకవివినుతి. (*)—

గీ॥ సకలలోకోపకారంబునలువగోరి| కావ్యములు జేసిసత్కీర్తిగాంచినట్టి |
వ్యాసవాల్మీకకవి కాళిదాస బాణ|వరమయూరులకును జేతువందనములు॥

—(*) కవిస్తుతి. (*)—

క॥ నందడి రామాహ్వాయ ప్రియు|నందనుడను విష్ణుభక్తి నైష్ఠికుడను సా|
నందుడ నాగన నాముడ । పొందుగ వేదాంతవిధులబాగ దెడివాడన్॥

అట్టినేను,

—(*) గ్రంథోత్పత్తిదేశకాలనిర్ణయము. (*)—

సీ॥ శ్రీకరంబగు మర్త్యలోకంబునందున భరతఖండంబున తిరులవసరు।
బంగరు విషయంబునందు నందిగ్రామ సీమలో నిక్కిలి చెలగుచున్న।
జగ్గయపేట కీశాన్యమం దున్న నబ్బాకుపల్లెను పురవరమునందు।
వెలయుమరుత్పుత్రువిసుతించి శాలివాహనశకమున మతంగాంతరిడు।
హస్తిశశిసంఖ్యనడువతట స్తమైన।పార్థివాబ్దంబునందుసంగ్రథనముతోడ।
సకలతత్వార్థదర్పణసౌజ్ఞనొప్పు।శాస్త్రమునుజెప్పబూనితిశౌరికృపను॥

---

## త్రిసంఖ్యాప్రకరణము.

### 1. వాసనాత్రయము.

లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన యీ 3 న్ను వాసనాత్రయ మనబడు.

లోకవాసన—లోకముతోపాటుగా సంచరించవలయుననియును, లోకులందరు తన్నుస్తోత్రము సేయవలయుననియును మనస్సునందుండి ప్రవర్తించుట లోకవాసన యనంబడు,—దీనికి నివృత్తి. ఈశ్వరునకు కూడా నింద లేకుండా జరగకపోయినది. గనుక, అజ్ఞానులు నిందించిన స్తోత్రముచేసిన అస్తుతినిందలు శరీరమునకేకాని, ఆత్మకు లేవని విచారించినట్టయితె లోకవాసన బోవును.

దేహవాసన—సమస్తతీర్థములయందు స్నానము చేసిన పవిత్రుడననియును, ప్రాణాయామాదియోగంబులుచేసిన కాయసిద్ధిగలదనియును మనస్సునందుండి వర్తించుట దేహవాసన యనంబడు.—దీనికినివృత్తి. రక్తమాంసపూరితము శరీర మనిన్ని, మిగుల నిర్మలుడు జీవు డనిన్ని, శరీరము మాయాసంబంధమనిన్ని, అనిత్యమనిన్ని విచారించినట్టయితె దేహవాసన బోవును.

శాస్త్రవాసన—శాస్త్రపద్ధతిని కర్మచేయడము, శాస్త్రములు సాకల్యముగా చదువవలెనని మనస్సునం దుండి ప్రవర్తించుట శాస్త్రవాసన యనంబడును.—దీనికి నివృత్తి, కర్మము అజ్ఞానమును వృద్ధిజేయుననిన్ని, వెనుక జదివినదానికి మరుపుగలదనిన్ని, చదివినవరులవంచించినను

తానువోడినను దుఃఖమేననిన్ని విచారించినట్టయితే శాస్త్రవాసనబోవును.
(అని వాసుదేవమననము.)

2. ఈషణాత్రయము.

దారేషణ, ధనేషణ, పుత్రేషణ యీ౩న్నుయీషణాత్రయమనబడును.

దారేషణ—కామధర్మాదిసకలసుఖములు, భార్య గలిగినం గలుగునని, భార్యయందాసక్తి గలిగియుండుట దారేషణ యనంబడు.—దీనికి నివృత్తి. తాను దరిద్రుడైయుండినను, లేక దీర్ఘవ్యాధులచేత తపింపుచుండినను, యెల్లప్పుడు భార్య తనను దూషింపుచుండునని విచారించినట్టయితే దారేషణ బోవును.

ధనేషణ—ధనము గలిగియుండిన యజ్ఞదానాదిసత్కర్మములు జేసి స్వర్గాదిసుఖము లనుభవింపవచ్చునని ధనముగోరుచుండుట ధనేషణయనంబడు.—దీనికి నివృత్తి. ధనము సంపాదించుటయందు దుఃఖమనిన్ని, దాని సంరక్షణయందున్న దుఃఖమనిన్ని, కర్మవశముచే నాధనము పోయిన మిగుల దుఃఖంబనిన్ని, స్వర్గాదిభోగములు గలిగినను పునర్జన్మకారణమనిన్ని విచారించినట్టయితే ధనేషణ బోవు.

పుత్రేషణ—పుత్రులులేనిది నరకవిముక్తిన్ని, స్వర్గాదిభోగములున్ను, యిహమందు ప్రతిష్ఠయున్ను లేదని పుత్రులు గావలెనని గోరుచుండుట పుత్రేషణ యనంబడును.—దీనికి నివృత్తి. పుత్రులు గలుగక మునుపు తపోదాన తీర్థయాత్రాది క్లేశములున్ను, దైవవశంబునం గలిగి వినయవివేకంబులులేక మూఢుండైయున్న అపకీర్త్యాదిదుఃఖంబును, కాలవశంబున మృతించిన సకల దుఃఖములును కుమారుడు గలుగజేయునని విచారించినట్టయితే పుత్రేషణ బోవును. (అని వాసుదేవమననము.)

౩. మలత్రయము.

యణవమలము, మాయామలము, కార్మికమలము యీ౩న్ను మలత్రయమనంబడు.

యణవమలము—పరమాత్మను దెలియలేక సంసారియై నేను జీవుడను, అజ్ఞానుడను అని తలంచుచుండుట యణవమల మనబడును.

మాయామలము—పరులను మనోవాక్కాయములచేత అపకారంబు జేయుచు పరులు నేనును భిన్నభావంబు గలిగియుండుట మాయామల మనబడును.

కార్మికమలము — పుణ్యపాపములచేత స్వర్గనరకములున్ను, జనన మరణములున్ను గలవని నిశ్చయించుకొని కర్మశీలుండగుట కార్మికమల మనంబడును. (అని సకలార్థగురుబోధసారము.)

ఈమలత్రయము జ్ఞానమునకు ప్రతిబంధము. గనుక, సర్వావస్థల యందును బుద్ధియందెక్కనీక త్రోసివేయవలయునని శాస్త్రసిద్ధాంతము.

4. ఇచ్ఛాత్రయము.

స్వేచ్ఛా, పరేచ్ఛా, అనిచ్ఛ యీ 3 న్ను యిచ్ఛాత్రయ మనం బడును.

స్వేచ్ఛ — తాను వకకార్యమును మనస్ఫూర్తిగా కోరి చేసి దాని వలన వచ్చిన సుఖదుఃఖముల ననుభవించుట స్వేచ్ఛ యనంబడును.

పరేచ్ఛ — తాను వకకార్యమున్ను కోరి చేయక పరులచే ప్రేరే పింపంబడి చేసి అందుచే గలిగిన సుఖదుఃఖముల ననుభవించుట పరేచ్ఛ యనంబడును.

అనిచ్ఛ — తాను వకకార్యమున్ను కోరిచేయక పరులచేతనున్ను ప్రేరేపింపంబడిచేయక దైవీకమువల్లవచ్చిన సుఖదుఃఖములననుభవించుట అనిచ్ఛ యనంబడును.

జ్ఞానికి స్వేచ్ఛ నీచ మనిన్ని, పరేచ్ఛ మధ్యమ మనిన్ని, అనిచ్ఛ వుత్తమమనిన్ని వేదాంతసిద్ధాంతము.

5. కర్మత్రయము.

పుణ్యకర్మము, పాపకర్మము, మిశ్రకర్మము యీ 3 న్ను కర్మత్రయ మనంబడు.

6. కరణత్రయము.

మనస్సు, వాక్కు, కాయము యీ 3 న్ను కరణత్రయ మనబడును.

ఈకరణత్రయముచేత మొదటికర్మత్రయము జేయబడుచుండును.

మనస్సుచేత జేయబడిన పుణ్యకర్మ సవిశేష నిర్విశేష చింతయు, భక్తిజ్ఞానవైరాగ్యచింతయు, పరోపకారము మొదలయినవి మనస్సుయం దుండుట మనస్సుచేత జేయబడిన పుణ్యకర్మ మనబడును.

2. మనస్సుచే జేయబడిన పాపకర్మ సర్వదా విషయచింతయు, పరులకుద్రోహము జేయగోరుటయు, పరలోకము లేదనుటయు యీ మొద లుగాగలవి మనస్సుచేత జేయబడిన పాపకర్మములు,

౩. మనస్సుచేత జేయబడిన మిశ్రకర్మ నిర్వికల్ప సవికల్ప సమాధులు మొదలయినవానియందు విషయచింతయు, పరద్రోహచింతయు మొదలయినవి మనస్సుచేత జేయబడిన మిశ్రకర్మము లనబడును.

వాక్కుచేత జేయబడిన పుణ్యకర్మ వేదశాస్త్ర గీతానామసహస్ర పఠనంబును, గాయత్ర్యాది మంత్రజపంబును జేయుట వాక్కుచేత జేయబడిన పుణ్యకర్మ యనంబడు.

౨. వాక్కుచేత జేయబడిన పాపకర్మ పెద్దలను దూషించుటయు, అసత్యములుబలుకుట మొదలుగాగలవి వాక్కుచేత జేయబడిన పాపకర్మము.

౩. వాక్కుచేత జేయబడిన మిశ్రకర్మ వేదాధ్యయన జపాదికాలములయందు లౌకికవార్తయు, ప్రమాణములు మొదలయినవి జేయుట వాక్కుచేత జేయబడిన మిశ్రకర్మము లనబడును.

కాయముచేత జేయబడిన పుణ్యకర్మ పుణ్యతీర్థస్నానంబును, గురుదేవతానమస్కారంబును, బ్రహ్మచర్యంబు మొదలయినవి కాయముచే జేయబడిన పుణ్యకర్మ మనంబడును.

౨. కాయముచే జేయబడిన పాపకర్మ పరులపీడించుటయును, పరస్త్రీసంగమము, పరధనహరణము మొదలైనవి కాయముచే జేయబడిన పాపకర్మ మనంబడు.

౩. కాయముచే జేయబడిన మిశ్రకర్మ పరులను బాధించి వారల ద్రవ్యంబు దీసుకొని దేవాలయములు మొదలయినవాటికి ఖర్చుపెట్టుట కాయముచే జేయబడిన మిశ్రకర్మ యనంబడు.

యెల్లప్పుడు కరణత్రయముచేత పుణ్యకర్మంబె చేయవలయు, లేదా మిశ్రకర్మమునైనా జేయవలయునుగాని పాపకర్మము ఒకప్పుడు జేయగూడదని బుధజనాభిప్రాయము,

౭. అంగత్రయము.

స్థూలాంగము, సూక్ష్మాంగము, కారణాంగము యీ ౩న్ను అంగత్రయ మనబడును.

ఇదియే శరీరత్రయము మొదలయిననామములచే చెప్పబడును.

స్థూలాంగము—పంచవింశతి తత్వములతోకూడి స్తంభమువలె కనుపడుచున్నది స్థూలాంగ మనబడును.

సూక్ష్మాంగము—పది హేనుతత్వములతో గూడియుండునది సూక్ష్మాంగ మనబడును.

కారణాంగము—ఈస్థూలసూక్ష్మములురెండింటికి హేతుభూతమై అజ్ఞానస్వరూపమై యుండునది కారణాంగ మనంబడును.

యీవిచారమునకు ఫలంబేమనిన, ఆత్మ సాన్నిధ్యమునవున్న సూక్ష్మశరీరము చేతనే స్థూలశరీరద్వారా కర్తృత్వభోక్తృత్వములు జరుగుచున్నవని తెలియుటే ఫలము.

## 8. అవస్థాత్రయము.

జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యావస్థ యీ 3న్ను అవస్థాత్రయ మనంబడును.

జాగ్రదావస్థయనగా—మేలుకొనియుండుట.

స్వప్నావస్థయనగా—కలలుగనుట.

సుషుప్త్యావస్థయనగా—సుఖముగా నిద్రబోవుట.

ఇందుకు ఫలం బేమనిన, యీఅవస్థాత్రయమునకు ఆత్మ సాక్షియై యున్నాడని దృఢముగా తెలియుట.

## 9. జీవత్రయము.

విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు యీ3న్ను జీవత్రయ మనబడును.

విశ్వుడు—జాగ్రదావస్థవాసుడు.

తైజసుడు—స్వప్నావస్థవాసుడు.

ప్రాజ్ఞుడు—సుషుప్త్యావస్థవాసుడు. గనుక, జీవత్రయమునకు ఆత్మ సాక్షియై యున్నాడని తెలియుటే ఫలము.

## 10. స్థానత్రయము.

భ్రూమధ్యము, కంఠము, హృదయము యీ 3న్ను స్థానత్రయ మనబడును.

## 11. అంగత్రయవిభజనచక్రము.

| | | | |
|---|---|---|---|
| అంగత్రయము ... | స్థూలము. | సూక్ష్మము. | కారణము. |
| అవస్థాత్రయము ... | జాగ్రత. | స్వప్నము. | సుషుప్తి. |
| జీవత్రయము ... | విశ్వుడు. | తైజసుడు. | ప్రాజ్ఞుడు. |
| స్థానత్రయము ... | భ్రూమధ్యము. | కంఠము. | హృదయము. |

12 తాపత్రయము.

అధ్యాత్మికము, అధిభౌతికము, అధిదైవికము యీ 3 న్ను తాపత్రయములు.

వాతపైత్యశ్లేష్మములవల్లనచ్చెడిదుఃఖము అధ్యాత్మిక మనంబడు.

సర్పవృశ్చికవ్యాఘ్రచోరాదులచే వచ్చెడు దుఃఖము అధిభౌతిక మనంబడు.

గాలి, వాన, పిడుగులు, రాళ్లు మొదలయినవానిచే గలిగెడు దుఃఖము అధిదైవిక మనంబడు.

యీతాపత్రయము అంతఃకరణముతో గూడిన శరీరమునకేకాని, ఆత్మస్వరూపుడౌ తనకు లేదని వేదాంతసిద్ధాంతము.

13. వ్యాధిత్రయము.

వాతము, పైత్యము, శ్లేష్మము యీ 3 న్ను వ్యాధిత్రయమనబడును.

వాతమునందు బుట్టినరోగములు 80.

పైత్యమునందు బుట్టినరోగములు 82.

శ్లేష్మమునందు బుట్టినరోగములు 224, కూడారోగములు 38.

ఇట్టిరోగముల కాలయమైన యీశరీరమందు భ్రాంతిలేక ఆత్మావలోకనము జేయుచుండవలెనని సిద్ధాంతము.

14. ప్రతిబంధత్రయము.

భూతప్రతిబంధము, వర్తమానప్రతిబంధము, భావిప్రతిబంధము యీ 3న్ను ప్రతిబంధత్రయ మనబడును.

భూతప్రతిబంధ మనగా—బహుకుటుంబిని యగు నొకబ్రాహ్మణుడు జీవనార్థమునకై నొక యెనుమును సంపాదించుకొని దానివలన కుటుంబసంరక్షణ జేయుచుండెను. అంత కొంతకాలంబునకు కర్మవశంబున పుత్రమిత్రకళత్రాదులున్ను యెనుమున్ను నశించెను. అప్పుడా బ్రాహ్మణుండు విరక్తుండై సద్గురుసాన్నిధ్యంబున శ్రవణాదులుచేసెను. అంత నొకసమయంబున నతనిగురుండు చేరంబిలిచి నీవు బహుదినంబుల నుండి శ్రవణాదులు చేసితివే కృతకృత్యత నీకుగానోచియున్నదా యనిన, అతను మరియేమియుంగానను. పూర్వము ఒక యెనుమును సంపాదించికొనియుంటిని. అది నాడె మృతించెను. అయినప్పటికిని శ్రవణమననినిధిధ్యాసకాలంబులయందు ఆయెనుమే సాక్షాత్కారమై యున్నదని యథార్థంబుగా విజ్ఞాప

నముచేసెను గాన నిదియే భూతప్రతిబంధ మనబడును.—దీనికి నివృత్తి. గురువు శిష్యునిజూచి నీకుసాక్షాత్కారమైనయేనుపు హాస్తి, భాతి, ప్రియ, నామరూపములు గలిగినదిగాన, వానిలో నామరూపములు రెంటినితోసి వేసి తక్కిన హాస్తి, భాతి, ప్రియములను నేనని చింతింపుమని ఉపదేశించెను. ఆశిష్యుం డదేప్రకారముధ్యానించిన సర్వావస్థలయందును, సచ్చిదానందమే గనుపడి యేనుము కనుపించకపోయెను.

వర్తమానప్రతిబంధ మనగా—విషయాసక్తియు, ప్రజ్ఞామాంద్యము, కుతర్కము, విపర్యయదురాగ్రహము ఈ 4న్ను వర్తమానప్రతిబంధ మనంబడును.—దీనికి వివరము. విషయాసక్తియనగా సమస్త సుఖములు పొందగోరుట. ప్రజ్ఞామాంద్యమనగా గురువులుచెప్పినయర్థము బుద్ధియందెక్కకుండుట. కుతర్కమనగా గురువులు చెప్పినమాటకు విపరీతార్థంబు జేయుట. విపర్యయదురాగ్రహమనగా నేనేసర్వాధికారినని గర్వించుట. ఇందుకునివృత్తి. శమదమాదులవలన విషయాసక్తియును, పునఃపునఃశ్రవణంబువలన ప్రజ్ఞామాంద్యమును, మననమువలన కుతర్కంబును, సంతత నిధిధ్యాసమువలన విపర్యయదురాగ్రహమును బోవును.

భావిప్రతిబంధము—పాపకర్మమువలన యేవేళకు యేమివచ్చునది తెలియనిదే భావిప్రతిబంధమనబడును. ఆపాపమునయాహూపమైవచ్చును. దీనికి నివృత్తి. పూర్వము జడభరతుడు లేడిపిల్లయందు దయచేసి అందువలన కొన్నిజన్మము లెత్తినది విచారించినట్టయితే భావిప్రతిబంధము బోవును.

### 15. సంశయత్రయము.

సంశయము, అసంభావన, విపరీతభావన యీ మూడున్ను సంశయత్రయ మనబడును.

వస్తుద్వయంబు ఒకదానియం దారోపించుట సంశయము అనగా యిది స్థాణువో పురుషుడోయని తలచెడు చిత్తవృత్తి.

ఇక్కడ స్థాణువు వుండవలసిన పనియేమి? స్థాణువు వుండనేరదేయని తలచెడి చిత్తవృత్తి అసంభావన యనబడును.

ఒకవస్తువునందు గల నైజమును కాదని తలంచుట విపరీతభావన యనబడు.

ఒకసంశయమే ప్రమాణగతసంశయమనియు ప్రమేయగతసంశయ

మనియును, ఒకఅసంభావనే ప్రమాణగతఅసంభావనయనియు ప్రమేయగత అసంభావనయనియు, ఒకవిపరీతభావనే ప్రమాణగత విపరీతభావనయనియు ప్రమేయగత విపరీతభావన యనియు ఒక్కొకటి రెండువిధములుగా జెప్పబడియెను.

ప్రమాణగతసంశయము— వేదము కర్మ ప్రతిపాదించుచున్నదా లేక శిష్టమైన ప్రత్యగ్బ్రహ్మమును ప్రతిపాదించుచున్నదా యని వచ్చెడు సంశయము ప్రమాణగతసంశయ మనంబడును.— జగత్కారణవస్తువు బ్రహ్మమా లేక ప్రధానాదులా యని వచ్చెడి సంశయము ప్రమేయగత సంశయ మనంబడును.

బ్రహ్మము శుద్ధవస్తు వగుటవలన ప్రమాణాంతరముచేత పృథివ్యాదులవలె నెరుగబడుచున్నది. గనుక, శ్రుతులు అశుద్ధబ్రహ్మమును జగత్కారణమని యెటుల ప్రతిపాదించును. ప్రతిపాదింపనేరదే యనెడు చిత్తవృత్తి ప్రమాణగత అసంభావన యనబడును.— జగత్తుకంటె బ్రహ్మము విలక్షణమైయున్నది. గనుక, జగత్తుకుకారణమనిచెప్పగూడదు. ప్రధానాదులె జగత్తుకు కారణమనెడుచిత్తవృత్తి ప్రమేయగత అసంభావన యనబడును.

బ్రహ్మము శుద్ధవస్తువు. గనుక, శృతులకు శుద్ధబ్రహ్మమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము లేదు. శ్రుతులు శుద్ధబ్రహ్మమును ప్రతిపాదించినట్టయితె పురుషునికి వృత్తి నివృత్తులు కానము. గనుక, ప్రయోజనములేకపోవును. లోకమందు ప్రవృత్తిపూర్వకముగానె పురుషార్థము గనుపడు ననే చిత్తవృత్తి ప్రమాణగత విపరీతభావన యనంబడును.— అశుద్ధ్యాదివికారంబులతో గూడుకొనియుండెను జగత్తుకు కారణమయిన బ్రహ్మంబును అశుద్ధ్యాదులతో గూడుకొని యుండవలెను. అటువలెనుండ లేదు. కాబట్టి, ప్రధానాదులే జగత్తుకు కారణమని బుద్ధియందు దోచుట ప్రమేయగత విపరీతభావన యనబడును.

16. ప్రత్యగాత్మవిషయమైన సంశయత్రయము.

ప్రత్యగాత్మ విషయమయిన సంశయము, ప్రత్యగాత్మవిషయమైన అసంభావన, ప్రత్యగాత్మ విషయమైన విపరీతభావన యీ 3 న్ను ప్రత్యగాత్మ విషయమైన సంశయత్రయము అనంబడును.

అంతర్యామందు జీవుడుగానున్న జగత్తులోనొకడుగానున్న తోచుచుండగ నేను జగద్విలక్షణమైన బ్రహ్మమునో కానో అని బుద్ధియందు

తలచుట ప్రత్యగాత్మవిషయమయిన సంశయత్రయ మనంబడు.

కర్తృత్వాద్యనేకధర్మయుక్తుడై పరిఛిన్నుడై జననమరణంబులతో గూడుకొనియుండెడి తనకు విపరీతలక్షణములు గల బ్రహ్మస్వరూపత్వము నెటువలె కూడును. కూడనేరదే యనెడు చిత్తవృత్తి ప్రత్యగాత్మవిషయమయిన అసంభావన యనబడును.

తాను అకర్త యయ్యెనేని తన్ను నుద్దేశించి యీకర్మమును జేయుమా యీకర్మమును జేయకుమా అనే యీలాటిధర్మములు శ్రుతుల యందెటుల ప్రవర్తించు. ప్రవర్తించనేరదే. కాబట్టి, నేను కర్తనే భోక్తనే సందేహములేదు. అని బుద్ధియందు దలచుట ప్రత్యగాత్మవిషయమైన విపరీతభావన యనబడు.

యీనవవిధమైన సంశయత్రయము శృతి గురు వాక్యయుక్తులచేత తోలి వేశి నేనే శుద్ధబ్రహ్మము నని దృఢముగా యెరుగవలె నని వేదాంత సిద్ధాంతము.

17. మాయాత్రయము.

అవిద్య, ఆవరణము, విక్షేపము యీతిన్ను మాయాత్రయమనబడు.

తన్నుతానెరుగక నేను జీవుడనని తలచుచుండుట యవిద్యయనబడును.

మదముచే పెద్దల నిందించుట ఆవరణ మనబడును.

వెఱ్ఱిబట్టినవానివలెద్రవ్యాసక్తిచేతిరుగుచుండుటవిక్షేపమనబడును.

18 అహంకారత్రయము.

సాత్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము యీ తిన్ను అహంకారత్రయ మనబడును.

సాత్వికాహంకారమువలన సూర్యాదిదేవత లుద్భవించిరి.

రాజసాహంకారమువలన శబ్దాదివిషయములు బుట్టెను.

తామసాహంకారమువలన పంచభూతములు బుట్టెను.

19. స్వర్గతాపత్రయము.

క్షయము, అతిశయము, సాహసము ఈతిన్ను స్వర్గతాపత్రయములు.

క్షయమనగా, కృత్యములుదీర్చుటఅనగాపూర్వాశృతకర్మదీర్చుట.

అతిశయమనగా, నాకన్నబలవంతులు లేరని గర్వించుట.

సాహసమనగా, స్వర్గమునకుబోయినవారిని దిగువకు ద్రోయుట,

20. నాడీత్రయము.

ఇళనాడి, పింగళనాడి, సుషుమ్ననాడి యీ3న్న నాడీత్రయములు.

21. మండలత్రయము.

సూర్యమండలము, చంద్రమండలము, అగ్నిమండలము యీ 3న్న మండలత్రయములు.

22. వేణీత్రయము.

గంగా, యమునా, సరస్వతి యీ 3 న్న వేణీత్రయములు.

23. నాడ్యాధిపతిత్రయము.

బ్రహ్మ, విష్ణు, శివుడు యీ 3 న్న నాడ్యాధిపతిత్రయము.

24. వర్ణత్రయము.

అకారము, ఉకారము, మకారము యీ 3 న్న వర్ణత్రయములు.

25. భాగత్రయము.

కుడిభాగము, ఎడమభాగము, మధ్యభాగము యీ 3 న్న భాగత్రయములు.

26. పదత్రయము.

త్వంపదము, తత్పదము, అశిపదము యీ 3 న్న పదత్రయములు.

త్వంపద మనగా జీవుడు, తత్పద మనగా ఈశ్వరుడు, అసిపద మనగా ఈరెంటియొక్క అయిక్యము. అనగా, పరమాత్ముడు.

27. మూర్తిత్రయము.

బ్రహ్మ, విష్ణు, శివుడు యీ 3 న్న త్రిమూర్తులు.

బ్రహ్మఅనగా, రజోగుణసంబంధమువలనజగత్తునుసృజించువాడు.

విష్ణు వనగా, సత్వగుణస్వరూపుడై జగత్తును పోషించునాడు.

శివుడనగా, తమోగుణస్వరూపుడై జగత్సంహారము జేయువాడు.

28. హంసచక్రము.

| | | | |
|---|---|---|---|
| నాళ్లు ... | ఇడా. | పింగళా. | సుషుమ్న. |
| మండలములు ... | చంద్రుడు. | సూర్యుడు. | అగ్ని. |
| నదులు ... | యమునా. | గంగా. | సరస్వతి. |
| అధిపతులు ... | విష్ణు. | బ్రహ్మ. | శివుడు. |
| భాగములు ... | ఎడమ. | కుడి. | మధ్య. |
| ప్రకృతి, పురుష, పరమాత్మలు. | శక్తి. | పురుషుడు. | పరమాత్మ. |

ఇవి మూడుగగూడినదే త్రికూటమనియు, త్రివేణీసంగమమనియు చెప్పబడును.

29. వర్ణత్రయచక్రము.

| | | | |
|---|---|---|---|
| వర్ణములు ... | అకారము. | ఉకారము. | మకారము. |
| నాదబిందుకళలు ... | నాదము. | బిందు. | కళ. |
| పదములు ... | త్వంపదము. | తత్పదము. | అసిపదము. |
| హంస ... | హ | స | ం |
| అవస్థలు ... | జాగ్రత. | స్వప్నము. | సుషుప్తి. |
| మూర్తులు ... | బ్రహ్మ. | విష్ణు. | శివుడు. |

ఈవర్ణత్రయాత్మకంబైన ప్రపంచంబంతయు వాచ్యార్థమని విడిచి లక్ష్యార్థమైన శుద్ధోంకారమునే పరమాత్మునిగా తెలియవలయు నని సిద్ధాంతము.

30. తూర్యావస్థత్రయము.

జననము, వృద్ధి, మరణము యీ 3 న్ను తూర్యావస్థత్రయ మన బడును. ఆత్మకు ఈజననాద్యవస్థలు లేవని తెలియుటే యిందుకుఫలము.

31. త్రివిధపరిచ్ఛేదములు.

వస్తుపరిచ్ఛేదము, దేశపరిచ్ఛేదము, కాలపరిచ్ఛేదము యీ3న్ను త్రివిధపరిచ్ఛేదము లనంబడును.

ఆత్మ యీవస్తువం దున్నాడు యీవస్తువందు లేడు అనుట వస్తుపరిచ్ఛేద మనబడును.

దేశపరిచ్ఛేద మనగా—ఆత్మ యీదేశమం దున్నది యీదేశమందు లేదని తలంచుట దేశపరిచ్ఛేద మనబడును.

ఆత్మ యీకాలమం దున్నది యీకాలమందు లేదని తలంచుటే కాలపరిచ్ఛేద మనబడును.

దేహవ్యతిరిక్తుడైన ఆత్మకు దేశకాలవస్తువులచేత పరిచ్ఛేదము లేదు. అదియెట్లనగా, ఆత్మ వ్యాపకుడైయున్నాడు. గనుక, దేశముచేతనున్ను, అనాదియై యున్నాడు. గనుక, కాలముచేతనున్ను, మరియును ఆది మధ్యాంతరహితుడు. గనుక, కాలముచేతనున్ను, సర్వాత్మకుడైయున్నాడు. గనుక, వస్తువుచేతనున్ను ఆత్మకు పరిచ్ఛిన్నత్వము లేదని సిద్ధాంతము.

### 32. కాలత్రయము.

భూతకాలమ్ము, భవిష్యత్కాలము, వర్తమానకాలము యీ మూడున్ను కాలత్రయ మనబడును.

భూతకాల మనగా—యిదివరకు జరిగినకాలము.

భవిష్యత్కాలమనగా—ముందుజరగబోయెకాలము.

వర్తమానకాలమనగా—యిప్పుడు జరుగుతున్నకాలము.

యీకాలత్రయమునందును ఆత్మ యేకరూపుడైయున్నాడని తెలియుటే ఫలము.

### 33. ఆగామిసంచితప్రారబ్ధత్రయము.

ఆగామి,సంచితము,ప్రారబ్ధము ఈమూడున్ను ప్రారబ్ధత్రయ మనబడును.

సంచితము—లోకమందు అనాదియైనజీవుడు పుణ్యాపాపకర్మంబులను చేసుకొనుచువచ్చును. ఇట్లుచేసుకొనుచురాగా, నొకదినమందుచేసిన పుణ్యాపాపకర్మమే బహుజన్మంబులకు కారణమైయుండును. ఇటువలె జన్మావధి చేసుకొనుచునుండును. ఆయాపుణ్యాపాపకర్మంబు లన్నియు రాసులు రాసులుగా కూడును. వీట్లకు సంచిత మని పేరు.

ప్రారబ్ధము—అటుతరువాత మరణంబునుపొందును. మరణంబును బొంది తరువాత తిరుగా జన్మమెత్తె నిమిత్తమై ఆసంచితంబులో కొంత గ్రహించుకొనును. ఆసంగ్రహంబు కర్మంబు భావిశరీరంబులకు కారణము లైన పంచీకృత పంచమహాభూతంబుల శరీరాకారంబుగా పరిణమింపజేసి యాశరీరంబుచేత కొన్నికర్మంబులను చేశి యాకర్మములవలన కొన్నిసుఖ దుఃఖంబుల ననుభవించెను. దీనికి ప్రారబ్ధ మని పేరు.

ఆగామి—ఆప్రారబ్ధముచు భుజియించుకొనుచు మరణపరియంతంబును చేసిన పుణ్యాపాపంబులకు ఆగామి యని పేరు. ఇదియును నా సంచితంబుతో కూడును.

ఈవిచారమునకు ఫలం బేమనిన, యీప్రకారంబుగా జీవుడు అనాదిగాకర్మంబులను చేయుచురాగా, సంచితమువృద్ధిబొందుచువచ్చును. కాబట్టి, యీజీవులయొక్క జన్మంబులకు అవధిలేదు. అయితే, యీ జన్మంబుల కవధి యెప్పుడువచ్చునంటే, యీప్రకారంబుగా కర్మంబులు చేయుచురాగా, నొకజన్మమం దొకపుణ్యాకర్మపరిపాకమువలన దీనికి సంసారంబు రాకుండా చేసుకోవలెనని వివేకంబు బుట్టును. అది యెటు

వలెనంటే, తనకు కామ్యకర్మంబులను చేయుటవలన చిత్తశుద్ధిరానేరదు. సంసారంబును బోనేరదని విచారించి కామ్యకర్మంబులను విడిచి విహితములైన కర్మంబుల నీశ్వరార్పణంబుగా జేయవలయు నను వివేకంబు బుట్టును. ఆకర్మంబువలన భక్తి గలుగును. భక్తిద్వారా చిత్తశుద్ధి జనించును. చిత్తశుద్ధిద్వారా సద్గురులాభ మగును. పిదప, సద్గురువులయొద్ద నుండుకొని శుశ్రూష జేయుచు శ్రవణ మనన నిధి ధ్యాసనంబుల నెల్ల జేయుచుండును. ఈప్రకారంబుగాజేసి జ్ఞానంబు సంపాదించును. అప్పుడు జ్ఞానాగ్నిచేత అజ్ఞానంబు దగ్ధమైపోవును. అజ్ఞానమెప్పుడుబోవునో అప్పుడె అజ్ఞానకార్యంబు లైన సంచితకర్మంబు లన్నియు దగ్ధమై పోవును. జ్ఞానంబు వచ్చిన తరువాతను చేయబడిన పుణ్యపాపములు అకర్తయైన వీనిని స్పృశింపలేవు. అయితే పుణ్యపాపంబులకు గతియేమియనిన, ఈజ్ఞానిని యెవడు భూషించుచున్నాడో వాడు పుణ్యమునుగొంచుపోవును, యెవడు దూషించుచున్నాడో వాడు పాపంబును గొంచుపోవును. ప్రారబ్ధంబు భుజించి తీరవలెనని తెలియుటే యీవిచారమునకు ఫలము.

34. ప్రాణాయామత్రయము.

ప్రాకృతము, వైకృతము, కుంభకము యీ 3 న్ను ప్రాణాయామత్రయ మనంబడు.

ప్రాకృత మనగా, మంత్రయోగము.

వైకృత మనగా, లయయోగము.

కుంభక మనగా, హఠయోగము.

ఈయోగములకు చతుస్సంఖ్యాప్రకరణములో వివరించబడును.

35. లక్ష్యత్రయము.

అంతర్లక్ష్యము, బాహ్యలక్ష్యము, మధ్యలక్ష్యము యీ 3 న్ను లక్ష్యత్రయ మనబడును.

అంతర్లక్ష్య మనగా, సకలమైన అంతరేంద్రియార్థము లజూచునట్టి లోచూపు.

బాహ్యలక్ష్య మనగా, సకలమైన బాహ్యేంద్రియవృత్తుల జూచునట్టి వెలిచూపు.

మధ్యలక్ష్య మనగా, సకల మైన బాహ్యేంద్రియవృత్తుల జూచునట్టి మధ్యదృష్టి.

ఈవిచారమునకు ఫలంబేమనిన, యీచూపులనన్నిటినిచూపించు నది శాంభవీముద్రయనంబడు. నదియే నన్నిటిలో శ్రేష్ఠంబు. గనుక, నిరంతరం బభ్యాసంబు జేయుచుండవలెనని తెలియుటే యీవిచారము నకు ఫలము.

36. గంధత్రయము.

సుగంధము, దుర్గంధము, మిశ్రగంధము యీ 3 న్ను గంధత్రయ మనబడు, ఈమూడింటిలో వొక్కొకటి యనేకవిధంబులై యుండినను ఆత్మను వొకానొకకాలమందైనా స్పృశింపలేవని సిద్ధాంతము.

37. భక్తిత్రయము.

బాహ్యభక్తి, అనన్యభక్తి, యేకాంతభక్తి యీ 3 న్ను భక్తి త్రయములు. ఇందులో బాహ్యభక్తి నవవిధము. గనుక, నవసంఖ్యా ప్రకరణమందు దెలుపబడుచున్నది.

ఇతరదైవములను దలచక మనోవాక్కాయములచేత సర్వావస్థల యందు సర్వంబును తనయిష్టదైవముగా దలచి భజింపుచుండుట అనన్య భక్తి యనబడును.

నిరంతరము చిత్తైకాగ్రంబుగలిగి తనయిష్టదైవమును పరంజ్యోతి స్వరూపునిగాఅంతర్లక్ష్యమందుజూచుచు పరమానందభరితుడైయుండుట యేకాంతభక్తి యనంబడును.

ఈమూడువిధములున్ను క్రమముగా సాధింపవలయు నని బుధజన అభిప్రాయము.

38. దృష్టిత్రయము.

అమావాస్యదృష్టి, పాడ్యమిదృష్టి, పౌర్ణమిదృష్టి యీ 3 న్ను దృష్టిత్రయ మనబడును.

అమావాస్యదృష్టి అనగా, కన్నులుమూసి చూచుట.

పాడ్యమిదృష్టి అనగా, అరకంట చూచుట,

పౌర్ణమిదృష్టి అనగా, సమమైన నిండుకన్నులతో జూచుట.

మొదటిరెండును కొంతకాలమునకు విడిచి మూడవదైన పౌర్ణమి దృష్టే స్థిరపరుచుకోవలెనని బుధజనాభిప్రాయము.

39. అద్వయిత్రయము.

భావాద్వయితము, క్రియాద్వయితము, ద్రవ్యాద్వయితము యీ 3 న్ను అద్వయిత్రయ మనబడును.

పటతంతున్యాయంబుగా కార్యకారణంబులయందు వస్తు
టిమై యుండు నని యెఱింగి యేకత్వాలోచనంబు జేసి వికల్పంబ
భావించుట భావాద్వయిత మనబడును.

క్రియాద్వయితము—మనోవాక్కాయములచేత జేయబ
కర్మంబులకు ఫలభేదంబు జేయక పరబ్రహ్మార్పణంబు జేయుట
ద్వయిత మనబడును.

ద్రవ్యాద్వయితము—పుత్రమిత్రకళత్రాది సర్వప్రాణులకు
కును, దేహంబునకును, పంచభూతాత్మకత్వంబును, భోక్తయొక్క
పరమార్థత్వంబున నర్థకామంబులయెడ నైక్యదృష్టి జేయుట ద్ర
యిత మనబడును.

ముముక్షువులు వ్యవహారకాలమందు యెప్పుడు మనసు
పనుపడ జేయుచుండవలెనని వేదాంతసిద్ధాంతము.

40, లక్షణత్రయము.

జహల్లక్షణము, అజహల్లక్షణము, జహదజహల్లక్షణము
న్ను లక్షణత్రయ మనబడును.

జహల్లక్షణ మనగా, విడిచినలక్షణము.

అజహల్లక్షణ మనగా, విడువనిలక్షణము.

జహదజహల్లక్షణ మనగా, విడిచివిడువనిలక్షణము.

అందు, జహల్లక్షణ మనగా—ఒక బ్రాహ్మణుడు గంగా
దుండి రాగా చూచి మరియొక బ్రాహ్మణుండు గంగాతీరమం
షంబు లేమి యని యడిగెను; అతడు, 'గంగాయాం ఘోషః'
గంగయందు గొల్లపల్లెయున్నదని చెప్పెను, ఈమాటకు తాత్పర
యడిగిన, గంగ యను పదమునకు ప్రవాహ మర్థము. గనుక, అ
మందు గొల్లపల్లెయున్న దని అంగీకరించితె ప్రత్యక్షవిరోధము.
గంగయను పదంబునకు అర్థమైన ప్రవాహమును సర్వాత్మనావిడి
హవుగట్టునందు గొల్లపల్లెయున్న దని తాత్పర్యము చేసుకోవలెను
చేసుకొనుటయే జహల్లక్షణ మనబడును. ఇటువలె మహావాక్య
జహల్లక్షణము చెప్పద మనిన కూడదు. అదియెటువలెనంటే, త
ర్థమైన కూటస్థచైతన్యపర్యంతంబును విడిచిపెట్టినట్టయితెము
[illegible] గనుకను, ప్రత్యక్షవిరోధ

కను యీజహల్లక్షణము కూడదు. ఏలక్షణముచేత నేవాక్యము బ్రహ్మమును బోధించుచున్నదనిన, అన్నమయకోశము మొదలుకొని ఆనందమయకోశపర్యంతంబును పరబ్రహ్మమని చెప్పెడు వాక్యమందు జడమైన కోశంబులు బ్రహ్మ మని చెప్పగూడదు. గనుక, వాటినివిడిచి వాటి కధిష్ఠానభూతంబైన చైతన్యంబునకే తాత్పర్యము చెప్పవలెను. ఇది ఇప్పుడు జహల్లక్షణ మనబడును.

అజహల్లక్షణ మనగా—'మంచాః క్రోశంతి' అను వాక్యమందు మంచములు కూతలు పెట్టుచున్నవనిచెప్పితే ప్రత్యక్షవిరోధము గనుక, మంచములును విడువకనే మంచములమీది పురుషుడు కూతలు పెట్టుచున్నాడని గ్రహించుట జహల్లక్షణ మనబడును.

ఇటువలెనే వేదాంతమందు 'సత్యంజ్ఞానమనంతంబ్రహ్మం' అనెడి వాక్యంబునకుఆవాక్యమందుఆనందమయకోశముతో కూడావుండె ఆత్మను చెప్పుచున్నారు గనుక, సచ్చిదానందంబులను విడువకనే ఆనందమయకోశంబును చెప్పుచున్నది. ఈఅర్థము మహావాక్యమం దంగీకరింతుమనిన కించిత్ జ్ఞత్వాదిగుణములతో గూడుకొనిన చైతన్యమే జీవుడు గనుక, గుణవిశిష్టుడైనవానికి ఐక్యంబు చెప్పగూడదు గనుక, ఇక్కడ అజహల్లక్షణము గూడదు.

జహదజహల్లక్షణ మనగా—'సోయం దేవదత్తః' అనెడి వాక్యంబున గంగాతీరమం దైదోయేట దేవదత్తుని చూచితిమి. ఆదేవదత్తుని కావేరీతీరమందు యాబైయ్యోయేట చూచితిమి, అనే వ్యవహారమందు ఆదేశకాలంబులు యీదేశకాలంబులు వీట్లను కూడుకొనిన పురుషుడే వాక్యార్థమని అంగీకరించితిమేని బహువిరోధ మున్నది. అది యెటువలెనంటే, గంగాతీరము కావేరీతీరము, కావేరితీరము గంగాతీరము, ఆకాలవయస్సు యీకాలవయస్సు, యీకాలవయస్సు ఆకాలవయస్సులు కావు గనుక, ప్రమాణాంతరమైనప్రత్యక్షంబునకు విరుద్ధంబులైయున్నవి కాబట్టి, వాచ్యార్థమైన ఆదేశ ఆకాలంబులను, ఈదేశ యీకాలములను విడిచి లక్ష్యభూతుడైన దేవదత్తుడే వాచ్యార్థముగా నూహింపవలెను. ఇటుల నూహించుటే జహదజహల్లక్షణ మనబడును.

మహావాక్యమందును, తత్పదార్థమునకు వాచ్యార్థమైన మాయా ప్రతిబింబ సర్వజ్ఞత్వాదిగుణంబులకును, త్వంపదార్థమునకు వాచ్యార్థమైన

అవిద్యా ప్రతిబింబ చిదాభాసునకును, వానియొక్క గుణంబులయిన కించజ్ఞత్వాదులకును, అన్యోన్య అయిక్య మంగీకరించినపక్షమందు ప్రత్యక్ష విరోధము గనుక, మాయాసర్వజ్ఞత్వాదిగుణంబులను అవిద్యాకించజ్ఞత్వాదిగుణంబులను తోసివేసి లక్ష్యభూతమయిన చైతన్యమాత్రమునుబట్టి ఆసచ్చిదానందబ్రహ్మమే నీవు. నీవే ఆసచ్చిదానందబ్రహ్మము. అని జహదజహల్లక్షణముచే తెలియదగినది.

## 41. లోకత్రయము.

స్వర్గలోకము, మర్త్యలోకము, పాతాళలోకము యీ 3 న్ను లోకత్రయము.

స్వర్గలోక మనగా, దేవతు లుండునట్టి వూర్ధ్వలోకము.

మర్త్యలోక మనగా, మనుష్యు లుండునట్టి భూలోకము.

పాతాళలోక మనగా, బలిచక్రవర్తి మొదలగువా రుండునట్టి అధోలోకము.

## 42. పాతిత్వత్రయము.

అర్ధప్రబుద్ధత్వము, ఆరూఢపాతిత్వము, వాచావివేకత్వము యీ 3 న్ను పాతిత్వత్రయ మనబడును,

అర్ధప్రబుద్ధత్వ మనగా, వేదాంతశ్రవణము చేసినప్పుడుమాత్రము తాను బ్రహ్మమను తెలివిగలిగియుండి ఇతరవేళల నావివేకము లేక యుంటుట అర్ధప్రబుద్ధత్వ మనబడును.

ఆరూఢ పాతిత్వ మనగా, జ్ఞాననిష్ఠచే అసంగుడై పక్షపాతరహితుడైయుండి అంత కొంతకాలమునకు వర్ణాశ్రమాభిమానియై కర్తృత్వంబులైనవేసుకొని విధినిషేధంబులు జేయుచుండుట ఆరూఢపాతిత్వమనబడును.

వాచావివేకత్వ మనగా, పరతత్వముయొక్క నిష్కర్ష లెస్సగా తెలియనేర్చియు దెలుపనేర్చియు అనుభవములేక లోకవంచకుడై మాటలచేత నంతరిని భ్రమింపజేసి సకల జనులకు బోధజేయుచుండుట వాచావివేకత్వ మనబడును.

ఈమూడును జ్ఞానమునకువిరోధము గనుక, విడిచి వర్తింపుచుండవలెనని బుధజనాభిప్రాయము.

## 43. భావత్రయానుభవము.

దేహభావానుభవము, మనోభావానుభవము, ఆత్మభావానుభవము యీ 3 న్ను భావత్రయానుభవ మనబడును.

దేహభావానుభవ మనగా, బాహ్యప్రపంచమంతయు విచారముచే బయలుజేయుట.

మనోభావానుభవమనగా, ఆబయలుతోడ నధిదేవతారూపమైన చతుర్దశవృత్తులను అఖండాకారవృత్తిగా భావించుట.

ఆత్మభావానుభవ మనగా, ఆవృత్తియునులేక ఆత్మమాత్రుడై యుండుట.

44. దీక్షాత్రయము.

స్వస్తికారోహణదీక్ష, స్పర్శదీక్ష, వేదదీక్ష యీ 3 న్ను దీక్షాత్రయములు.

స్వస్తికారోహణ మనగా, శిష్యుని సిద్ధాసనునిగా గూర్చుండ నియమించుట.

స్పర్శదీక్ష అనగా, శిష్యునిముఖమందుండు పూర్వపువ్రాలు తుడిచి తానొకవ్రాలు విభూతిచేవ్రాసి శిరస్సున హస్తముపుంచి భవమునకు ఝడియవద్దని అభయం బిచ్చుట.

వేదదీక్ష అనగా, వేదవేదాంతశాస్త్రసమ్మతముగా నీవు చైతన్యమాత్రుండవుగాని మరియేదియుం గావని దృఢముగా బోధించుట.

45. త్యాగత్రయము.

కామ్యకర్మత్యాగము, కర్మఫలత్యాగము, సర్వకర్మత్యాగము యీ 3 న్ను త్యాగత్రయ మనబడును.

కామ్యకర్మత్యాగ మనగా, ఇహపరసుఖములను గలుగజేసెడి కర్మముల విడుచుట కామ్యకర్మత్యాగ మనబడును.

కర్మఫలత్యాగ మనగా, సర్వకర్మములును జేసి ఆకర్మఫలంబునందాసక్తిలేక విడుచుట కర్మఫలత్యాగ మనబడును.

సర్వకర్మత్యాగమనగా, సకలమైన సత్కర్మ దుష్కర్మలను విడుచుట సర్వకర్మత్యాగమనబడును. ఇదియే సన్న్యాసమనియుం జెప్పబడును.

46. త్రిగుణములచేనైన సృష్టివివరము.

సత్వగుణమువలన చతుర్ముఖబ్రహ్మ మొదలగు ముప్పదిమూడుకోట్ల దేవతలు బుట్టిరి.

రజోగుణమువలన మనుష్యులు, మృగములు, పక్షులు, పురుగులు, జలచరములు లోనగు సకల జంగమప్రాణులు పుట్టిరి.

తమోగుణమువలన భూమి, పర్వత వృక్ష పాషాణములు మొద లగు స్థావరము లన్నియు బుట్టెను.

ఈత్రిగుణములు ఒక్కటొక్కటితో గలసి సత్వసత్వము, సత్వ రాజసము, సత్వతమస్సు, రజస్సత్వము, రజోరజస్సు, రజస్తమస్సు, తమ స్సత్వము, తమోరజస్సు, తమోతమస్సు అని తొమ్మిదివిధములయ్యెను.

అందు సత్వగుణమందలి సత్వగుణమువలన విరాట్టు, సూత్రేశ్వ రుడు మొదలగువారు బుట్టిరి.

సత్వగుణమందలి రజోగుణమువలన దేవర్షులు, అరువదినాలుగు కోట్ల వాలఖిల్యులు, వైఖానసులు మొదలగువారు జనించిరి.

సత్వగుణమందలి తమోగుణమువలన యక్షులు, రక్షస్సులు, విద్యాధరులు లోనగువారు జన్మించిరి.

రజోగుణమందలి సత్వగుణమువలన మనుష్యు లుదయించిరి.

రజోగుణమందలి రజోగుణమువలన నాలుగుకాళ్లుగల పశువులు, మృగములు లోనగునవి గలిగెను.

రజోగుణమందలి తమోగుణమువలన స్వేదజములు,అండజములు జలచరములు లోనగునవి బుట్టెను.

తమోగుణమందలి సత్వగుణమువలన పైరులు, కసవులు, గడ్డి పంటలు మొదలగునవి పుదయించెను.

తమోగుణములోని రజోగుణమువలన చెట్లు, పొదలు, తీగెలు లోనగునవి జనించెను.

తమోగుణములోని తమోగుణమువలన భూములు, కొండలు, రాళ్లు మొదలగు స్థావరములు పుట్టెను.

మరియు, సత్వమందలి సత్వము మొదలైన యీతొమ్మిదియును వొక్కటొక్కటితో గలసి (1) సత్వతమస్తమస్సు, సత్వతమోరజస్సు, సత్వతమస్సత్వము, (2) సత్వరజస్తమస్సు, సత్వరజోరజస్సు, సత్వరజస్స త్వము, (3) సత్వసత్వతమస్సు, సత్వసత్వరజస్సు, సత్వసత్వసత్వము, (4) రజస్తమస్తమస్సు, రజస్తమోరజస్సు, రజస్తమసత్వము, (5) రజోరజస్త మస్సు, రజోరజోరజస్సు, రజోరజస్సత్వము, (6) రజసత్వతమస్సు, రజ సత్వరజస్సు,రజసత్వసత్వము, (7) తమస్తమస్తమస్సు,తమస్తమోరజస్సు, తమస్తమసత్వము, (8) తమోరజస్తమస్సు, తమోరజోరజస్సు, తమో

రజస్సత్వము, (9) తమస్సత్వతమస్సు,తమసత్వరజస్సు,తమస్సత్వసత్వము అని ఇరువదియేడు భేదములయ్యెను. అందు,

1. (1) సత్వగుణముతో గలసిన తమోగుణమందలి తమోగుణమువలన శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుండు, శంఖుడు మొదలగు సర్పములును, హాహాహూహూ మొదలగు గంధర్వులును, అశ్వముఖంబును, నరశరీరంబునుంగల కిన్నరులును, మాణిభద్రుడు మొదలగు కింపురుషులును, కామరూపధరులును, ముప్పదియార్వురు తుషితులును, నైరృతి మొదలగు రాక్షసులును, అనురేంద్రుడు లోనగు అరువదియారుకోట్ల దైత్యులును, కుబేరుడు లోనగు యక్షులును మొదలగువారుపుట్టిరి.

2. సత్వముతో గలసిన తమోగుణమందలి రజోగుణమువలన ముప్పదిమూకోటిదేవతలును, యముడు అంగీరసుడు అగ్నిష్వాత్తుడు కవ్యవాహనుడు ఆజానుజానులు మొదలగు పితృదేవతలును బుట్టిరి.

3. సత్వముతో గలసిన తమోగుణమందలి సత్వగుణమువలన భూలోకమందలి జనులకు అగ్నిష్టోమాదివైదికకర్మములు జేయ బుద్ధి పుట్టించుటకును వారికి తమసారూప్యాదిపదవుల నిచ్చుటకును శక్తి గలిగి దేవలోకమందుండు కర్మదేవతలును, సూర్యుడు మొదలగు నవగ్రహములును, వానిపరివారసమూహము వసించు లోకములును పుట్టెను.

4. (2) సత్వగుణముతోగలసిన రజోగుణమందలి తమోగుణమువలన అణిమాదిసిద్ధులుగల విశ్వావసు పరావసు ప్రభృతిసిద్ధులును, మనుడు హనుమంతుడు విష్ణుపు ధర్ముడు నారాయణుడు మొదలగు సాధ్యులును, బ్రహ్మర్షులగు సనకాదిమునులు మొదలయినవారును పుట్టిరి.

5. సత్వముతోగలసిన రజోగుణమందలి రజోగుణమువలన నిత్యపవిత్రులగు వసిష్టాగస్త్య దధీచి గౌతమ భారద్వాజాదిఋషులును, శుక వామదేవజాబాల్యాదిమౌనులును, భగవన్నామపరాయణులగు ప్రహ్లాద పుండరీక నారదాంబరీషాది పరమభాగవతులును పుట్టిరి.

6. సత్వముతో గలసిన రజోగుణమందలి సత్వగుణమువలన ఇంద్రుడు మొదలగు దిక్పాలకులును, ముప్పదిమూడుకోట్ల వేలుపులును, బ్రహ్మవిష్ణురుద్రేశ్వర సదాశివులును, బృహస్పతి విశ్వకర్మ నందికుమారగణనాధాదులును, దూర్వాస దత్తాత్రేయాది మహర్షులును, కాలాగ్నిరుద్రపాటకేశ్వరాదులును బుట్టిరి.

7. (౩) సత్వగుణముతో గలసిన సత్వగుణమందలి తమోగుణము వలన విరాట్పురుషుడు హిరణ్యగర్భుడు అవ్యాకృతుడు స్థూలగజేశ్వరుడు సవికల్పక జ్ఞాననిష్ఠులు లోనగువారు పుట్టిరి.

8. సత్వముతో గలసి సత్వగుణ మందలి రజోగుణమువలన సూత్రాత్ముడు సూత్రనాయకుడు నిర్వికల్పకసమాధినిష్ఠులు బ్రహ్మవిదుడు బ్రహ్మవిద్వరుడు బ్రహ్మవిద్వరీయుడు బ్రహ్మవిద్వరిష్ఠుడు లోనగు జీవన్ముక్తులును పుట్టిరి.

9. సత్వగుణముతో గలసిన సత్వగుణ మందలి సత్వగుణమువలన సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము, సత్యకర్తృత్వము, సర్వనియామకత్వము లోనగు మహాగుణములును, సృష్టి స్థితి సంహారము తిరోధానము అనుగ్రహము అనెడి పంచకృత్యములును గల పరమేశ్వరుడును పుట్టెను.

10. (4) రజోగుణముతో గూడిన తమోగుణమందలి తమోగుణమువలన అడవిఈగలు, తేళ్లు, కందిరీగలు. పురుళ్లు, చీమలు, ఈగలు, పాములు, మిడతలు, మింటను మంటను పుట్టు జంతువు లగు మిడుగురు పురుగులు, పట్టుపురుగులు, ముఖమల్పురుగులు, చమటవల్లపుట్టెడు పేల్లు ఈళ్లు చీరపేలు ఎఱ్ఱలు నల్లులు దోమలు లోనగునవి పుట్టెను.

11. రజోగుణముతో గూడిన తమోగుణ మందలి రజోగుణము వలన మొసళ్లు ఎండ్రకాయలు నత్తలు గవ్వలు కాకిచిప్పలు ముత్తెపు చిప్పలు సంకులు చేపలు తాబేళ్లు నీటిపాములు కప్పలు జలగలు లోనగు జలజంతువులు బుట్టెను.

12. రజోగుణముతో గూడిన తమోగుణమందలి సత్వగుణమువలన కాకులు పిచ్చుకలు చిలుకలు గోరువంకలు నెమళ్లు హంసలు కొంగలు చక్రవాకములు చకోరములు గండభేరుండములు శరభములు డేగలు సాళువములు కోకిలములు గరుడపక్షులు గ్రద్దలు కౌజులు వానకోయిలలు గువ్వలు కోళ్లు పావురాళ్లు గిజిగాళ్లు లోనగునవి పుట్టెను.

13. (5) రజోగుణముతో గూడిన రజోగుణమందలి తమోగుణము వలన సింహములు పులులు అడవిపందులు ఎలుగులు నూరపందులు ఎలుకలు పందికొక్కులు కుక్కలు నక్కలు పిల్లులు బల్లులు చివంగులు తోడేళ్లు కుందేళ్లు గాడిదెలు చిరుతపులులు ఉడుములులోనగునవిబుట్టెను.

14. రజోగుణముతోఁ గూడిన రజోగుణమందలి రజోగుణమువలన కోతులు ఏనుగులు గుఱ్ఱములు మేకలు గొఱ్ఱెలు ఎనుములు పునుగు జవ్వాజిపిల్లులు కస్తూరిమృగములు ఒంటెలు ఖడ్గమృగములు లోనగునవి పుట్టెను.

15. రజోగుణముతోఁ గూడిన రజోగుణమందలి సత్వగుణమువలన కామధేనుకులమున బుట్టిన కరియావులు మొదలగు ధేనువులును, చమరీమృగములును, నల్లఇఱ్ఱులు జింకలు దుప్పులు లోనగునవి బుట్టెను.

16. (6) రజోగుణముతోఁ గూడిన సత్వగుణమందలి తమోగుణమువలన శూద్రులు మంగలచాకలమాదిగెలును, శబర హూణ మ్లేచ్ఛ కిరాతకులును, బోయ యెరుక యానాది చెంచు దొమ్మరి కుమ్మరి సాలె జాండ్ర అగసాలె లోనగు జాతులవారును, మద్యమాంసభక్షకులును, జనభయంకరులును, చోరులును, కటికవాండ్రును, మఱియు ఘాతకపు పనులుచేయువారును లోనగువారు బుట్టిరి.

17. రజోగుణముతోఁ గూడిన సత్వగుణమందలి రజోగుణమువలన చదువుట యిచ్చుట పుణ్యకర్మములుచేయుట దుష్టనిగ్రహశిష్టపాలన భూరక్షణములులోనగు పనులుగల రాజులును, దున్నుట ఆవులఁగాచుట బేరమాడుట లోనగు పనులుగల కోమట్లును బేరులు లోనగువారు బుట్టిరి.

18. రజోగుణముతోఁగూడిన సత్వగుణమందలి సత్వగుణమువలన బ్రహ్మవాదులును, వేదశాస్త్రాదివిద్యాధ్యయన సంపన్నులును, బ్రహ్మచర్యాశ్రమాచారవంతులును అయిన ఆంధ్ర కర్ణాట ద్రావిడ ఘూర్జర మహారాష్ట్రులనెడు పంచవిధద్రావిడులును, ఉత్కల మైథుల గౌడ కనోజ సారస్వతసార్వర్యులనెడిపంచగౌడులునుపుట్టిరి. వీరే దశవిధబ్రాహ్మణులు.

19. (7) తమోగుణముతోఁ గూడిన తమోగుణమందలి తమోగుణమువలన నీళ్లులేనిభూములును, కొండలు ముండ్లు చెట్లు గుండ్లు రాళ్లు లోనగునవిగలిగి జనులచేత పోఁగూడని మార్గములును, జనులు సంచరింపదగని కొండలును, మొరపనేలలును, చవిటినేలలును, తృణకాష్ఠజల సమృద్ధులులేక దేవబ్రాహ్మణవర్జితములునునై పరోపకారరహితులగు కేవలతమోగుణజనులకు నివాసములై కంపు చేదు ఉప్పుగల జలములు గలిగి భూతదయాపశ్చాత్తాపములులేక భూత భేతాళ బ్రహ్మరాక్షసాది దుష్టగ్రహనివాసములై తామసాహారములును, తామసయజ్ఞములును,

తామసదానములును, తామసతపస్సులును, తామసశ్రద్ధలునుగల జనులు వసించు గ్రామములుగల దేశములును పుట్టెను.

20. తమోగుణముతో గూడిన తమోగుణమందలి రజోగుణము వలన సారవంతములై పంటలకుదగిన తియ్యనితేటచల్లనినీళ్ళుగలిగి రాజ సాహారములు, దానములు, తపస్సులు, శ్రద్ధలు, యజ్ఞములు గల జన నివాస సంచారయోగ్యము లయిన భూములును, మృదువులై జారచోర కంటకరహితము లయిన మార్గములును, మేలయిన కొండలును, రేగడి మన్ను ఎఱ్ఱనిమన్నుగల నేలలును, మృదువులై మనుష్యకార్యములకు యోగ్యము లయిన రాళ్ళును, సామాన్యజనులచే పూజింపబడెడి దేవ బ్రాహ్మణనివాసయోగ్యములయిన యూళ్లునుగల దేశములునుబుట్టెను.

21. తమోగుణముతో గూడిన తమోగుణమందలి సత్వగుణము వలన గంగాదిపుణ్యానదులును, పవిత్రజలములు గలిగి దేవతలచేత నెల్ల ప్పుడు సేవింపబడెడు కాశి, కాంచి, మధుర, అయోధ్యా, ద్వారవతీ, అవంతిలోనగు పుణ్యపట్టణములుగల భూములును; వెంకటాద్రి, భద్రాద్రి సింహాద్రి, అరుణాచలము, శ్రీశైలము, అగస్త్యగిరి, కైలాసము, హిమా లయము, మేరుగిరి, మందరపర్వతము లోనగు పుణ్యపర్వతములును, గోపి చందన శ్వేత మృత్తికలును, ఫలపుష్పవ్రతయోగ్యము లగు చెట్లు గల నేలలును, సజ్జనసంచారమార్గములును, సాలగ్రామ బాణ లింగ శోణ భద్రా గణపతి స్ఫటికవిమల రాజావర్తములును, యమునా రాళ్లును లోనగు శిలలును, బంగారు లోనగు లోహములుపుట్టెడి చోట్లును, వజ్ర వైడూర్యము లోనగునవి పుట్టెడి గనులుగల నేలలును, బ్రహ్మవిద బ్రహ్మ విద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠ లగు మహాత్ముల సంచారములకు నివాసములకు దగినస్థలములును, సాత్వికాహార దానతపోయజ్ఞశ్రద్ధలును గల జనులకు నివాసస్థానములగు క్షేత్రములును పుట్టెను.

22. (8) తమోగుణముతో గూడిన రజోగుణమందలి తమో గుణమువలన చేదుముండ్లు గలిగి నీడలు పువ్వులు పండ్లులేక నిద్రాలస్య ములు సోమరితనములు లోనగు తామసగుణములుగల దుర్జనులకుదగిన ముష్టి వేప తుమ్మ బలురక్కళి నాగజెముడు తాటితాడి ఈత లోనగు నికృష్టపుచెట్లును, దుర్గంధసహితములైఅల్పజలములుగల యేర్లును పిశాచ దుష్టజన సంచారములకు దగిన యూళ్లును పుట్టెను.

**23.** తమోగుణముతో గూడిన రజోగుణమందలి రజోగుణము వలన రాజసజనులకు యోగ్యములయిన ఫలపుష్పపత్రములు గలిగి అపథ్యములకు భక్షణములకు దగిన నిమ్మ దానిమ్మ జమ్మి మఱ్ఱి కానుగు నేరేడు చింత లోనగు తరువులును, మనుష్యులచే సేవింపదగిన పుష్పములు తీగెలు పొదలు పొదరిళ్లును పుట్టెను.

**24.** తమోగుణముతో గూడిన రజోగుణమందలి సత్వగుణము వలన సాత్వికజనులకు దగిన అరటి పనస మామిడి వెలగ రాగి తులసి బిల్వము మల్లె లోనగు చెట్లును, యజ్ఞములకు దగిన చండ్ర మేడి ప్రత్తి రేణి దర్భ లోనగు చెట్లును, దేవతలు బ్రాహ్మణులును లోనగు ఉత్తముల చేత పూజింపదగిన పద్మములు కలువలును, కల్పకము పారిజాతము మందారము హరిచందనము సంతానము లోనగు కల్పవృక్షములును, పొన్నలు సురపొన్నలు లోనగునవియును పుట్టెను.

**25.** (9) తమోగుణముతో గూడిన సత్వగుణమందలి తమోగుణమువలన తమిద ఉలవ జొన్న కొఱ్ఱ సజ్జ ఆరికె వరిగ మొదలగు క్షుద్రధాన్యములును, ఆవాలు మిరియాలు మిరపకాయలు మొదలైనవి పండెడు నేలలును పుట్టెను.

**26.** తమోగుణముతో గూడిన సత్వగుణ మందలి రజోగుణము వలన నల్లవరి కంది నువ్వు మినుము అనుము ఆముదములు లోనగు పైరులును, జాజికాయలు లవంగములు ఏలకకాయలు పసుపు లోనగునవి పండెడు నేలలును పుట్టెను.

**27.** తమోగుణముతో గూడిన సత్వగుణమందలి సత్వగుణమువలన తెల్లవరి, సన్నవరి, నివ్వరి, వరి, పెసలు, గోధుమలు, యవలు, చామలు, చెఱుకు, మేలగుకాయలు, పండ్లు, ఆకులు, పూవులు మొదలైనవి పండెడు నేలలును బుట్టెను.

ఇవ్విధముగా సమష్టిరూపమైన మూలవిద్య, వ్యష్టిరూపమయిన తులావిద్యయనెడు రెండురూపములుగల మలినసత్వప్రధానయగు మూలప్రకృతి తనత్రిగుణములచేత తొలుత త్రిశక్తులుగా దోచి వెనుక ఆ త్రిగుణ పరస్పరసమ్మేళనమువలన నవవిధములై పిదప ఆనవవిధాన్యోన్యసమ్మేళితముచేత సప్తవింశతివిధములై తెల్లనివస్త్రమున చిత్రములు కల్పితమైనట్లు శుద్ధపరబ్రహ్మమందు పైజెప్పబడిన యిరువదియేడుభేదములు గల సృష్టి

గలయట్లు గనపరచెను. మరి వేదపురుషుడు యీయిరువదియేడు భేదములు గల సృష్టికి కారణమయిన ప్రకృతిమయమగు గాయత్రీ మూడుపాదములును, భూర్భువస్సువయను వ్యాహృతిత్రయముతోడ ఇరువదియే డక్షరములును గలదని చెప్పి దానిని ద్విజాతులగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు తారతమ్యతచేత నుపాస్యముగ నిర్ణయించెను. మరి యాగాయత్రికి మారురూపమగుయజ్ఞోపవీతమును మూడుసూత్రములుగలది. అందొక్క సూత్రమునకు మూడేసి అంతరసూత్రములు గలవు. ఆయాంతరసూత్రములయం దొక్కటొక్కటికి మూడుమూడుపోగులు గలవు. గాన, మూడు పెద్దపోగులు గల ఆయజ్ఞోపవీతము ఇరువదియేడుపోగులు గలదయ్యెను. ఆతంతువులై ఇరువదియేడు భేదములుగల జగత్తు ఆజగద్రూపమగు యజ్ఞోపవీతమునే గాయత్రియని ద్విజాతులు ధరించి పరబ్రహ్మము నుద్దేశించి సర్వకర్మములు చేయవలయు ననియు, దానిధరించుదాక కర్మకాండ మనుష్ఠింపవలయుననియు, వెనుక సద్గురుకరుణచేత విజ్ఞానముగలిగి గాయత్రీయజ్ఞోపవీత ప్రపంచవిచారణ చేసి యజ్ఞోపవీతమందలి మూడు తంతువులకు కూటస్థానమైనముడియే బ్రహ్మముడియనియు, అదియేఅమల సత్వప్రధానయగు గుణసామ్యావస్థ యనియు తెలిసి ఆయజ్ఞోపవీతమును పరిత్యజించుటే సన్యాస మనియు, అతడే బ్రహ్మకాండ మనుష్ఠించువాడనియు తెలిపెను. ఈకిటుకు తటుకున దెలిసినవాడె సర్వకర్మవిముక్తుడు. జీవన్ముక్తుడు, పైజెప్పిన యీయిరువదియేడుభాగములును సారెసారెకు వొకటితో నొకటి కలయగా అనేకవిధ సృష్టులు గలుగును.

### 47. గుణత్రయము.

సత్వగుణము, రజోగుణము, తమోగుణము యీ 3 న్ను గుణత్రయము లనంబడును.

సత్వగుణమువలన సత్యము, ఆచారము, తపము మొదలయిన సద్గుణములు గలుగును.

రజోగుణమువలన లోభము, పరద్రవ్యాదికాంక్షయు, కర్మముల యొక్క ఆరంభమందు శమము లేకపోవుటయు, కోర్కెయు ఇవి మొదలయిన గుణములు గలుగును.

తమోగుణమువలన వివేకము లేకపోవుటయు, మోహము మొదలైన గుణములు గలుగును.

48. త్రిగుణముల వివరము.

సత్వగుణము, రజోగుణము, తమోగుణము యీ 3 న్ని త్రిగుణము లనంబడును.

యీత్రిగుణములకు అన్యోన్య మిథునసత్వమున్ను, అన్యోన్య సంశ్రయమున్ను, అన్యోన్యసంకలితానువృత్తిభావమున్ను, అన్యోన్యసజీవనాచరణంబును గలిగియుండును. మరియు, దుర్బోధత్వ గాఢభంగులై యుండు తమోగుణంబు నడచి రజోగుణంబును, రజోగుణంబు నడచి సత్వగుణంబును, సత్వగుణంబు నడచి తమోగుణంబును పునఃపునఃప్రకాశించునని తెలియవలయు.

సత్వగుణము—సంతోషమును, ప్రకాశత్వంబును, ప్రియమును, ఆనందమును, కరుణాపరత్వము, క్షమయు, సత్యంబును, శౌచంబును, ధృతియును, తితిక్షయు, సహింసయు, నార్జవమును, అనసూయయు, క్రోధరాహిత్యయును, నసంరంభతయును, సమత్వమును, శ్రద్ధయును, దాతృత్వమును, అక్రూరభావంబును, లజ్జయు ఇవి మొదలైన గుణములు సత్వగుణమువలన పుట్టినవని తెలియవలెను. ఇవి పూర్వజన్మమందు గలిగి యుండువార లీజన్మమందు అహంకృతి, మమత్వ, తృష్ణ, కామార్తి లేక అతిశయమయిన జ్ఞానముచే పరిపూర్ణులై పూర్ధ్వలోక వైభవములు గను వారని తెలియవలయును.

రాజసగుణము—బలమును, శౌర్యమును, ముదమును, ప్రాభవమును, కాంక్షయును, ప్రతాపమును, కలహమును, ఈర్ష్యయును, బహువికల్పవుభావలును, కామినీజనంబులయెడ గాఢరాగతయు, బోంకును మొదలయిన నివి రజోగుణమువలన బుట్టినవని తెలియవలెను. యీగుణములు పూర్వజన్మమందు గలిగినట్టివారలీజన్మమందు అవిసీసులై త్రివర్గను లై అర్ధములబొంపెరిబోవుచు కామసౌఖ్యవైభవముల విజ్రుంభించుచు మనుజ భావమున బొందుదురని తెలియవలెను.

తమోగుణము—లోభము, శోకము, నిద్ర, భయము, పాపకర్మము, మూఢత్వము, శౌర్యము, కోపము, మాత్సర్యము మొదలయిన నివి తమోగుణమువలన బుట్టినవని తెలియవలెను. ఈగుణములు పూర్వజన్మమందు గలవారలు యీజన్మమందు పాములు, తేళ్లు, పశువులు, పందులు, కుక్కలు కోళ్లు, చీమలు, కాకులు, క్రిములు, జింకలు, నక్కలు, గొంగనక్కలు, దోమలు

ద్రమాకులు, పోలు మొదలయిన భావములు బొందుదురని తెలియవలెను.

49. ప్రస్థానత్రయము.

ఉపనిషద్భాష్యము, గీతాభాష్యము, సూత్రభాష్యము ఈ 3 న్ను ప్రస్థానత్రయ మనబడును. లేక, అకార ఉకార మకారాత్మకమయిన ప్రణవము ప్రస్థానత్రయ మనంబడు.

50. జ్ఞానత్రయము.

సాత్వికజ్ఞానము, రాజసజ్ఞానము, తామసజ్ఞానము యీ3న్ను జ్ఞానత్రయ మనబడును.

భిన్నముగాదోచు సర్వభూతములలో పరమాత్మ డభిన్నుడై యున్నాడని తెలియునది సాత్వికజ్ఞాన మనబడును,

సర్వభూతములను పరమాత్మను భిన్నముగా దెలియునది రాజసజ్ఞాన మనబడును.

తామ్రమాద్రిప్రతిమెలను దైవమనియెంచి పూజించునది తామసజ్ఞాన మనబడును.

51. కర్తృత్రయము,

సాత్వికకర్త, రాజసకర్త, తామసకర్త యీముగ్గురున్ను కర్తృత్రయములు.

సాత్వికకర్త యనగా, సంగరహితుడై అహంకారరహితుడై ధైర్యోత్సాహములతోగూడి ప్రాప్యాప్రాప్తులయందు నిర్వికారుడైయుండు వాడు సాత్వికకర్త యనంబడును.

రాజసకర్త యనగా, కర్మఫలాసక్తుడై ద్రవ్యాభిలాషియై పరపీడకుడై హర్షశోకయుతుండై ఆచారవర్జితుండైయుండువాడు రాజసకర్త యనంబడును.

మనోనిగ్రహము లేక బుద్ధిహీనుడై మాయావియై దీర్ఘసూత్రియై దుఃఖశీలుడై పరుల నవమానించునట్టివాడు దామసకర్త యనంబడును.

52. బుద్ధిత్రయము.

సాత్వికబుద్ధి, రాజసబుద్ధి, తామసబుద్ధి యీ 3 న్ను బుద్ధిత్రయ మనబడును.

సాత్వికబుద్ధియనగా, ప్రవృత్తిన్ని నివృత్తిన్ని కార్యాకార్యములనున్ను బంధమోక్షములనున్ను భయాభయములనున్ను కర్తవ్యాకర్తవ్యములనున్ను యెరిగెడిది సాత్వికబుద్ధి యనబడును.

కార్యాకార్యములనున్ను, కర్తవ్యాకర్తవ్యములనున్ను యెరుగని బుద్ధి రాజసబుద్ధి యనబడును.

కార్యమును అకార్యముగాను, అకార్యమును కార్యముగాను యెరిగెడిబుద్ధి తామసబుద్ధి యనంబడును.

53. సుఖత్రయము.

సాత్వికసుఖము, రాజససుఖము, తామససుఖము యీ ౩ న్ను సుఖత్రయ మనబడును.

సాత్వికసుఖము—యోగాభ్యాసాదులచేత తొలుత విషమువలె నున్ను, అంతమందు అమృతతుల్యముగానున్ను అవుచున్నదో అది సాత్విక సుఖ మనబడును.

రాజససుఖము — యేసుఖము విషయేంద్రియసంబంధమువలన మొదట అమృతతుల్యముగానున్ను, అంతమందు విషమువలెనున్ను అవుచున్నదో అది రాజససుఖ మనబడును.

తామససుఖము—నిద్రాలస్య ప్రమాదములవలనబుట్టి అనుభవ కాలమందున్ను, విపాకమందున్ను యేది మోహముచేత సుఖముగా దోచునో నది తామససుఖ మనబడును.

54. మరియొకవిధ సుఖత్రయము.

ప్రియము, మోదము, ప్రమోదము యీ ౩ న్ను సుఖత్రయ మన బడును.

ప్రియ మనగా, ఇష్టవస్తువును చూచినమాత్రముచేత గలిగెడి సుఖము,

మోద మనగా, ఆయిష్టవస్తువు తనకు లభించినందువలన గలిగెడి సుఖము,

ప్రమోద మనగా, ఆయిష్టవస్తువు తాననుభవించుటచేత గలిగెడి సుఖము.

55. శక్తిత్రయము.

జ్ఞానశక్తి, క్రియాశక్తి, ద్రవ్యశక్తి యీ ౩ న్ను శక్తిత్రయము.

జ్ఞానశక్తి అనగా, సత్వగుణకార్యము,

ద్రవ్యశక్తి అనగా, రాజసగుణకార్యము,

క్రియాశక్తి అనగా, తమోగుణకార్యము.

### 56. బంధత్రయము.

సాత్వికబంధము, రాజసబంధము, తామసబంధము యీ ౩ న్ను బంధత్రయ మనబడును.

సాత్వికబంధ మనగా, జీవునిప్రకాశముతోనున్ను, వుపద్రవరహిత మయిన సుఖముతోనున్ను అరికట్టునది,

రాజసబంధమనగా, రానివస్తువులు కోరుటచేతనున్ను, ప్రాప్తమైన వస్తువులయందుప్రీతిచేతనున్ను, అనురాగముచేతనున్ను జీవునిఅరికట్టునది.

తామసబంధ మనగా, అజ్ఞానముచేతనున్ను, దుఃఖముచేతనున్ను, అప్రకాశముచేతనున్ను జీవుని అరికట్టునది.

### 57. మరియొకవిధ బంధత్రయము.

మూలబంధము, ఒడ్యాణబంధము, జాలంధరబంధము యీ౩న్ను బంధత్రయ మనబడును.

మూలబంధమనగా, యెడమకాలిమడిమెను గుదస్థానముబంధించి అపానవాయువును ఊర్ధ్వవీధికి నాకుంచనంబు గావించుట.

ఒడ్యాణబంధ మనగా, కుడికాలిమడిమెచేత నాభిక్రిందుమీదును బలువుగా బంధించుట,

జాలంధరబంధమనగా, కంఠ మాకుంచనముచేసి దృఢముగా చుబుకము హృదయమున బంధించి ఊర్ధ్వభాగామృతకుండలిని పెకలించుట.

### 58. శ్రద్ధాత్రయము.

సాత్వికశ్రద్ధ, రాజసశ్రద్ధ, తామసశ్రద్ధ యీ ౩ న్ను శ్రద్ధాత్రయ మనబడును.

సాత్వికశ్రద్ధ యనగా, ఇంద్రాదిదేవతలను పూజించునది.

రాజసశ్రద్ధ యనగా, యక్షరాక్షసుల పూజించునది,

తామసశ్రద్ధ యనగా, భూతప్రేతపిశాచముల పూజించునది.

గుణత్రయాది యేతావత్పరియంతంబునకు ఫలం బేమనిన, పూర్వోక్తప్రకారము గుణత్రయముయొక్క స్వరూపమును దెలిసి యాగుణత్రయాతీతు డాయెనేని జన్మమృత్యుజరాదుఃఖములచేత విడువబడినవాడై మోక్షమునుబొందు, యాగుణత్రయాతీతుడయినవాని లక్షణంబెట్లుండు ననిన, తమోగుణకార్యములనుగూర్చి ద్వేషమున్ను, పోయిన సత్వగుణ కార్యములనుగూర్చి జిజ్ఞాసయున్ను లేక పక్షపాతరహితుడై గుణములచేత

తాను చలించక గుణములు చలింపుచున్నవని యెఱింగి మానావమాన ములనున్ను, సుఖదుఃఖములనున్ను, శత్రుమిత్రులనున్ను సమముగా జూచుచు సర్వారంభములను విడిచి వర్తించువాడు గుణాతీతు డనిన్ని, జీవన్ముక్తుడనిన్ని తెలియుటే ఫలము.

59. ఆకాశత్రయము.

మహాకాశము, చిత్తాకాశము, చిదాకాశము యీ 3 న్ను ఆకాశ త్రయ మనంబడును.

మహాకాశ చిత్తాకాశములు రెండున్ను శూన్య మనిన్ని, చిదా కాశ మాత్మస్వరూపమనిన్ని పండితజనాభిప్రాయము.

60. అంహాదిత్రివిధపాపములు.

అంహో, ఆగో, ఏనస్సు యీ3న్ను అంహాదిపాపత్రయ మనంబడు.

అంహో పాప మనగా, శాస్త్రవిహితమైన కర్మపరిత్యాగము.

ఆగ పాప మనగా, శాస్త్రగర్హితకర్మాచరణము.

ఏనస్సు పాప మనగా, ఇంద్రియనిగ్రహములేక స్వేచ్ఛగా భోగిం చుట.

61. మౌనత్రయము.

వాఙ్మౌనము, అక్షమౌనము, కాష్ఠమౌనము యీ 3 న్ను మౌన త్రయ మనంబడు.

వాఙ్మౌన మనగా, నోటిచే మాటలాడకుండుట.

అక్షమౌన మనగా, ఇంద్రియములగురించి పట్టుట.

కాష్ఠమౌన మనగా, చేష్టారహితుడైయుండుట.

62. త్రివిధాధ్యయనము.

వాచికము,ఉపాంశు,మానసికము ఈ3న్నుత్రివిధాధ్యయనములు.

వాచికమనగా, మూలమంత్రాదులు పరులు వినునట్లు పఠించుట.

ఉపాంశు అనగా, పరులకు వినరాకుండా పఠించుట,

మానసిక మనగా, కేవలమనస్సున అక్షరవిరళముగా పఠించుట.

యీమూడున్ను యేకోత్తరగుణములు గలవని యెఱుంగవలెను.

63. తాదాత్మ్యత్రయము.

సహజన్యతాదాత్మ్యము, కర్మజన్యతాదాత్మ్యము, భ్రాంతిజన్య తాదాత్మ్యము యీ 3 న్ను తాదాత్మ్యత్రయ మనబడును.

సహజన్యతాదాత్మ్య మనగా, చిత్తు అహంకారమందు ప్రతిబింబించి ఆప్రతిబింబమును ఆయహంకారమునుగూడి తప్తాయఃపిండమువలె నొక్కటై చిత్తువలె దోచును. ఆచిత్ప్రతిబింబమున గూడిన యహంకారమునకు ఆప్రతిబింబముతోడి తాదాత్మ్యము సహజన్యతాదాత్మ్య మనబడును. అదియెట్లనిన, రెండుకూడాబుట్టినవి గనుక, సహజన్యతాదాత్మ్య మనబడును.

చిత్ప్రతిబింబమునుగూడి చిత్తువలె దోచునట్టి అహంకారము స్థూలదేహముతో జేరినప్పుడు ఆయహంకారమునకు స్థూలశరీరముతోడి తాదాత్మ్యము కర్మజన్యతాదాత్మ్య మనబడును. జాగ్రద్భోగమైనకర్మము జనించినప్పుడు ఆకర్మము నశించెనేని తాను నశించు గనుక, దీనికి కర్మజన్యతాదాత్మ్యమని పేరు గలిగెను. కర్మముగలిగిన తాదాత్మ్యము గలుగును. కర్మము లేకున్న తాదాత్మ్యము లేదనుటకు జాగ్రత్స్వప్నములే దృష్టాంతము.

భ్రాంతిజన్యతాదాత్మ్య మనగా, కర్మజన్యతాదాత్మ్యమువలన స్థూలదేహము చేతనమువలె నయ్యెను. నేను బ్రాహ్మణుడను, క్షత్రియుడను, వైశ్యుడను, శూద్రుడను, బ్రహ్మచర్యాదిచతురాశ్రమములుగలవాడను అను చిత్తవృత్తులతోగూడియుండెడి అహంశబ్దార్థమైన సాక్షితోడి తాదాత్మ్యము భ్రాంతిజన్యతాదాత్మ్య మనంబడును. సర్వాధిష్టానమైన ఆత్మస్వరూపము తానని యెరుగనందున వచ్చినది గనుక, దీనికి భ్రాంతిజన్యతాదాత్మ్యమని పేరు గలిగెను.

ఈతాదాత్మ్యత్రయమునకు నివృత్తి యెప్పుడనిన, సంబంధమైన చిచ్ఛాయ అహంకారమై నెందాకయుండునో అందాక సహజతాదాత్మ్యమునకు నివృత్తిలేదు. ఆయహంకారము నశింపగానే సహజతాదాత్మ్యమునకు నివృత్తియని తెలియవలెను. ప్రతిదినము కర్మప్రదమైనకర్మమువలన బుట్టిన కర్మమునకు సుషుప్తికాలమందు నాశమువచ్చుచుండగా ఆ కర్మజన్యతాదాత్మ్యమునకు నాశమని కనుగొనవలయు. ఇది సర్వానుభవసిద్ధము. ఈకర్మజన్యతాదాత్మ్యమునకు విదేహకైవల్యమందాత్యంతిక నాశము. భ్రాంతిజన్యతాదాత్మ్యమునకు నేను బ్రహ్మమను జ్ఞానము గలిగినప్పుడు నశించును. యెవ్వ డీతాదాత్మ్యత్రయమును విచారించి ఇది యహంకారంబునకుగాని అహంకారసాక్షియు, నిర్వికారుడు, అసంగుడు

నైన నాహు లేదని యెఱుగువాడె ముక్తుడని వేదాంతశాస్త్రసిద్ధాంత

64. వృత్తిత్రయము.

శాంతవృత్తి, ఘోరవృత్తి, మూఢవృత్తి యీ 3 న్ను వృత్తిత్రయ మనబడును.

65. మరియొకవిధ దీక్షాత్రయము.

ద్రుగ్దీక్ష, వాగ్దీక్ష, స్పర్శదీక్ష యీ3న్ను దీక్షాత్రయమనంబడును.

66. ముక్తిత్రయము.

క్రమముక్తి, జీవన్ముక్తి, విదేహముక్తి యీ 3 న్ను ముక్తిత్రయ మనంబడు.

67. బాహ్యాంతరమధ్యత్రిపుటులు.

కర్త, హేతు, క్రియలు యీ 3 న్ను బాహ్యత్రిపుటులు.

జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు యీ3న్ను అంతరత్రిపుటి యనంబడు.

ద్రష్ట, దర్శన, ద్రుశ్యములు యీ 3 న్ను మధ్యత్రిపుటులు అనం బడును. దీనికే నవవిధసంస్కారములని అంతరనవవిధప్రపంచమని చెప్ప బడును.

68. వర్గత్రయము.

ధర్మము, అర్ధము, కామము యీ 3 న్ను వర్గత్రయ మనబడును.

ధర్మ మనగా, యజ్ఞదాన తపాదికర్మలు.

అర్థ మనగా, ధనధాన్యవస్తువాహనాదులు.

కామ మనగా, దారాసుతాదుల గోరుట.

69. ఈశ్వరత్రయము.

విరాట్టు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు యీ3న్ను యీశ్వరత్రయ ములు.

విరాట్టు అనగా, సమష్టి. స్థూలశరీర జాగ్రదావస్థాభిమాని. ఇత నికే వైశ్వానరుడనిన్ని, విరాజుడనిన్ని నామములు.

హిరణ్యగర్భు డనగా, సమష్టి. సూక్ష్మశరీర స్వప్నావస్థాభిమాని. ఇతనికే సూత్రాత్మయనిన్ని, ప్రాణుడనిన్ని నామములు.

ఈశ్వరు డనగా, సమష్టి. కారణశరీర సుషుప్త్యవస్థాభిమాని. ఇత నికే అంతర్యామియనియు, అవ్యాకృతుండనియు నామములు.

70. జీవత్రయనామములు.

విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు యీ 3 న్ను జీవత్రయమనబడును.

విశ్వుడనగా, వ్యష్టి, స్థూలశరీర జాగ్రదావస్థాభిమాని. ఇతనికే వ్యవహారికుడనియును, చిదాభాసుడనియును పేళ్లు.

తైజసుడనగా, వ్యష్టి, సూక్ష్మశరీర స్వప్నావస్థాభిమాని. ఇతనికే ప్రాతిభాసికుడనియు, స్వప్నకల్పితుడనియు పేళ్లు.

ప్రాజ్ఞుడనగా, వ్యష్టి, కారణశరీర సుషుప్త్యవస్థాభిమాని. ఇతనికే పారమార్థికుడనియు, అవచ్ఛిన్నుడనియు పేళ్లు.

## 71. గతిత్రయము.

ఊర్ధ్వగతి, మధ్యగతి, అధోగతి యీమూన్ను గతిత్రయమనబడును.

ఊర్ధ్వగతి యనగా, పుణ్యకర్మము జేసినందువలన స్వర్గమునకు బోవుట.

మధ్యగతి అనగా, మిశ్రకర్మము జేసినందువలన మనుష్యలోకమునకు వచ్చుట.

అధోగతి యనగా, పాపకర్మము జేసినందువలన నరకమునకు బోవుట.

## 72. త్రివిధప్రసాదములు.

ఇది అతిరహస్యమవుటచేత నిందు దెలుపలేదు.

## 73. జాగ్రావస్థోల్లాస మహావాక్యత్రయము.

జాగరములో జాగరము, జాగరములో స్వప్నము, జాగరములో సుషుప్తి యీమూన్ను జాగ్రావస్థోల్లాసమహావాక్యత్రయ మనబడును.

జాగరములో జాగర మెట్లనగా, స్థూలసూక్ష్మకారణదేహములను అనిత్యమనియును, జడమనియును, దుఃఖాత్మకమనియును జూడగా దృశ్యంబగు జగత్తు మిథ్యయగుచు, అప్పుడు యిన్నిటిలో వెలుగుచు సాక్షియై యున్న చైతన్యము యేకమై యుండును. అట్టి సచ్చిదానందస్వరూపము యెప్పుడుగనునో అప్పుడా యవస్థ జాగరములో జాగరమనబడును. ఇదియే త్వంపదార్థదర్శనము అనగా జీవునిగా దెలియుట.

జాగరములో స్వప్నము — ఈభూమియందు గనుపించు దేహేంద్రియాదివిషయములు అసత్యములైనవై సచ్చిదానందస్వరూపమగు సాక్షి చైతన్యమందు బుట్టి దానివలననే వృద్ధియై దానివలననే లయమగునని యెరుంగుట జాగరములో స్వప్నమనబడును. ఇదియే తత్పదార్థదర్శనము అనగా, ఈశ్వరునిగా నెరుగుట.

జాగరములో సుషుప్తి—అఖండపరిపూర్ణమై వెలిగెడి జ్ఞానంబు దక్క మరియేమియులేదని సుషుప్తికాలమున విషయములమరచియేతీరున వుండునో ఆతీరున త్రిపుటి మొదలగు విషయములు వక్కటిలేదని నిశ్చలాత్ముడైయుండుట జాగరములో సుషుప్తియనబడును. ఇదియే అశిపదార్థదర్శనము అనగా, జీవేశ్వరు లయిక్యమై పరమాత్మ గనుపించుట.

ఈప్రకారము జీవేశ్వరైక్యము గలిగి శేషించిన పరమాత్మ నేనని నిత్యంబు నవలోకింపవలెనని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

74. ఆత్మనిశ్చయబుద్ధిత్రయము.

దేహాత్మనిశ్చయబుద్ధి, జీవాత్మనిశ్చయబుద్ధి, పరమాత్మనిశ్చయబుద్ధి యీ 3 న్ను ఆత్మనిశ్చయబుద్ధిత్రయ మనబడును.

దేహాత్మనిశ్చయబుద్ధి యనగా, దేహమే ఆత్మయని యెరిగెడిబుద్ధి.

జీవాత్మనిశ్చయబుద్ధి యనగా, జీవుడే ఆత్మయని యెరిగెడిబుద్ధి.

పరమాత్మనిశ్చయబుద్ధి అనగా, పరమాత్ముడే ఆత్మ యని యెరిగెడిబుద్ధి.

ఇందు దేహాత్మబుద్ధిగలిగినప్పుడు భగవంతునకు నేను దాసుడ నని భజింపుచుండవలయు.

జీవాత్మబుద్ధి గలిగినప్పుడు నేను భగవదంశసంభూతుడ నని తెలిసి ధ్యానింపుచుండవలయును.

పరమాత్మబుద్ధిగలిగినప్పుడు నేనే పరమాత్ముడ నని తెలిసి ఆనందింపుచుండవలయును. ఇట్లని శ్రీఆంజనేయాభిప్రాయము,

75. భేదత్రయము.

స్వజాతీయ్యభేదము, విజాతీయ్యభేదము, స్వగతభేదము యీ 3న్ను భేదత్రయ మనబడును.

వృక్షమునకు వృక్షము యెట్లు స్వజాతీయ్యమో అట్లే ఆత్మకు సర్వభూతాత్మలు స్వజాతీయ్యభేద మనబడును.

వృక్షమునకు పాషాణాదు లెట్లు విజాతీయ్యభేదమో అట్లేఆత్మకు శరీరము విజాతీయ్యభేద మనబడును.

వృక్షమునకు పత్రపుష్పఫలాదు లెట్లు స్వగతమో అట్లే ఆత్మకు విషయములు స్వగతభేద మనబడును.

ఈభేదత్రియము ఉపాధివలన గలిగినదే కాని, మాయాస్వరూప

మగు ఉపాధిని తోసివేసి విజ్ఞానదృష్టిని చూచిన సర్వాత్మనా ఆత్మకు యీభేదత్రయము లేదని వేదాంతసిద్ధాంతము.

76. పరమాత్మనామత్రయము.

ఓం, తత్, సత్ యీ 3 న్ను పరమాత్మని స్మరింపదగిన నామత్రయములు.

ఓం—దీనిచేత బ్రాహ్మణులున్ను, వేదములున్ను, యజ్ఞములున్ను పూర్వకాలమందు నిర్మింపంబడినవి, ఆకారణమువలన శాస్త్రోక్తములైన వేదవాదశీలులయొక్క యజ్ఞదానతపస్సు లనెడి క్రియలు యెల్లప్పుడున్ను ఓం అని ఉచ్చరించి ఆరంభింపబడుచున్నవి.

తత్—ముముక్షువులచేత తత్ అనెడి పరమాత్మని పేరు ఉచ్చరించి ఫలము నపేక్షింపక యజ్ఞదానాదిక్రియలు చేయబడుచున్నవి.

సత్—కద్దనుటయందున్ను, శ్రేష్ఠ మనుటయందున్ను ప్రశస్తమైన కర్మమందును యజ్ఞదానతపస్సులు మొదలయిన సత్కర్మలయందు సత్ అనెడి పరమాత్మనినామము వర్తించును.

ఫలం—అవిశ్వాసముచేత యేదిజేయబడుచున్నదో అదిఅంతయు అసత్ అని చెప్పబడును. ఇవి యిహపరములలో నిష్ఫలమని పూర్వోక్త నామత్రయానుసంధానముచే సత్కర్మ జేయవలెనని శ్రీకృష్ణాభిప్రాయము.

77. భోజనత్రయము.

సాత్వికభోజనము, రాజసభోజనము, తామసభోజనము యీ3న్ను భోజనత్రయ మనబడును.

సాత్వికభోజనమనగా, రసయుక్తములైనట్టిన్ని చమురుతోగూడినట్టిన్ని స్థిరకాలస్థాయులైనట్టిన్ని ప్రియములైనట్టిన్నిఆయుస్సత్వబలారోగ్యసుఖ ప్రీతివృద్ధికరములైనట్టిభోజనములు సత్వగుణముగలవారలకు ఇష్టములైనవి.

రాజసభోజనము—దుఃఖశోకరోగప్రదములయిన కట్వామ్లలవణా త్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహిన్యాదిభోజనములు రజోగుణము గలవానికి ప్రియము లయినవి.

తామసభోజనము—జాము వెళ్ళి చల్లనయినదిన్ని, రసవర్జిత మైనదిన్ని, దుర్గంధము గలిగినదిన్ని, పక్వమయిన రాత్ర్యంతరిత మయినదిన్ని, భుక్తావశిష్ట మయినదిన్ని, అపవిత్ర మయినదిన్ని యేదిగలదో అభోజనము తమోగుణముగలవానికి యిష్టమైనది,

### 78. స్వప్నభేదత్రయము.

గ్రాహ్యము, అగ్రాహకము, గ్రాహయితృత్వము యీ 3 న్ను స్వప్నభేదములు.

---

## చతుస్సంఖ్యాప్రకరణము.

---

### 1. సాధనచతుష్టయము.

నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము యీ 4 న్ను సాధనచతుష్టయ మనబడు.

నిత్యానిత్యవస్తువివేక మనగా, చరాచరాత్మకం బైన ప్రపంచం బంతయు అనిత్య మనియును, పరమాత్ముఁడు నిత్య మనియును దెలియుట నిత్యానిత్యవస్తువివేక మనంబడును.

శమాదిషట్కసంపత్తి అనగా, శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, భక్తి అనే ఆరువిధములు. వీనికి వివరము. శమ మనగా, అంతరింద్రియనిగ్రహము. దమ మనగా, బాహ్యేంద్రియనిగ్రహము. ఉపరతి అనగా, అరిషడ్వర్గముల జయించుట. తితీక్ష యనగా, సుఖదుఃఖములకు నోర్చుట. శ్రద్ధ యనగా, గురువేదాంతవాక్యేశ్వరులయం దుండు విశ్వాసము. భక్తి యనగా, ఆగురువేశ్వరులను నిరంతరంబు భజియించుట. ఈ 6 న్ను శమాదిషట్కసంపత్తి యనబడును.

ముముక్షుత్వ మనగా, మోక్షమును గోరి కాలెడుచుయింట్లోనుంచి బయలుదేరిపోవుచందాన గురువులను జేరి శ్రవణాదులు జేయుట ముముక్షుత్వ మనబడును.

వేదాంతవిద్యయందు యీసాధనచతుష్టయసంపత్తిగలవాడే అధికారిగాని యితరు లధికారులు గారని సిద్ధాంతము.

### 2. అంతఃకరణచతుష్టయము.

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము యీ 4 న్ను అంతఃకరణచతుష్టయ మనబడును.

మనస్సునకు హృదయము, పా గళాంతమస్థానము, సంకల్పవికల్పములు కార్యము, చంద్రు డధిష్టానదేవత.

బుద్ధికిముఖస్థానము, చతుర్ముఖుండధిష్టానదేవత,నిశ్చయముకార్యం.
చిత్తమునకు నాభిస్థానము, క్షేత్రజ్ఞుం డయిన్నజీవు డధిష్టానదేవత, ధ్యానము కార్యము,

అహంకారమునకు హృదయస్థానము, రుద్రు డధిష్టానదేవత, అభిమానము కార్యము,

3. అంతఃకరణచతుష్టయచక్రము.

| కరణములు - | మనస్సు. | బుద్ధి. | చిత్తము. | అహంకారం. |
|---|---|---|---|---|
| స్థానములు - | గళాంతము. | ముఖము. | నాభి. | హృదయము. |
| అధిదేవతలు - | చంద్రుడు. | బ్రహ్మ. | క్షేత్రజ్ఞుడు. | రుద్రుడు. |
| కార్యములు - | సంకల్పము. | నిశ్చయము. | ధ్యానము. | అభిమానము. |

4. కర్మచతుష్టయము,

విధియు, నిషేధము, ప్రాయశ్చిత్తము, కామ్యకర్మ యీ 4 న్ను కర్మచతుష్టయ మనబడును.

5. చతుర్విధశుశ్రూషలు,

ఆత్మశుశ్రూష,అంగశుశ్రూష,స్థానశుశ్రూష, సద్భావశుశ్రూష యీ4న్ను చతుర్విధశుశ్రూష లనబడును.

ఆత్మశుశ్రూష యనగా, గురువుకోరిన వస్తువులు శక్తికొలది సమర్పించుట,

అంగశుశ్రూషయనగా, గురుమూర్తికి అభ్యంగన పదసేవ భూషణాలంకరణాదులు సేయుట,

స్థానశుశ్రూషయనగా, గురువునుగృహారామక్షేత్రాదులయందు పోషించుట,

సద్భావశుశ్రూష యనగా, గురువే సాక్షాత్పరబ్రహ్మ మని ధ్యానించుచుండుట,

6, రూపచతుష్టయము,

రక్తము, శ్వేతము, పీతము, కృష్ణము యీ4న్ను రూపచతుష్టయ మనబడును,

రక్త మనగా యెఱుపు, శ్వేత మనగా తెలుపు, పీత మనగా పసుపు పచ్చ, కృష్ణ మనగా నలుపు,

7. జీవాంగచతుష్టయము.

రక్తము, శ్వేతము, పీతము, కృష్ణము యీ 4 న్ను జీవాంగచతుష్టయ మనబడు. చతుస్థితమైన యీనాల్గువర్ణములున్ను ప్రత్యేకము. జీవాంగములని తెలియువలయు.

8. ఆత్మాంగచతుష్టయము.

స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము యీ 4 న్ను ఆత్మాంగచతుష్టయ మనంబడును.

పూర్వముజెప్పిన రక్తవర్ణమే స్థూలము.
శ్వేతవర్ణమే సూక్ష్మము.
పీతవర్ణమే కారణము.
కృష్ణవర్ణమే మహాకారణము అని తెలియదగినవి.

9. మహావాక్యచతుష్టయము.

అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానంబ్రహ్మ, అయమాత్మబ్రహ్మ, తత్వమసి యీ4న్ను మహావాక్యచతుష్టయ మనబడును.

అహంబ్రహ్మాస్మి దీనికర్థము. అహం, బ్రహ్మ, అస్మి అని మూడు పదములు. సర్వత్రపరిపూర్ణమైన పరమాత్మ బ్రహ్మవిద్యకు యోగ్యమైన యేశరీరమందు బుద్ధికి సాక్షిగా నుండుకొని స్ఫురించుచున్న అహ మనెడు పదము లక్షణావృత్తిచేత చెప్పబడు ననిన, అహ మనునప్పుడు చైతన్యంబు నిర్వికారంబు గనుక, అహ మననేరదు. అహంకారము జడము గనుక, అహమని తోచనేరదు. పరమాత్మభూతమైన చైతన్యమే అహంకారంబుతోడ గూడుకొని అహ మని స్ఫురించుచున్నది, కాబట్టి, జడమై అహంకారమైన వాచ్యమును అహంకారము తోసివేసి చైతన్యమాత్రమే అహ మనెడి పదమునకు లక్ష్యార్థము.

బ్రహ్మమనెడి పదము నకు అర్థము, స్వతహా తానన్యో పరిపూర్ణమైన పరమాత్మ యీమహావాక్యమందు బ్రహ్మ మనెడి పదమునకు లక్ష్యార్థము.

అస్మి అనగా, యేదో నొక కారణముచుబట్టి సర్వత్రపరిపూర్ణుడై యుండెడి ఆత్మ బ్రహ్మమో, ఆకారణముచుబట్టి బుద్ధికిసాక్షియైయుండెడి నేనేబ్రహ్మ మైతిని. అనగా, అస్మి యనెడి పదము ఐక్యమును బోధించు నని తెలియువలెను.

ప్రజ్ఞానంబ్రహ్మ దీనికర్థము, ప్రజ్ఞానం, బ్రహ్మ అనిరెండుపదములు. అందు ప్రజ్ఞానమునకు స్వాధిష్టానచిదాభాసుడయిన పురుషుడు పంచేంద్రియములవలన బయలువెలిసిన అంతఃకరణవృత్తితోఁగూడుకొని యేజ్ఞానంబువలన చతుర్విధరూపములు, ద్వివిధశబ్దములను, త్రివిధగంధములను, ద్వివిధవాక్కుల వచించుటయును, షడ్రసములను, సకలబాహ్యంబుల యెరుగుచున్నదో ఆజ్ఞానమున్మాత్రమే ప్రజ్ఞాన మనెడి పదమునకు లక్ష్యార్థము.

బ్రహ్మ మనెడి పదమునకు చతుర్ముఖుడు మొదలయిన దేవతులయందును, మనుష్యులు గుఱ్ఱములు యేనుగులు మొదలయినవానియందును, అనుస్యూతమై యేచైతన్యముగలదో ఆచైతన్యమే బ్రహ్మ మనెడి పదమునకు లక్ష్యార్థము.

బ్రహ్మపదమునకు బ్రహ్మ మొదలుకొని వీరి శరీరపర్యంతంబును, సకల శరీరంబులు వాచ్యార్థము. గనుక, మాయాకార్యమని త్రోశివేయదగినది.

అయమాత్మబ్రహ్మ మనుపదమున కర్థము. అయం, ఆత్మా, బ్రహ్మం అని మూడుపదములు. అందు, అయం అనేపదమునకు స్వవశమై నిత్యాపరోక్షమై యుండునది యీయాత్మ యని చెప్పబడుచున్నది.

ఆత్మా అనెడు పదమునకు అహంకారంబు మొదలుకొని స్థూలదేహపర్యంతంబును నాయహంకారంబు నాదేహంబని యెరుగుచుండెడి చైతన్యమే ప్రత్యగాత్మరూపము.

బ్రహ్మం అను పదమునకు తాత్పర్యము. పూర్వమే చెప్పబడియున్నది. గనుక, యీమూడుపదములుంగలసి చైతన్యస్వరూపమగు యీ ఆత్మయే బ్రహ్మమని లక్ష్యార్థము.

తత్వమసి అను పదమున కర్థము. తత్పదము, త్వంపదము, అసిపదము అనిమూడుపదములు. అందు తత్పదమునకు, సృష్టికిపూర్వమందు ఏకమై నామరూపరహితమై సచ్చిద్రూపుడైన ఆత్మయు యెవనో ఆయాత్మకు ఇప్పుడు స్థితిసమయమందున్ను, ఉపదేశకాలమందును, తత్ అనె పదము చేతను, నామరూపరహితమైన చైతన్యమాత్రమే లక్ష్యార్థమని చెప్పబడును.

త్వంపదమునకు వినుసట్టి అధికారియొక్క దేహేంద్రియాదులకు అతీతమై సాక్షిభూతమైన చైతన్యమే త్వంపదముచేతను జెప్పబడుచున్నది.

అసిపదమునకు అతత్పదలక్ష్యార్థమైన చైతన్యమే నీవు త్వంపద

లక్ష్యార్థ మైన నీవే ఆతత్పదలక్ష్యార్థ చైతన్యము. ఇట్లని ఐక్యంబు ప్రతిపాదించును.

ఈనాలుగుమహావాక్యములయందును నీవే బ్రహ్మంబు. బ్రహ్మమే నీవు అని ప్రతిపాదించుచున్నది గాన, యీప్రకారము సద్గురూక్తముగా మహావాక్యార్థము తెలిసికొని యెవడు మననిదిధ్యాసలు జేయునో వాడె సద్బ్రహ్మజ్ఞుడు. సర్వకర్మవిముక్తుడు. జీవన్ముక్తుండని వేదాంతసిద్ధాంతము.

## 10. మహావాక్యోద్భవచక్రము.

| | | | | |
|---|---|---|---|---|
| వేదములు ... | యజుర్వేదోపనిషత్. | ఋగ్వేదోపనిషత్. | అథర్వణవేదోపనిషత్ | సామవేదోపనిషత్. |
| మహావాక్యములు... | అహం బ్రహ్మాస్మి. | ప్రజ్ఞానం బ్రహ్మ. | అయమాత్మ బ్రహ్మ. | తత్వమసి. |

## 11. చతుష్పథనిర్ణయము.

ఘ్రాణరంధ్రములు రెండు, కర్ణరంధ్రములు రెండు ఇవి నాలుగు మార్గములు గూడినచోటు చతుష్పథ మనంబడు. ఇదియే శృంగాటక మనియునుం జెప్పబడును. పైజెప్పిన నాలుగుమార్గములును భ్రూమధ్య మండలంబు దిగువ నలసియుండునని తెలియవలయు.

## 12. యోగచతుష్టయము.

మంత్రయోగము, లయయోగము, హఠయోగము, రాజయోగము యీనాలుగు యోగచతుష్టయ మనంబడును.

మంత్రయోగము — స్వాభావనియత రేచక పూరక కుంభక క్రమంబుచేత నేకవింశతిసహస్రషట్ఛతాధికసంఖ్యాజపమంత్రానుష్ఠానంబు మంత్రయోగ మనంబడు.

లయయోగము — ప్రతిదినసాభ్యస్తరేచకాది త్రివిధానిల సంయమనపూర్వకంబు ప్రాణవృత్తియం దపానంబును, నపానవృత్తియందు ప్రాణంబును లయంబుగావించుట లయయోగ మనంబడును.

హఠయోగము — మూలబంధోడ్యాణబంధజాలంధరబంధపూర్వకంబుగా రేచకపూరకంబుల నుడిగించి ప్రాణాపానంబులరెంటిని రేయుం

బవ లోకక్చందంబున గుంభించుట హఠయోగ మనంబడు.

మరియును, హఠయోగము ధర్మప్రభువుపాలించు రాజ్యమందలి పుణ్యనదీతీరమందు శాస్త్రోక్తక్రమముగా హఠయోగమఠము గట్టించుకొని యోగమందు నిపుణుడైన గురుని దగ్గర నుంచుకొని వారిచేత నిర్ణయింపబడినప్రకారముగా పథ్యములను జేయుచు భోజనాభ్యంజనాదులచేత శరీరరక్షణముజేయుచు గుదాకుంచనముచేత నీళ్లుపీల్చి అధోమలములను కడిగి విడుచుచు కల్పఘృతములచేతను, గండూషాదులచేతను వక్షస్థల కంఠగతకఫపిత్తాదులను గ్రక్కుచు అంజనవశ్యాదులచేత కపాలనాళికలయందలి దుష్టజలమలాదులను విసర్జించుచు శీతకాలమందూష్ణమును, ఉష్ణకాలమందు శీతమును గలుగజేయు పవిత్రమైన భస్మమును శరీరమందంతటను పూయుచు సాత్వికాహారాదుల భుజించుచు కాయశుద్ధియు గురుదేవతాభక్తియుగలిగి పరిశుద్ధాంతఃకరణుడై మితాహారనిద్రావిహారజాగ్రతులుగలవాడై స్థిరాసనుడునై మూలబంధ వొడ్యాణబంధ జాలంధరబంధంబులతోడ పూత్కార శీత్కార శీతల కేవలాద్యష్టవిధకుంభకములచేత ప్రాణవాయువు నిరోధనముచేసి కాయసిద్ధిని సంపాదించి ఆకాశగమన దూరదృష్టి దూరశ్రవణ ఘుటికా పాదుకాసిద్ధులను అణిమాద్యష్టసిద్ధులను స్వేచ్ఛామరణాదులను సంపాదించియుండుట హఠయోగ మనంబడును.

రాజయోగము—లక్ష్యత్రయయుక్తంబై తారక సాంఖ్యామనస్కాత్మకంబై యొప్పునది రాజయోగ మనంబడును.

మరియును, గురువులవలన వేదాంతశాస్త్రవిషయములను పలుమారును శ్రవణముచేసి మననదిధ్యాసములుగావించివైరాగ్యోపశాంతి వివేకవృత్తులు గలిగి సదాపరబ్రహ్మాపరోక్షవృత్తిచేత జీవన్ముక్తిని బొంది విదేహముక్తిపర్యంతము ప్రారబ్ధ మనుభవించుచుండుట జ్ఞానయోగ మనంబడు. నిదియే రాజయోగమనియునుం జెప్పబడును.

## 13. చతుర్విధప్రమాణములు.

ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శాబ్దము యీ 4 న్ను చతుర్విధప్రమాణము లనంబడును.

ఈవిచారమునకు ఫలం బేమనిన, యీచతుర్విధప్రమాణములుం గల తర్కశాస్త్రముచేత పరమాత్మ దెలియబడదని తెలియుటే ఫలము,

## 14. అంగచతుష్టయము.

అంగము, ప్రత్యాంగము, సాంగము, ఉపాంగము యీ 4 న్ను అంగచతుష్టయ మనబడును.

అంగ మనగా, శిరము ఉదరము భుజద్వయము అంగమనబడును.

ప్రత్యాంగ మనగా, నుదురు నాశికము కర్ణములు అధరము ప్రత్యాంగ మనబడును.

సాంగ మనగా, మనోబుద్ధి చిత్తహంకారములు సాంగ మనబడును.

వస్త్రాభరణలేపనాదులు ఉపాంగ మనబడును.

## 15. స్పర్శచతుష్టయము.

శీతము, ఉష్ణము, మృదువు, కఠినము యీ 4న్ను స్పర్శచతుష్టయ మనబడును.

శీత మనగా, చలిగా నుండునది.

ఉష్ణ మనగా, వేడిమిగా నుండునది.

మృదు వనగా, మెత్తగా నుండునది.

కఠిన మనగా, బిరుసుగా నుండునది.

## 16. చతుర్విధబ్రహ్మవేత్తలు.

బ్రహ్మవేత్త, బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వరీయుడు, బ్రహ్మవిద్వరిష్ఠుండు యీ 4న్ను చతుర్విధబ్రహ్మవేత్త లనంబడుదురు.

బ్రహ్మవేత్త యనగా, దేహేంద్రియాది కర్తృత్వంబును కర్మఫలకాంక్షయులేక నిత్యనైమిత్తికంబు లయిన వైదికకర్మంబులు యథావిధిగా నాచరించుచు కామ్యకర్మంబులు విడిచి శాస్త్రగర్హితంబులుగాని లౌకిక కర్మంబులు యథోచితంబుగా నొనర్చుచు బుత్రమిత్రకళత్రపవిత్రక్షేత్రాదులయందు వైరాగ్యంబు గలిగి యదృచ్ఛాలాభ సంతుష్టుండను, నిరహంకారుండును, గామ రాగ ద్వేష భయ లోభ మోహ మద మత్సరాది నానావిధచిత్తవికారరహితుండును, సతతవిజితశరీరేంద్రియప్రాణాంతఃకరణుండును, నిత్యప్రసన్నచిత్తుండును, బరమకారుణికుండును, జ్ఞానవిజ్ఞానసంపన్నుండును, నంతస్సుఖుండును, నంతరారాముండును, నంతఃప్రకాశుండును, నాత్మరతుండును, నాత్మతృప్తుండును, నాత్మసంతుష్టుండును నై సంచరించు నతండు బ్రహ్మవేత్త యనంబడును.

బ్రహ్మవిద్వరుం డనగా, సకల వైదికలౌకికకర్మంబులు విధిపూర్వకంబుగా సన్యసించి పూర్వోక్తలక్షణంబుల విలసిల్లి సంప్రాప్తదుఃఖంబులను ద్వేషింపక నవృత్తసుఖంబులు గోరక ప్రకాశవృత్తి మోహంబుల నుదాసీనునిచందంబునఁజూచుచు సుఖదుఃఖమోహాది కార్యాకార్యగుణంబులయందు జితేంద్రియాది కారణకార్యగుణంబులు ప్రవర్తించుచుండ వానిచేతం జలింపంజేయఁబడక నిశ్చలుండును, సమదుఃఖసుఖుండును, స్వస్థుండును, సమలోష్టాశ్మకాంచనుండును, ప్రియాప్రియ నిందాస్తోత్ర మానావమాన శత్రుమిత్రులయందు సముండును, సంపరిత్యక్తసర్వారంభుండును నగు గుణాతీతుండు బ్రహ్మవిద్వరుం డనంబడును.

బ్రహ్మవిద్వరీయుం డనగా, మున్ను వివరించిన గుణంబు లన్నియు ప్రకాశించుచుండ సంతత సహజామనస్క రాజయోగ నిష్ఠాగరిష్ఠుండై యెడనెడ బరులవలన మేలుకొలుపంబడి కించి దాహారంబు గొనుచు సుప్తుండైనవాని తెరంగున విశ్వంబు మరచియుండు నతండు బ్రహ్మవిద్వరీయుం డనంబడును.

బ్రహ్మవిద్వరిష్ఠుం డనగా, దనవలనను నొరులవలనను బునరుత్థానంబులేక బాహ్యాభ్యంతరంబులుమరచి నిరంతర నిర్వికల్పసమాధినిష్ఠుండై పరిపూర్ణ ప్రత్యగభిన్న పరబ్రహ్మ చైతన్య ప్రకాశమాత్రుండును నై వెలుంగు నతండు బ్రహ్మవిద్వరిష్ఠుం డనంబడును.

ఈనలువురును వారివారి పూర్వకర్మఫలానుసారముగా నాలుగు విధములయిన వృత్తులుగలవారైనప్పటికిని నలువురకు మోక్షము సమమే నని వేదాంతసిద్ధాంతము.

### 17. చతుర్విధపురుషార్థములు.

ధర్మము, అర్థము, కామము, మోక్షము యీ 4న్ను పురుషార్థములు. నిదియే చతుర్వర్గమనియునుం జెప్పబడును.

ఈపురుషార్థములు నాలుగింటిలో పరమపురుషార్థమైనది మోక్షమని తెలియుటేఫలము.

### 18. న్యాయవిద్యాచతుష్టయము.

అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి యీ 4న్ను న్యాయవిద్యాచతుష్టయము,

[నట్టివిద్య.

అన్వీక్షకి యనగా, ఆత్మానాత్మవివేకరూపంబై మోక్షప్రదం బగు

త్రయి అనగా, యజనాదికర్మరూపంబై స్వర్గప్రదంబగునట్టి విద్య.

వార్త యనగా, కృష్యాదిరూపంబై జీవనఫలప్రదంబగునట్టి విద్య.

దండనీతి యనగా, ప్రభుత్వరూపంబై ధనధాన్యాదిసంపాదనప్రదమగునట్టి విద్య.

ఈన్యాయవిద్యా చతుష్టయములో మొదటి అన్వీక్షికియుదక్క తక్కిన మూడును పునర్జన్మకారణములును, దుఃఖకరంబులు నని తెలిసి మోక్షప్రదంబగు అన్వీక్షికియే సాధింపవలయునని బుధజనాభిప్రాయము.

### 19. చతుర్విధభూతములు.

జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు యీనాలున్ను చతుర్విధభూతము లనబడును.

జరాయుజము లనగా, మావివలన బుట్టిన మనుష్యులు మొదలైన ప్రాణులు.

అండజములనగా, గ్రుడ్డువలనబుట్టినపక్షులు మొదలైనజంతువులు.

స్వేదజము లనగా, చమటవలనబుట్టిన యూకములనే కీటకములు మొదలయిన ప్రాణులు.

ఉద్భిజము లనగా, భూమిని ప్రక్కలించుక పుట్టిన వృక్షములు మొదలయిన ప్రాణులు.

అండజ స్వేదజోద్భిజ జరాయుజములని నాలుగువిధయోనులందు వుత్పత్తియైన సప్తవిధదేహంబులలో—

| | |
|---|---|
| దేవతాభేదంబులు | 11 లక్షలు. |
| మానవభేదంబులు | 9 లక్షలు. |
| మృగభేదంబులు | 10 లక్షలు. |
| పక్షిభేదంబులు | 10 లక్షలు. |
| జలచరభేదంబులు | 10 లక్షలు. |
| నేలబారెడుతనుభేదంబులు | 13 లక్షలు. |
| గిరితరుగుల్మతృణలతాది స్థావరభేదంబులు | 19 లక్షలు. |
| ఇన్నియుఁగూడి | 82 లక్షలు. |

మరియొకవిధము.

| | |
|---|---|
| జలచరములు | 9 లక్షలు. |
| స్థావరములు | 20 లక్షలు. |
| క్రిములు | 11 లక్షలు. |
| పక్షులు | 10 లక్షలు. |
| పశ్వాదులు | 30 లక్షలు. |
| మనుష్యులు | 4 లక్షలు. |
| ఇన్నియుఁగూడి | 84 లక్షలు. |

ఈవిచారమునకు ఫలం బేమనిన, యీచతుర్విధభూతములలో ధర్మాచరణకారణంబైన మానవజన్మంబే ఉత్తమమన్ని తెలియుటేఫలము.

## 20. సద్గుణచతుష్టయము.

మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష ఈ 4న్ను సద్గుణచతుష్టయములు.

మైత్రి అనగా, సాధుసాంగత్యంబు జేయుచుండుట.

కరుణ యనగా, దుఃఖితాత్ములయందు పరితపించుట.

ముదిత యనగా, పుణ్యాకారులయందు సంతోషించుట.

ఉపేక్షయనగా, పాపాత్ములయందురాగద్వేషములు లేకయుండుట.

## 21. చతురాశ్రమధర్మంబులు.

బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, సన్యాసి యీ4న్ను చతురాశ్రమవాసు లనంబడుదురు.

బ్రహ్మచారి—మౌంజీకౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పాలాశదండ కమండలధరుండై సంస్కారహీనశిరోరుహుండును, దర్భహస్తుండునునై మౌనియై త్రిసంధ్యలబ్రహ్మగాయత్రిజపించుచు సాయంప్రాతరవసరంబుల నర్కపావక గురు దేవతోపాసనంబులు జేయుచు గురుమందిరంబునకుం బోయి భక్తితో వేదంబుజదువుచు నధ్యయనోపక్రమావసానంబుల గురు చరణంబులకు నమస్కరించుచు విహితగృహంబులభిక్షదెచ్చి గురువునకు నివేదించి తదనుజ్ఞచే మితముగా భుజింపుచు విహితకాలంబుల నుపవశింపుచు సంగనయందు నంగనాసక్తులయందు ప్రయోజనమాత్రభాషణుండై గురుపరాంగనలవలన అభ్యంజన కేశప్రసాదన మజ్జన మొదలైన రహస్యయోగంబులు వర్జించి గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండై సంచరించు నతండు బ్రహ్మచారి యనంబడు.

గృహస్థు — విపరీతవేషభాషణంబులు విడిచి చందన భూషణాద్యలంకరణము మాని ఋతుకాలముల నిజభార్యతో గూడుచు పరస్త్రీల జూడనొల్లక దృఢవ్రతుడై మధుమాంసవర్జితుడై గురువులవలన నుపనిషదంగసహితంబైన వేదమంత్రంబులుగ్రహించి గృహంబుననైనా వనంబుననైనా నైష్టికత్వంబు నాశ్రయించి జపించుచు గురువునందు నాత్మయందు నగ్నియందు సర్వభూతంబులయందు నచ్యుతదర్శనంబు జేయుచు ఇంద్రియ వ్యసనాదిమగ్నుండుగాక యెరుకగల్గివర్తించునతండు గృహస్థుండనంబడు.

వానప్రస్థు—వనంబునకుంజని దున్నకపండెడు నీవారాదికంబులు

అగ్నిపక్వంబు జేసినైనా అర్కపక్వంబు లైన ఫలాదులైనా భక్షించుచు వన్యాహారంబుల నిత్యకృత్యంబు లయిన చరుపురోడాశంబు లొనర్చుచు ప్రతిదినంబును పూర్వసంచితంబులు పరిత్యజించుచు నూతనద్రవ్యములు సంగ్రహించుచు నగ్నికొరకు పర్ణశాలనైనా పర్వతగుహనైనా నాశ్రయించి హిమ వాయు వహ్ని వర్షాతపంబులకు సహించుచు నఖశ్మశ్రు కేశ తనూరుహంబులు ప్రసాదితంబులు జేయక జటిలుండై దండాజిన కమండల వల్కల పరిత్యాదంబులు ధరియించి పండ్రెండైనా నెనిమిదైనా నాలుగైనా రెండైనా నొకసంవత్సరంబైనా దపఃప్రయాసంబున బుద్ధి నాశంబుగాకుండ మునినై చరించుచు దైవవశంబున జరారోగంబులచేత జిక్కి నిజధర్మార్థానుష్ఠాన సమర్థుండు గానిసమయంబున నిరశనవ్రతుండై అగ్నుల నాత్మారోపణంబు జేసి సన్యశించి పంచభూతంబుల లయంబు గావించియుండునతండు వానప్రస్థు డనంబడు.

సన్యాసి— దేహమాత్రావసిష్టుండై నిరపేక్షుండును, భిక్షుకుండును. నిరాశ్రయుండును, నారాయణపరాయణుండును నై కౌపీనంబు నాచ్ఛాదన మాత్రంబైన వస్త్రంబుధరించి దండాదివ్యతిరిక్తంబులువర్జించి ఆత్మపదంబులుగాని శాస్త్రంబులు విసర్జించి గ్రహనక్షత్రాదివిద్యల జీవింపక భేద వాదంబులైన తర్కంబు తర్కింపక నెందును పరికింపరాక శిష్యులకు గ్రంథంబులువచించి ఉపన్యశింపక బహువిద్యలజీవింపక మత్తాదివ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కుదినంబులు నొక్కయెడ వసింపక పూరనూర నొక్కొక్కరాత్రంబు నిలుచుచు గార్యకారణవ్యతిరిక్తంబై పరమాత్మ యందు విశ్వంబు దర్శించుచు విశ్వంబునందు పరమాత్మను జూచుచు అనగా సమస్తంబును పరమాత్మయని చూచునతండు సన్యాసియనంబడు.

యీవిచారమునకు ఫలం బేమనిన, ఆత్మావలోకనపరు లైనవారు యీచతురాశ్రమములలో నేయాశ్రమమం దుండినను జ్ఞానంబునకును, జ్ఞానఫలంబైన మోక్షంబునకును బాధ లేదని తెలియుటే ఫలము.

## 22. భక్తిహేతుచతుష్టయము.

ఆర్తి,జిజ్ఞాస,అర్థాసక్తి,జ్ఞానము ఈనాల్గు భక్తిహేతుచతుష్టయము.

ఆర్తి యనగా, రోగాదులచే తపించుచు తన్నివర్తనకై భగవంతుని భజించుట.

జిజ్ఞాస—భగవత్స్వరూపమును దెలియుటకై భగవంతునిభజించుట.

అర్థార్థి యనగా, ధనముకొరకై భగవంతునిగూర్చి భజించుట.

జ్ఞాని యనగా, ఆరూఢుడై భగవంతుని భజించుట.

లోకములో యీనాలుగుహేతువులచేతను భగవంతుని భజింపుచుందురు గాన, వీనిలో జ్ఞానముచే ఆరూఢుండై భగవంతుని భజించుట ముఖ్యమని భగవదాభిప్రాయము.

23. చతుర్యుగపరిమాణవత్సరము.

కృతయుగమునకు—పదియేడులక్షల, ఇరువదియెనిమిదివేల సంవత్సరములు.

త్రేతాయుగమునకు — పండ్రెండులక్షల, తొంబదియారువేల సంవత్సరములు.

ద్వాపరయుగమునకు—ఎనిమిదిలక్షల, అరువదినాలుగువేలసంవత్సరములు.

కలియుగమునకు—నాలుగులక్షల, ముప్పదిరెండువేల సంవత్సరములు. ఈవిచారమునకు ఫల మేమనిన, ఇటువంటిచతుర్యుగములు అనేకముగతించినప్పటికిని ఆత్మకొకస్పృశను నాశములేదని తెలియుటేఫలము.

24. చతుర్యుగపరిమాణవత్సరచక్రము.

| విషయములు. | లక్షలు. | వేలు. |
|---|---|---|
| కృతయుగము ... | 17 | 28,0,00 వత్సరములు. |
| త్రేతాయుగము ... | 12 | 96,0,00 వత్సరములు. |
| ద్వాపరయుగము ... | ౮ | 64,0,00 వత్సరములు. |
| కలియుగము ... | ౪ | 32,0,00 వత్సరములు. |

25. ద్వారచతుష్టయబంధనక్రమము.

పాణిద్వారబంధము, ఉపస్థద్వారబంధము, ఉదరద్వారబంధము, వాణీద్వారబంధము యీ4న్ను ద్వారచతుష్టయబంధన మనబడును.

పాణిద్వారబంధ మనగా, పోకంత బంగారమయినను ముందర బెట్టిన తీసుకొనకుండుట, కోపముచే నెవరిని కొట్టకుండుట.

ఉపస్థద్వారబంధ మనగా, యెటువంటి స్త్రీనైనను కోరెడు చిత్తవృత్తిని పోదోలి నిజభార్యావ్రతుడై యుండుట,

ఉదరద్వారబంధ మనగా, యేవేళకు యెంతప్రాప్తముగునో అంత మితముగా భుజింపుచు ఇతరుల నడిగికొనకయుండుట,

వాణీద్వారబంధ మనగా, కఠినవాక్యంబులు అసత్యంబులు బలుక కుండుట.

దేవతుల కైనను మాయశక్యముగాని యీనాలుగుద్వారంబులు భగవదానుగ్రహమువలన మూసినవాడె బ్రాహ్మణుడు. అట్టివానికియజ్ఞ దానతప వేదాధ్యయనములతో పని లేదని బుధజనాభిప్రాయము.

26. చతుర్విధదైవోపాసకులక్రమము.

ద్విజాతులు, మునులు, అల్పబుద్ధులు, విదితాత్ములు యీ 4 న్ను చతుర్విధదైవోపాసకు లనంబడుదురు.

ద్విజాతు లనగా, అగ్నిహోత్రుని దైవమని నమ్మి భజించువారు.
మునులనగా, భగవంతునిహృదయస్థునిగా నెంచి భజించువారు.
అల్పబుద్ధులనగా, ప్రతిమాదులందు దైవబుద్ధి గల్గి భజించువారు.
విదితాత్ము లనగా, సర్వభూతాత్మకం బయిన ప్రపంచం బంతయు భగవంతుండని తెలిసి భజించువారు.

యీచతుర్విధదైవోపాసకులలో సర్వము బ్రహ్మ మనునట్టి విదితాత్ములు వుత్తములని తెలియుట యీవిచారమునకు ఫలము.

---

పంచసంఖ్యాప్రకరణము.

---

1. పంచభూతములు.

పృథివి, జలము, అగ్ని, వాయు, ఆకాశము యీ 5 న్ను పంచభూతము లనబడును.

2. పంచభూతస్థానములు.

పృథివికి గుదస్థానము, జలమునకు లింగస్థానము, అగ్నికి నాభిస్థానము వాయువకు హృదయస్థానము, ఆకాశమునకు కంఠస్థానము.

3. పంచభూతరూపములు.

పృథివి పీతవర్ణము, జలము శ్వేతవర్ణము, అగ్ని రక్తవర్ణము, వాయువు కృష్ణవర్ణము, ఆకాశము నీలవర్ణము.

4. పంచభూతబీజములు.

పృథివికి లం బీజము, జలమునకు వం బీజము, అగ్నికి రం బీజము, వాయువకు యం బీజము, ఆకాశమునకు హం బీజము.

5. పంచబ్రహ్మలు.

సద్యోజాతముఖబ్రహ్మ, వామదేవముఖబ్రహ్మ, అఘోరముఖబ్రహ్మ, తత్పురుషముఖబ్రహ్మ, ఈశాన్యముఖబ్రహ్మ యీ 5 న్ను పంచముఖబ్రహ్మ లనబడుదురు.

6. పంచకర్తలు.

బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు యీ 5న్నుపంచకర్త లనబడుదురు.

7. పంచశక్తులు.

క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, పరాశక్తి, సహజశక్తి యీ 5 న్ను పంచశక్తు లనబడును.

8. జ్ఞానేంద్రియపంచకము.

శ్రోత్రము, త్వక్కు, చక్షు, జింహ్వ, ఘ్రాణము యీ 5 న్ను జ్ఞానేంద్రియము లనబడును.

శ్రోత్ర మనగా, చెవులు.
త్వక్కు అనగా, చర్మము.
చక్షు అనగా, కన్నులు.
జిహ్వ అనగా, నాలుక.
ఘ్రాణ మనగా, ముక్కు.

| భూతములు. | ధర్మములు. | కర్మములు. | వర్ణములు. | అధిదేవతలు. |
|---|---|---|---|---|
| పృథివి. | స్నేహించడం | ధరించడము. | స్వర్ణము. | బ్రహ్మ. |
| జలము. | చెప్పడము. | పదును జేయడము. | స్ఫటికము. | విష్ణు. |
| అగ్ని. | వెలగడము. | కాల్చడము. | మెరుపు. | రుద్రుడు. |
| వాయువ. | చలించడము. | చేర్చడము. | పొగ. | మహేశ్వరుడు. |
| ఆకాశము. | బయలైయుండడము. | అవకాశమియ్యడము | నీలము. | సదాశివుడు. |

| | | | | |
|---|---|---|---|---|
| ఆశ. | పెరుగుట. | ఆకలి. | మజ్జ. | పృథ్వి అర్థభాగం, అస్థి, గుణములు 5. |
| ద్వేషము. | వుండుట. | దప్పి. | జలము అర్థభాగం, మూత్రం, గుణములు 4. | మాంసము. |
| భయము. | ముడుచుట. | అగ్ని అర్థభాగం, నిద్ర, గుణములు 3. | చెమట. | చర్మము. |
| లజ్జ. | వాయువ అర్థభాగం నడుచుట, గుణమ్లు2. | మైథునము. | రక్తము. | నరములు. |
| ఆకాశము అర్థభాగము, మోహం, గుణం1. | నిలుచుట. | ఆలశ్యము. | శుక్లము. | రోమములు. |

9. పంచభూతచక్రము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచభూతములు. | పృథివి. | జలము. | అగ్ని. | వాయువు. | ఆకాశము |
| పంచస్థానములు. | గుదము. | లింగము. | నాభి. | హృదయం | కంఠము. |
| పంచవర్ణములు. | పీతము. | శ్వేతము. | రక్తము. | కృష్ణము. | నీలము. |
| పంచబీజములు. | లం | వం | రం | యం | హం |
| పంచబ్రహ్మలు. | సద్యోజాతముఖబ్రహ్మ | వామదేవముఖబ్రహ్మ | అఘోరముఖబ్రహ్మ | తత్పురుషముఖబ్రహ్మ | ఈశాన్యముఖబ్రహ్మ |
| పంచకర్తలు | బ్రహ్మ. | విష్ణు. | రుద్రుడు. | ఈశ్వరుడు. | సదాశివుడు. |
| పంచకళలు. | నివృత్తి. | ప్రతిష్ట. | విద్య. | శాంతి. | శాంత్యాతీతం. |
| పంచశక్తులు | క్రియాశక్తి. | జ్ఞానశక్తి. | ఇచ్ఛాశక్తి. | పరాశక్తి. | సహజశక్తి. |

## 10. కర్మేంద్రియపంచకము.

వాక్కు, పాణి, పాదము, పాయు, ఉపస్థ యీ 5 న్ను కర్మేంద్రియము లనబడును.—వాక్కు అనగా నోరు, పాణి అనగా చేతులు, పాదమనగా కాళ్లు, పాయు వనగా గుదము, ఉపస్థ అనగా గుహ్యము.

## 11. వాయుపంచకము.

ప్రాణవాయువు, అపానవాయువు, ఉదానవాయువు, సమానవాయువు, వ్యానవాయువు యీ5న్ను వాయుపంచక మనబడును.

## 12. విషయపంచకము.

శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము యీ 5 న్ను విషయపంచక మనబడును. ఇదియే పంచతన్మాత్రలనియునుం జెప్పబడును.

| త్రిగుణాంశములు. | 13. పంచీకరణచక్రము | | | | | ప్రత్యేకపంచకములు. |
|---|---|---|---|---|---|---|
| త్రిగుణాత్మకములు. | ఆకాశం | వాయువ. | అగ్ని. | అప్పు. | పృథివి. | పంచభూతములు. |
| సాత్వికాంశ సమష్టి. | జ్ఞాతృ. | మనస్సు | బుద్ధి. | చిత్తము. | అహంకారం. | ఆకాశపంచకము. |
| పంచభూత రజోంశ సమష్టి. | సమాన | వ్యాన. | ఉదాన. | అపాన. | ప్రాణ. | వాయుపంచకము. |
| పంచభూత సాత్వికాంశములు. | శ్రోత్రం | త్వక్కు | చక్షు. | జిహ్వ. | ఘ్రాణం | అగ్నిపంచకము. |
| పంచతన్మాత్రలు. | శబ్దము. | స్పర్శ. | రూపం. | రసం. | గంధం. | అప్పుపంచకము. |
| పంచభూత రజోంశమ్లు. | వాక్కు | పాణి. | పాదం. | గుహ్యము. | పాయు. | పృథివిపంచకము. |

## 14. పృథివిపంచగుణములు.

నరములు, యెముకలు, చర్మము, గోళ్లు, పా-రోమములు, మాంసము యీ5న్ను పృథివిపంచగుణములు.

15. అప్పుపంచగుణములు.

శ్లేష్మము, మూత్రము, రక్తము, శుక్లము, చమట యీ 5న్ను జల పంచగుణములు.

16. అగ్నిపంచగుణములు.

ఆకలి, దప్పి, నిద్ర, ఆలస్యము, సంగమము యీ 5న్ను అగ్నిపంచ గుణములు.

17. వాయుపంచగుణములు.

చలించుట, వ్యాపించుట, సోలయుట, ప్రాలుట, అగలుట యీ 5న్ను వాయుపంచగుణములు.

18. ఆకాశపంచగుణములు.

రాగము, ద్వేషము, భయము, లజ్జ, మోహము యీ 5 న్ను ఆకాశపంచగుణములు.

19. పంచభూతపంచీకరణ కదంబములు.

ఆకాశకదంబము, వాయుకదంబము, అగ్నికదంబము, జలకదంబము, పృధివికదంబము యీ 5 న్ను పంచభూతపంచీకరణకదంబములు.

ఆకాశకదంబము—అంతఃకరణము, సమానవాయువు, శ్రోత్రేంద్రియము, శబ్దము, వాక్కు యీ 5న్ను ఆకాశకదంబ మనబడును.

వాయుకదంబము—వ్యానవాయువు, త్వగింద్రియము, స్పర్శము, పాణీంద్రియము యీ 5న్ను వాయుకదంబ మనబడును.

అగ్నికదంబము—బుద్ధి, ఉదానవాయువు, చక్షురింద్రియము, రూపము, పాదేంద్రియము యీ 5న్ను అగ్నికదంబ మనబడును.

జలకదంబము—చిత్తము, ప్రాణవాయువు, రసనేంద్రియము, రసము, ఉపస్తేంద్రియము యీ 5న్ను జలకదంబ మనబడును.

పృథ్వీకదంబము—అహంకారము, అపానవాయువు, ఘ్రాణేంద్రియము, గంధము, పాయురింద్రియము యీ 5న్ను పృధివికదంబ మనబడును.

20. పంచకోశములు.

అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశము ఈ 5న్ను పంచకోశములనబడును.

అన్నమయము—అన్నరసముచేనైన మాతాపితాశుక్లశోణితంబులేకమైఉద్భవించి పంచవింశతితత్వములతోగూడి స్తంభమువలెగనుపించు యీ స్థూలశరీరము అన్నమయకోశ మనంబడు.

ప్రాణమయ—కర్మేంద్రియపంచకంబును, ప్రాణాదివాయుపంచకంబులును గూడినది ప్రాణమయకోశ మనంబడు.

మనోమయ—జ్ఞానేంద్రియపంచకంబును, మనస్సునుగూడి మనోమయకోశ మనంబడు.

విజ్ఞానమయ—శబ్దాదివిషయపంచకమును,బుద్ధియునుగూడి విజ్ఞానమయకోశ మనంబడు. జ్ఞానేంద్రియపంచకమును, బుద్ధియునుంగూడిన విజ్ఞానమయకోశమని కొందరిమతము.

ఆనందమయము—ప్రియమోద ప్రమోదవృత్తిమత్తై అజ్ఞానప్రదమైన అంతఃకరణము ఆనందమయకోశ మనంబడు.

ఈవిచారమునకు ఫలంబేమియనిన, ఆత్మ అవస్థాత్రయంబునందు ననుస్యూతమైయున్నది. పంచకోశంబు లవస్థాత్రయంబులం దెందును అనుస్యూతములై యుండలేదు. కాబట్టి, వ్యావృత్తములయిన పంచకోశములు తోచుచు వ్యవహారంబునకు వచ్చినప్పటికిని యీపంచకోశములు ఆత్మవ్యతిరిక్తముగా లేవనుటయే యీవిచారమునకు ఫలము.

## 21. పంచావస్థలు.

జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యావస్థ, తూర్యావస్థ, సహజావస్థ యీ5న్ను పంచావస్థ లనంబడును.

యీఅవస్థలు ఆత్మకు లేవనుటయే యీవిచారమునకు ఫలము.

## 22. పంచావస్థలస్థానములు.

జాగ్రదావస్థకు భ్రూమధ్యస్థానము, స్వప్నావస్థకు కంఠస్థానము, సుషుప్త్యావస్థకు హృదయస్థానము, తూర్యావస్థకు నాభిస్థానము,సహజావస్థకు గుహ్యస్థానము యీ5న్ను పంచావస్థలస్థానము లనంబడును.

చక్రము.

| అవస్థలు— | జాగ్రత. | స్వప్నము. | సుషుప్తి. | తూర్యము. | సహజ. |
|---|---|---|---|---|---|
| స్థానములు— | భ్రూమధ్యం | కంఠము. | హృదయ౦. | నాభి. | గుహ్యము. |

## 23. పంచభ్రమలు.

భేదభ్రమ, కర్తృత్వభ్రమ, సంగిత్వభ్రమ, కారిత్వభ్రమ, సత్యత్వభ్రమ యీ5న్ను పంచభ్రమ లనబడును.

భేదభ్రమయనగా, ప్రత్యగాత్మను పరమాత్మను భేదమని తలంచుట.

కర్తృత్వభ్రమ యనగా, సమస్తమునకు ఆత్మయే వాస్తవముగా కర్తయని తలంచుట.

సంగిత్వభ్రమ యనగా, ఆత్మ శరీరత్రయముతో గూడియున్నాడని తలంచుట.

కారిత్వభ్రమ యనగా, జగత్తు పరమాత్మచే కల్పింపబడిన దని తలంచుట.

సత్యత్వభ్రమ యనగా, ప్రపంచము సత్యమని తలంచుట.

ఈభ్రమలకు నివృత్తియెట్లనిన, బింబప్రతిబింబదృష్టాంతముచేత భేదభ్రమయును, స్ఫటిక లోహిత దృష్టాంతముచే పారమార్థిక కర్తృత్వభ్రమయును, ఘటాకాశమఠాకాశ దృష్టాంతముచేత సంగిత్వభ్రమయును, రజ్జుసర్పదృష్టాంతముచేత బ్రహ్మమే జగత్కారణ మనునట్టి భ్రమయును, స్వర్గలోకదృష్టాంతముచేత సత్యత్వభ్రమయును నశించు నని తెలియుటే యీవిచారమునకు ఫలము.

## 24. పంచప్రళయములు.

నిత్యప్రళయము, అవాంతరప్రళయము, దైనందినప్రళయము, బ్రహ్మప్రళయము, ఆత్యంతికప్రళయము యీయైదున్ను పంచప్రళయములు.

నిత్యప్రళయము—సకలజనులయొక్క సుషుప్త్యావస్థ నిత్యప్రళయ మనబడు.

అవాంతరప్రళయము — నొకసమయమున చతుర్యుగములు చీకాకు అవును. ఆఅధిపత్యము, అమరేపర్యంతము అవాంతరప్రళయ మనబడును. ఇందులో బ్రహ్మదేవునిపగటియందుపద్నాలుగుఅవాంతరప్రళయములు. ఈపద్నాలుగింటికి నైమిత్తికప్రళయ మనియు, మన్వంతర ప్రళయ మనియు రెండుపేళ్లు. యుగప్రళయములును వీనిలోనే నంతర్భూతములు.

దైనందినప్రళయము—బ్రహ్మదేవుని సుషుప్తికాలము దైనందిన ప్రళయము.

బ్రహ్మప్రళయము—బ్రహ్మదేవునియొక్క నాశావస్థ బ్రహ్మప్రళయ మనబడును. ఆయవస్థయందుఆకాశాదిపంచభూతములులేవు. అజ్ఞానంబు మాత్రమే వుండును. దానికి ప్రకృతిప్రళయ మనియును, మహాసుషుప్తి ప్రళయమనియును, ఆత్యంతికప్రళయమనియును మూడుపేళ్లు.

ఆత్యంతికప్రళయము — ముక్తి యనబడును. ఆయవస్థయందు సర్వాత్మనా అజ్ఞానము లేకయుండును.

ఈవిచారమునకు ఫలమేమనిన, ఆత్మ ఈపంచప్రళయములయందును నశింపక వీటినన్నింటిని సాక్షియై చూచుచున్నాడని తెలియుటే ఫలము.

25. ముక్తిపంచకము.

సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము, కైవల్యము యీ5న్ను ముక్తిపంచకము లనబడును.

సాలోక్య మనగా, విష్ణులోకమం దుండుట.

సామీప్య మనగా, విష్ణుదగ్గిర జేరియుండుట.

సారూప్య మనగా, విష్ణురూపుడై యుండుట.

సాయుజ్య మనగా, విష్ణులో జేరియుండుట.

కైవల్య మనగా, విష్ణులో నైక్యంబు నొందుట.

ఈవిచారమునకు ఫలంబేమనిన, యేయేదైవము నుపాశింపువారలాయాదైవముల సంబంధమైన పంచముక్తులలో స్వకర్మానుసారమయిన ముక్తినిబొందుదురని తెలియుటే ఫలము.

26. పంచక్లేశములు.

అవిద్యాక్లేశము, అభినవక్లేశము, అస్థితక్లేశము, రాగక్లేశము, ద్వేషక్లేశము యీ5న్ను పంచక్లేశము లనబడును.

అవిద్యాక్లేశ మనగా, నేను జీవుడ నని నిర్ణయించుట.

అభినవక్లేశ మనగా, సంసార మనుదానికి కారణమైన మనస్సును పరిత్యజింపకుండుట.

అస్థితక్లేశ మనగా, విషయాభిలాషగలిగి విజృంభిగుచుండుట.

రాగక్లేశ మనగా, అర్థములయం దధికానురక్తి గలిగి యుండుట.

ద్వేషక్లేశ మనగా, ఉదరపోషణార్థము పరుల నాశ్రయించి వారివలన తనయభిమతము కొనసాగనందున వారల దూషించుట.

ఈపంచక్లేశములు విడువకుండుట బంధ మనియును, విడిచి వర్తించుట మోక్షంబనియును తెలియుటే ఫలము.

27. పంచాకాశములు.

హృదయాకాశము, గుణరహితాకాశము, పరాకాశము, మహాకాశము, తత్త్వాకాశము యీ5న్ను పంచాకాశము లనబడును.

హృదయాకాశ మనగా, కనుచూపుమేర గనుపించునది.

గుణరహితాకాశ మనగా, కేవల నిరాకాశమై యుండునది.

పరాకాశ మనగా, నిబిడ నిష్ఠుర గాఢాంధకారంబై యుండునది.

మహాకాశ మనగా, ప్రళయకాల ప్రజ్వాల జ్వాలాభీల దావానలాకారమయినది.

తత్వాకాశమనగా,వివిధవిచిత్రవితతాద్యుతి భరితంబైయుండునది.

ఈపంచాకాశములు నిత్యముజూచుటచే దృష్టికి స్థిరత్వంబుగలుగునని తెలియుచేఫలము.

## 28. పంచముద్రలు.

ఖేచరి, భూచరి, మధ్యలక్ష్యము, షణ్ముఖి, శాంభవి యీ 5న్ను పంచముద్ర లనబడును.

ఖేచరి—కనులు మూశియైనను, తెరచియయినను, భ్రూమధ్యమందు ద్రుష్టినిల్పి జూచుట ఖేచరి యనబడును.

భూచరి—నేత్రములుగదలింపక నాశికాగ్రమునదృష్టినిల్పిచూచుట

మధ్యలక్ష్య మనగా, నాశికామధ్యమందు ద్రుష్టినిల్పి అంతర్లక్ష్యమందు మనస్సునిల్పి చూచుట.

షణ్ముఖి అనగా, నేత్రరంధ్రములురెండు, శ్రోత్రరంధ్రములు రెండు, నాసారంధ్రములురెండు కూడాఆరురంధ్రములుమూశి భ్రూమధ్యమున ద్రుష్టినిల్పి చూచుట.

శాంభవీయనగా, అంతర్లక్ష్యము బాహ్యద్రుష్టియు గలిగి మనోమారుతంబుల వికారంబు లుడిగించుట శాంభవీముద్ర యనబడును.

ఈపంచముద్రలు గురుముఖముగా నెరిగి యభ్యసించి పిమ్మట శాంభవీముద్ర స్థిరపరుచుకోవలయునని తెలియుచేఫలము.

## 29. పంచాగ్నులు.

ఉదరాగ్ని, మందాగ్ని, కామాగ్ని, శోకాగ్ని, బడబాగ్ని యీ 5న్ను పంచాగ్ను లనబడును.

ఉదరాగ్ని యనగా, ఆకలిచే తపించుట.

మందాగ్ని యనగా, ఆకలిలేక తపించుట.

కామాగ్ని యనగా, పరస్త్రీసంగమముగోరి తపించుట.

శోకాగ్ని యనగా, అధ్యాత్మికాదిదుఃఖములచే తపించుట.

బడబాగ్ని యనగా, మరణతుల్యమైన ఆపత్తునుబొంది తపించుట.

యీతాపములు శరీరమునకేకాని తచ్ఛరీరసాక్షినైన నాకులేవని యెరుంగుటే యీవిచారమునకు ఫలము.

30. వివేకపంచకము.

ద్రుగ్ధ్రుశ్యవివేకము, పంచకోశవివేకము, పంచభూతవివేకము, నామరూపవివేకము, తత్వవివేకము యీ5న్ను వివేకపంచక మనబడును.

దృగ్ధృశ్యవివేక మనగా, పంచేంద్రియములకు గనుపించు ప్రపంచము దృశ్యమనియును; ఈపంచేంద్రియములకు సాక్షియై చూచుచున్న తెలివియే ద్రుక్కనియును తెలియుట.

పంచకోశవివేకమనగా, పంచకోశములనుఆత్మనువేరుగాదెలియుట.

పంచభూతవివేకమనగా, పంచభూతములను ఇరువైఅయిదింటిగా పంచీకరించి ఇరువదిఆరవదిగా శేషించిన ఆత్మ తానని తెలియుట.

నామరూపవివేక మనగా, ఆత్మ సకల నామరూపములయందను స్యూతమైయున్నప్పటికిని తన్నామరూపములకు విలక్షణమైనది యెరుగుట.

తత్వవివేకమనగా, యథార్థమైనవస్తువు పరమాత్మయని తెలియుట జ్ఞానులైనవారికి వివేకపంచకముగలిగియుండవలెనని వేదాంతశిద్ధాంతము.

31. కర్మకారణపంచకము.

దేహము, అహంకారము, శ్రోత్రాదికరణములు, ప్రాణాపానాది వ్యాపారములు సూర్యాద్యధిదైవములు యీ5న్ను కర్మకారణములు.

యీప్రకారము సమస్త సత్కర్మదుష్కర్మములు చేయుటకు నీ ఐదును కారణములైయుండుట తెలియక యెవ్వడు తన్నే కర్తగా జూచుచున్నాడో వాడుదుర్బుద్ధిగలవాడై ఆదుర్బుద్ధివలన ఆత్మతత్వమును చూడజాలడని భగవదాభిప్రాయము.

32. పంచమహాపాతకములు.

స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీగమనము యీనలుగురియొక్క సహవాసము ఈ5న్ను పంచమహాపాతకము లనంబడును. ఇవి ప్రాణాంతకాలమందైనను జేయగూడ దని పండితులు వచింతురు.

33. పంచకమలములు.

ఆధారకమలము, యోనికమలము, నాభికమలము, హృదయకమలము, ముఖకమలము యీ5న్ను పంచకమలము లనబడును.

యీపంచకమలములు క్రమముగా పంచబ్రహ్మలకు స్థానములని యెఱింగేది.

34. పంచప్రయోజనములు.

జ్ఞానరక్ష, తపస్సు, సర్వసంపాదనము, దుఃఖసంచయము, సుఖావిర్భావము యీ5న్ను పంచప్రయోజనము లనబడు.

జ్ఞానరక్ష యనగా, మనశ్శుద్ధి గలిగియుండుట.

తప మనగా, ఇంద్రియమనంబుల నిగ్రహించుట.

సర్వసంపాదన యనగా, షడ్గుణైశ్వర్యములు గలిగి జగత్పూజ్యుడైయుండుట.

దుఃఖసంచయ మనగా, క్లేశరహితుడైయుండుట.

సుఖావిర్భావ మనగా, ప్రతిబంధరహితుడై యానందించుట.

నానావిధప్రతిబంధవశంబున యీఅయిదును లేకపోయినప్పటికిని జ్ఞానరక్ష వొకటైనను గలిగియుండవలెనని బుధజనాభిప్రాయము.

35. అంశపంచకము.

అస్తి, భాతి, ప్రియము, నామము, రూపము ఈ5న్ను అంశపంచకము లనబడును.

అస్తి అనగా సత్తు, భాతి అనగా చిత్తు, ప్రియమనగా ఆనందము, నామ మనగా పేరు, రూప మనగా యెరుపునలుపు మొదలగు రూపము.

ఈఐదింటిలో మొదలుమూడును పరమాత్మరూపమనిన్ని, తక్కిన రెండును మాయాస్వరూపమనిన్ని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

36. పంచగవ్యములు.

గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము యీ5న్ను పంచగవ్య మనంబడును.

మ॥ యత్వగస్థికృతంపాపం దేహేతిష్ఠతిమామకే । ప్రాశనంపంచగవ్యంచ దహత్యగ్నిరివేంధనం॥

పూర్వోక్తపంచగవ్యము యేతన్మంత్రముచేత ఉపదేశానుపూర్వం ప్రాశనచేయవలెనని శాస్త్రఅభిప్రాయము.

37. పంచామృతము.

ఉదకము, పాలు, పెరుగు, నెయ్యి, తేనె ఈ5న్ను పంచామృతములు.

యీపంచామృతము యోగ్యులైనవారల కత్యంతసేవ నియ్యమని తెలియవలయును.

### 38. పంచయజ్ఞములు.

పాఠము, హోమము, సపర్య, తర్పణము, బలి యీ 5 న్ను పంచయజ్ఞము లనంబడును.

పాఠ మనగా, వేదపాఠము.

హోమ మనగా, వైశ్వదేవాదిహోమము.

సపర్య యనగా, అతిథిపూజ.

తర్పణ మనగా, పితురుతర్పణము.

బలి అనగా, భూతబలి.

యీపంచయజ్ఞములే వరుసగా బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, మనుష్యయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము లని చెప్పబడును.

ఈపంచయజ్ఞములవలన స్వర్గాదిభోగములు గలుగుటయేకాని, మోక్షంబు గలుగనేరదని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

### 39. ప్రమోదితజనన్యాదిపంచకము.

జనని, జనకుడు, సద్గురు, అగ్నిహోత్రుడు, ఆత్ముడు యీఐదు గురినిన్ని ప్రమోదింపజేసి వారలప్రసాదంబు వడయుట మేలని తా.

### 40. ఏకోత్తరపంచభూతగుణములు.

ఆకాశమునకు శబ్దము, వాయువకు శబ్దస్పర్శలు, అగ్నికి శబ్దస్పర్శ రూపములు, జలమునకు శబ్దస్పర్శరూపరసములు, పృథివికి శబ్దస్పర్శరూప రసగంధములు గుణములని తెలియవలయు.

### 41. పంచభూతలయకాలనిర్ణయము.

ఒకలఘ్వక్షరోచ్చారణమాత్రకాలంబు నిమేషము, అట్టినిమిషం బులుపదునెనిమిదియైననొకకాష్ట, తత్ కాష్టలుముప్పదియైననొకకళ,తత్ కళలుముప్పదియైన నొకక్షణము, ఆక్షణములు పండ్రెండు నొకముహూ ర్తము, నాముహూర్తంబులు ముప్పదియైన నొకయహోరాత్రంబుగడచు.

అయ్యహోరాత్రంబున శరీరేంద్రియ ప్రాణాంతఃకరణంబులు, స్వ వ్యాపారంబులు చాలించి తమకు కారణం బైన సుషుప్తిరూపావిద్యాంధ కారంబునందు లయంబునొందు నప్పుడు జాగ్రత్స్వప్నాత్మకంబగు నఖిల ప్రపంచంబు వాసనారూపమాత్రంబై పల్లవపత్ర పుష్పశలాటు ఫలమూల శాఖోపశాఖాత్మకంబైన వటవృక్షంబు వటబీజంబునం దున్న చందంబున నుండు, నిది నిత్యప్రళయం బననొప్పు.

అయ్యహోరాత్రపంచదశకంబు పక్షంబయ్యె. శుక్లకృష్ణాఖ్యపక్షద్వయంబు మాసం. బది పితృదేవతల కొక్కదినంబగు. నమ్మాసద్వయంబు ఋతువు. ఋతుత్రయం బయనంబు. దక్షిణోత్తరసౌజ్ఞకాయనద్వయంబు నొకసంవత్సరంబగు. అది దేవతల కొక్కదినంబగు. తద్దివసవాసరపక్షమాసక్రమంబుచేత పండ్రెండువేలసంవత్సరంబు లయిన కృతత్రేతాద్వాపరకలియుగంబులు నాలుగుంజను. నయ్యుగచతుష్టయంబును మహాయుగంబని చెప్పుదు. రవి డెబ్బదియొకటియైన మన్వంతరంబుచెల్లు. నమ్మన్వంతరంబులు పదునాలుగుచనిన నది బ్రహ్మకు నొక్కపగ లగు. నది చతుర్యుగసహస్రపరిమితంబాగటిలో జతుర్దశమనుప్రళయంబులును, ననేకయుగాంతప్రళయంబులు ప్రవర్తించు ననియు, నైమిత్తికప్రళయంబులవాంతరప్రళయంబులనం బ్రసిద్ధంబు లగు. నందుచేత నూరుసంవత్సరంబులు జనిన బ్రహ్మదేవుడు నాకంబు జెందు. నయ్యెడ మృత్యువు సమస్తజీవుల నొక్కపెట్టంబరిమార్చు. రుద్రుండు చిచ్చుకన్ను దెఱచి చూచు. సూర్యుండు పండ్రెండుమూర్తులు గైకొని ప్రకాశించు. నవ్వేళ ప్రజ్వలజ్వాలాభీలంబగు మహానలంబుజనించి విశ్వంబునంతయు భస్మీభూతంబుగాజేయు సప్తమారుతంబులు నొక్కపెట్టున విసరు. నవమేఘంబు లుప్పతిల్లి యమోఘంబులై నూరుదివ్యవర్షంబులు మహావర్షంబు గురియు. నందువలన సమస్తసముద్రంబులుం గలసి యేకార్ణవంబై మహామహీమండలంబు నాక్రమించు. నంతట,

ధరణీచక్రంబు మహాసలిలమధ్యంబున బహూదకంబుల స్వల్పలోష్టపిండంబువిధంబున విరిశిచడు. తప్తాయఃపిండంబొకతోయకణంబునుం బీల్చిన కైవడి బడబాగ్ని విజృంభించి యమ్మహాంభోరాశిని బానంబు సేయు. గాలియార్చినభంగి నమ్మహాతేజోమండలంబునుం మహావాయువు దెగటార్చు. నమ్మహాజంఘానసమీరంబు నిరోధేయం బగుటంజేసి ఆకాశంబునం గలయు. సుషుప్తియందు ప్రాణంబులపోలిక నృగ్నుశబ్దరూపంబైన నింగిని శ్రోత్రరూపంబైన సంకలనంబు మ్రింగిన తెఱంగున నయ్యాకాశంబును మహామనం బ్రగశించు. పంచతన్మాత్రసహితంబైన యమ్మహామానసంబును, నిద్రాసమయంబు గబళించుచాడ్పున నహంకారంబు గబళించు. నయ్యహంకృతిని మహాబుద్ధి మెసంగు. నమ్మహాతత్త్వంబును నవ్యక్తంబు తనయందు విలీనంబు గావించి యడంచుకొను. నది మాయా

విద్యావ్యక్త తమస్సుషుప్త్యాది శబ్దవాచ్యంబైన ప్రధానం బదియే బ్రహ్మ ప్రళయంబగు. నయ్యనాద్యనిర్వచియ్యాజ్ఞానంబు నద్గురూక్త జీవేశ్వరైక్య జ్ఞానానుభవ సమయంబున నభావంబగు. నదియే మహాప్రళయంబగును.

ఇట్టి నిత్యనైమిత్తిక దైనందిన కల్పాంతమహాప్రళయంబులయందు ఆత్మ యొకటిచేతనున్ను భాధింపబడక సాక్షియై వీని నన్నింటెనిం జూచుచున్నదని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

42. పంచతత్వ బహిర్గమన ప్రమాణములు.

పృథివి 12 అంగుళములు, ఉదకము 16 అంగుళములు, అగ్ని 4 అంగుళములు, వాయువ 8 అంగుళములు, ఆకాశము 1 అంగుళము.

ఈప్రకారము పంచతత్వములును ప్రాణవాయువుతోగూడి నాసా బిలములనుంచి బయలువెళ్లునని తెలియవలయు.

43. పంచతత్వ ఆకారములు.

పృథివి చతుష్కోణాకారము, జలము అర్థచంద్రాకారము, అగ్ని త్రికోణాకారము, వాయువ వర్తులాకారము, ఆకాశము బిందురూపము.

44. పంచతత్వ గమన స్వరూపములు.

పృథివితత్వము, నాసాబిలముకు మధ్యను ప్రవహించును.

ఉదకము—నాసాబిలమునకు క్రిందిప్రదేశము నాశ్రయించి ప్రవహించును.

అగ్ని—నాసాబిలము మీదిభాగము నాశ్రయించి నడుచును.

వాయువు—నాసాబిలములో అడ్డముగా నడుచును.

ఆకాశము—నాసాబిలం బంతయు నాశ్రయించి ప్రవహించును.

45. పంచతత్వరసములు.

పృథివి మధురము, ఉదకము స్వాదుకాషాయములు, అగ్నికి తిక్తము, వాయువకు పులుసు, ఆకాశమునకు కారము యీప్రకారము పంచతత్వములకు రసములు గలవని తెలియవలెను.

46. పంచతత్వస్పర్శములు.

పృథివికి కఠినము, జలమునకు శీతము, అగ్నికి ఉష్ణము, వాయువ్వు శీతోష్ణమిశ్రము, ఆకాశమునకు మృదుత్వము అని తెలియవలెను.

47. పంచతత్వాంశములు.

పృథివికి కఠినాంశము, జలమునకు ద్రవాంశము, అగ్నికి తేజోం

శము, వాయువకు చలనాంశము, ఆకాశమునకు బయలాంశము లని తెలియవలయును.

48. తత్త్వపంచకచక్రము.

| పంచతత్త్వములు. | పృధివి. | జలము. | అగ్ని. | వాయువు. | ఆకాశము |
|---|---|---|---|---|---|
| తత్త్వప్రమాణములు. | 12 అంగుళములు. | 16 అంగుళములు. | 4 అంగుళములు, | 8 అంగుళములు. | 1 అంగుళం |
| తత్త్వాకారములు. | చతుష్కోణము. | అర్ధచంద్రము. | త్రికోణము. | వర్తులము. | బిందువు. |
| తత్త్వగమనములు. | నాసామధ్యము. | నాసాబిలాధోభాగము | నాసాబిలోర్ధ్వభాగము | నాసాబిల తిర్యభాగము | నాసాబిలవ్యాపకము. |
| తత్త్వరసములు. | మధురము. | స్వాదుకాషాయము. | తిక్తము. | ఆమ్లము. | కటుకము. |
| తత్త్వస్పర్శలు. | కఠినము. | శీతము. | ఉష్ణము. | శీతోష్ణము. | మృదువు. |
| తత్త్వాంశములు. | కఠినము. | ద్రవము. | తేజము. | చలనము. | బయలు. |

ఈపంచసంఖ్యాప్రకరణములో నలుబదిరెండవసంఖ్య మొదలుకొని నలుబదితొమ్మిదవసంఖ్యవరకు గల విషయంబులు, శుభాశుభములు దెలియుటకు కారణమైన స్వరశాస్త్రసంబంధము లని తెలియవలయును.

49. పంచమలములు.

అణవమలము, కార్మికమలము, మాయికమలము, మాయేయ

మలము, తిరోధానమలము యీయిన్ని పంచమలము లనంబడును.

అణవమల మనగా, పరబ్రహ్మవిషైకజ్ఞానము అప్పుడప్పుడు కలుగగా దానిని మరుగుపరచునది.

కార్మికమల మనగా, వేదాంతశాస్త్రవిషయములను గురువులు బోధించునపుడు వానియందు బుద్ధిని చొరనియ్యనిది.

మాయికమల మనగా, పరబ్రహ్మవిషైకజ్ఞానవాసనను యెప్పుడు కలుగనియ్యనిది,

మాయేయమల మనగా, పాపకార్యములయందు మనస్సును చొరబెట్టునది.

తిరోధానమల మనగా, నిత్యసత్యపరబ్రహ్మ పరిపూర్ణమందు అనిత్యబుద్ధిపుట్టించి పరబ్రహ్మమునకంటె వేరుగా దేవతలును, మంత్రములును, క్రియలును, మతములును, సాధనములును కలవు. అవి సత్యములు అనెడి బుద్ధిని కలిగించి జనన మరణాది దుఃఖములను అనుభవింప జేయునది.

ఈపంచమలములు తొలుగుటకై యీశ్వరానుగ్రహమును, పెద్దల అనుగ్రహమును సంపాదింపవలెనని బుధజనాభిప్రాయము.

గద్య.

ఇది శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ వర
ప్రసాదలబ్ధ కవితా విలాస సందడి నాగదాస ప్రణీతంబైన
సకల తత్త్వార్థ దర్పణ మను వేదాంతశాస్త్రంబు
నందు త్రిసంఖ్యాప్రకరణము, చతుస్సం
ఖ్యాప్రకరణము, పంచసంఖ్యా
ప్రకరణంబులుం గల
ప్రథమనిరుక్తము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

అస్మద్గురుభ్యోన్నమః.

శ్రీమ న్నారాయణ సచ్చిదానంద పరబ్రహ్మణేనమః.

# సకలతత్వార్థదర్పణము.

## ద్వితీయ నిరుక్తము.

---

### షట్సంఖ్యాప్రకరణము.

---

1. భగవచ్ఛబ్దార్థషడ్గుణైశ్వర్యములు.

సమగ్ర మగు నైశ్వర్యము, ధైర్యము, కీర్తి, తేజస్సు, జ్ఞానము, వైరాగ్యము యీ6న్ను భగవచ్ఛబ్దార్థషడ్గుణైశ్వర్యములు అనంబడు.

ఈషడ్గుణైశ్వర్యయుక్తుండైనభగవంతుని సద్గురూపదేశముగా ధ్యానించిన తద్గుణములు గలుగునని తెలియుటే యీవిచారమునకు ఫలము.

2. మరియొకవిధ షడ్గుణైశ్వర్యములు.

ఐశ్వర్యము, ధైర్యము, కీర్తి, తేజస్సు, జ్ఞానము, వైరాగ్యము ఈ 6న్ను షడ్గుణైశ్వర్యము లనంబడును.

3. మరియొకవిధ షడ్గుణైశ్వర్యములు.

ఉత్పత్తిని, లయమును, ప్రాణులరాకడను, పోకడను, విద్యను, అవిద్యను యెఱుంగుటయే యీ6న్ను షడ్గుణైశ్వర్యము లనంబడును.

4. షట్చక్రముల వివరము.

మూలాధారము, స్వాధిష్టము, మణిపూరకము, అనాహతము, విశుద్ధచక్రము, ఆజ్ఞేయచక్రము యీ6న్ను షట్చక్రము లనబడును.

మూలాధారచక్రం బనగా, గుదస్థానంబున వ-శ-ష-స వర్ణకంబై చతుర్దళపద్మయుతంబై తప్తకాంచనరూపంబై పృధ్వీనిలయంబై ఘ్రాణకారణంబై మూలాధారచక్రంబు దనరు. నందు వినాయకునకు ఆరునూర్లహంసజపంబును,

స్వాధిష్టము—లింగస్థానంబున బ-భ-మ-య-ర-ల-వ వర్ణములు గలిగి షట్దళపద్మోపేతంబై రక్తవర్ణంబై జలస్థానంబై జిహ్వాకారణంబై స్వాధిష్టచక్రంబలరు. నందు బ్రహ్మదేవునకు ఆరువేలహంసజపంబును,

మణిపూరకము—నాభిస్థానంబున డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ వర్ణకంబై దశదళోపేతంబై తేజోనివాసంబై పీతవర్ణంబై నేత్రకారణంబై మణిపూరకచక్రంబలరు. నందు శ్రీమహావిష్ణువునకు ఆరువేలహంసజపంబును,

అనాహతము—హృదయస్థానంబున క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ వర్ణకంబై ద్వాదశదళోపేతంబై శ్వేతవర్ణంబై మరున్మందిరంబై త్వగింద్రియకారణంబై యనాహతచక్రంబుదనరు. నందు రుద్రునకారువేలహంసజపంబును,

విశుద్ధము—కంఠస్థానంబునం దకారాదిషోడశవర్ణకంబయి షోడశదళోపేతంబయి నీలవర్ణంబయి గగనసదనంబయి విశుద్ధచక్రం బలరు. నందు జీవాత్మునకు సహస్రజపంబును,

ఆగ్నేయం—భ్రూమధ్యస్థానంబున హం-క్షం అను వర్ణంబులు గలిగి ద్విదళలలితంబయి మాణిక్యవర్ణంబయి అంతఃకరణభవనంబయి యాజ్ఞాచక్రం బొప్పు. నందు పరమాత్మునకు సహస్రహంసజపంబును,

సహస్రారము—బ్రహ్మరంధ్రస్థానంబున ఓంకారవర్ణకంబయి కోటిసూర్యప్రకాశమానంబయి ధీవిలయస్థలంబయి సహస్రారచక్రంబలరారు నందు శ్రీగురుస్వామికి సహస్రహంసజపంబును,

శ్రీమద్దేశికోక్తంబయిన ఆసన, ముద్ర, లక్ష్య, మంత్ర, ధ్యానంబులను క్రమపూర్వకంబుగా పైనజెప్పిన చక్రాధిపతులకేర్పరికిని హంసజపము సమర్పించు. సద్గురుభక్తుండు జీవన్ముక్తుండగునని తెలియవలయు.

మరియును, ఆయజపామంత్రానుష్టానక్రమమున సమర్పణ జేయునప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాస వాయువులు దక్షిణ వామ పార్శ్వములయందుండెడి పింగళ యిడా నాడులయందు చరించును. మనస్సు ఆయుచ్ఛ్వాసనిశ్వాసవాయువులయొక్క ప్రవర్తనములను వెలుపల లోపల చూచుచు సార్వకాలంబును మధ్యమార్గమగు సుషుమ్నానాళమును జెంది సంచరించును. ఆయిడాపింగళానాడులకు పరమై నడిమినాళమైన సుషుమ్న ప్రకాశించుచుండును. ఆసుషుమ్నానాళమందలి స్వచ్ఛమైన ప్రణవకుండలియందు. అనగా, ఆజ్ఞాచక్రమందు కూటస్థుడయిన సర్వజీవులయంతర్యామిరూపముగా క్రీడించుచున్న పరబ్రహ్మము అంతర్మధ్యబాహ్యత్రిపుటులకు ద్రష్టయై అనగా, సాక్షియై ప్రకాశింపుచుండు నని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

| విషయములు. | 5. షట్చక్రాత్మక చక్రము, | | | | | | 7 |
|---|---|---|---|---|---|---|---|
| చక్రములు. | మూలాధారం. | స్వాధిష్టము. | మణిపూరకము. | అనాహతము. | విశుద్ధము. | ఆజ్ఞేయము. | సహస్రారం. |
| స్థానములు. | గుదము | గుహ్యము. | నాభి. | హృదయము, | కంఠము | భ్రూమధ్యము. | బ్రహ్మరంధ్రం |
| బీజములు, | వ-శ-స ష, | బ-భ-మ-య ర-ల | డ-ఢ-ణ-త-థ ద-ధ, న ప-ఫ. | క-ఖ-గ ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట, ఠ | అఆఇ ఈఉఊ ఋౠ ఌౡ ఎఏఐఒ ఓఔ అంఅః | హాం క్షం | ఓం |
| సంఖ్య. | 4 | 6 | 10 | 12 | 16 | 2 | 1 |
| పద్మములు, | చతుర్దళము. | షడ్దళము. | దశదళము, | ద్వాదశదళము, | షోడశదళము, | ద్విదళం | సహస్రదళము. |
| వర్ణములు, | తప్తకాంచనము, | రక్త. | పీత. | శ్వేత. | నీల. | మాణిక్యము. | కోటిసూర్యప్రకాశ |
| తత్వములు, | పృథివి. | జలము. | అగ్ని. | వాయువు. | ఆకాశము, | అంతఃకరణము. | బుద్ధి. |
| కారణములు. | ఘ్రాణం | జిహ్వ. | నేత్రములు | త్వక్కు | శ్రోత్రం | జ్ఞాత్రు. | ఆత్మ. |
| అధిపతులు, | విఘ్నేశ్వరుడు | బ్రహ్మ. | విష్ణు. | రుద్రుడు. | జీవాత్మ | పరమాత్మ. | గురుమూర్తి. |
| హంస జప సంఖ్య. | 600 | 6000 | 6000 | 6000 | 1000 | 1000 | 1000 |
| కాలం, ఘడియలు, విఘడియలు, లిప్తలు, | 1-40 | 6-40 | 16-40 | 16-40 | 2-46 40 | 2-46 40 | 2-46 40 |

6. షడ్భావములు.

పదార్థము, భావమసి అభావమని రెండువిధములు. అందు భావం బారువిధంబులుగా జెప్పంబడు. నదెట్లనిన,

ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, సమవాయము ఇవి 6న్ను భావమని జెప్పబడును.

ద్రవ్యము—పృథివ్యాపస్తేజో వాయ్వాకాశ కాలదిగాత్మ మనస్సులని తొమ్మిదివిధములు.

గుణము—రూపరస గంధస్పర్శ సంఖ్యా పరిమాణ పృథక్త్వసంయోగ విభాగ పరత్వాపరత్వ గురుత్వ ద్రవత్వ స్నేహాశబ్ద బుద్ధి సుఖ దుఃఖేచ్ఛా ద్వేష ప్రయత్న ధర్మాధర్మ సంస్కారములని ఇరువదినాలుగు విధములు.

కర్మము—ఉత్ క్షేపణాపక్షేపణాకుంచన ప్రసారణగమనములని అయిదువిధములు.

సామాన్యము—పరము అపరము అని ద్వివిధము.

విశేషము—నిత్యద్రవ్యవృత్తులచే ననంతము.

సమవాయము—అవయవావయవి గుణాగుణి క్రియాక్రియావన్నిత్య ద్రవ్యవిశేషసంసర్గరూపము.

1. అభావమనగా—ప్రాగభావ, ప్రధ్వంసభావ, అత్యంతాభావ అన్యోన్యాభావ మని నాలుగువిధములు.

ప్రాగభావము—ఉత్పత్తిలేక నాశముమాత్రముగలదు. ఇదిపదార్థోత్పత్తికి ముందేయుండునది.

ప్రధ్వంసభావము—ఉత్పత్తిగలిగి నాశములేనిది. ఇది పదార్థము నశించిన పిదప గల్గునది.

త్రైకాలికములత్యంతాభావాన్యోన్యాభావములు.వీనివిషయములు అతిబాహుళ్యము గాన యిందు వ్రాయబడవు.

7. షడ్విధశక్తులు.

సర్వస్వతంత్రశక్తి, నిత్యమలుప్తశక్తి, అనంతశక్తి,అనాదిబోధశక్తి సర్వజ్ఞత్వశక్తి, నిత్యతృప్తిత్వశక్తి యీ6న్ను షడ్విధశక్తు లనంబడును.

8. షడ్విధసమాధులు.

బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి, బాహ్యశబ్దానువిద్ధ సవి

కల్పకసమాధి, బాహ్యనిర్వికల్పకసమాధి, అంతర్దృశ్యానువిద్ధ సవికల్పక సమాధి, అంతర్శబ్దానువిద్ధసవికల్పకసమాధి, అంతరనిర్వికల్పకసమాధి యీయాఱున్ను షడ్విధసమాధు లనంబడును.

బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి—తనకంటె అన్యముగా దోఁచెడు బ్రహ్మవిష్ణురుద్రయీశ్వరసదాశివాది పిపీలికాంత మగు సమస్త చేతనములును, తృణాదిమేరుపర్యంత మైన అచేతనములును, తన తెలివి యందే పుట్టిగిట్టినవి, కాబట్టి, అవి తనప్రజ్ఞాన కల్పితములని ఆప్రజ్ఞానమే పరబ్రహ్మ మని ఆపరబ్రహ్మమే తానని చూచుట బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి యనబడును.

బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి—శివ రామ గోవింద నారాయణ వాసుదేవ మహాదేవాది సకల నామములలో తనచెవికి వినబడిన నామము తాను గానని విడిచి సర్వనామవిలక్షణ మైన పరబ్రహ్మవస్తువు తానని యోచించుటే బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి యనబడును.

అంతర్దృశ్యానువిద్ధసవికల్పకసమాధి — కామాదిస్వజ్ఞప్తివరకు గల వృత్తులు తనయందు గలిగినప్పుడు వాని నన్నింటిని అప్పు డప్పుడు వొక్కటొక్కటిని క్రమముగా నేను గానని నిగ్రహించి వీని కన్నిటికిని విలక్షణ మైన పరబ్రహ్మమును తా నని భావించుట అంతర్దృశ్యానువిద్ధ సవికల్పకసమాధి యనబడును.

అంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి—రాగ ద్వేష కామ క్రోధ లోభ మోహ మద మత్సర యీర్ష్య అసూయ దర్ప అహంకారాది స్వజ్ఞప్తిపర్యంత మైన సకలాంతరవస్తునామములను నేను గా నని విడిచి సర్వవిలక్షణమైన పరమాత్మ తానని యూహించుట అంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి యనబడును,

బాహ్యనిర్వికల్పకసమాధి—యీచతుర్విధసవికల్పక సమాధుల యందు సుస్థిరతగలిగి అంతర బాహ్యములయందు తనకు నన్య మేమియు దోఁచక తోఁచినను సముద్రమునందు ముంచినకుండ లోపల వెలుపల పరిపూర్ణమై ఆకాశమం దుంచినకుండ లోపల వెలుపల శూన్యమైనట్లుండుట బాహ్యనిర్వికల్పకసమాధి యనంబడును.

అంతరనిర్వికల్పకసమాధి—పైనజెప్పినవృత్తు లేవియులేక అఖండ పరిపూర్ణసచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమైయుండుట అంతరనిర్వికల్పక

సమాధి యనంబడును.

9. షడూర్మ్ములు.

క్షుధ, తృష్ణ, శోకము, మోహము, జననము, మరణము యీ 6న్ను షడూర్మ్ములనంబడును.

యీవిచారమునకు ఫలం బేమనిన, క్షుత్తృష్ణ లనంబడు. ఆకలి దప్పులు రెండున్ను ప్రాణధర్మ్మము లనిన్ని, శోక మోహములు రెండున్ను మనోధర్మ్మములనిన్ని, జననమరణములు రెండున్ను దేహధర్మ్మము లనిన్ని తెలిసి ఆత్మ కీషడూర్మ్ములు లేవని గ్రహించుటే ఫలము.

10. షడ్భావవికారములు.

జాయతే, అస్తితే, పరిణమతె, వర్ధతె, విపక్షయతే, వినశ్యతె యీ6న్ను షడ్భావవికారము లనంబడు.

దీనికితాత్పర్యము, పుట్టుట, పెరుగుట, బలియుట, చిక్కుట, ముదియుట, చచ్చుట వికారము లాత్మకు లేవని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

11. అరిషడ్వర్గములు.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మత్సరము యీ6న్ను అరిషడ్వర్గము లనబడును.

కామ మనగా, పదార్థములు గోరుట.

క్రోధ మనగా, పరులపై కోపము గలిగియుండుట.

లోభ మనగా, తనకుగల ద్రవ్యాదులు వదలకుండుట.

మోహ మనగా, పదార్థములయం దుండెడిప్రేమ.

మద మనగా, ధనముచేత పెద్దపిన్నలను తెలియకుండుట.

మాత్సర్య మనగా, తనద్రవ్య మపహరింతామనే జనులందు ద్వేష ముంచుట.

యీఅరిషడ్వర్గము జ్ఞానమునకు ప్రతిబంధక మని విడిచి వర్తింపవలెనని తెలియుటే యీవిచారమునకు ఫలము.

12. షడ్విధజితేంద్రియులు.

అజిహ్వుడు, షండుడు, పంగువు, అంధుడు, బధిరుడు, ముగ్ధుడు యీ6న్ను షడ్విధజితేంద్రియు డనబడుదురు.

అజిహ్వు డనగా, నాలుకలేనివాడుగాడు, మరియెవ్వ డనిన, ఇది నాకు ప్రియము. ఇది నాకు అప్రియము అని చెప్పక పెట్టినది భక్షించి

అసత్యంబులు బలుకక మితభాషియైయుండు నతండు అజిహ్వుడనంబడు.

షండు డనగా, శిశ్నంబులేనివాడుగాడు. మరియెవ్వడనిన, సద్యోజాతమైన శిశువును ముప్పదేండ్లకులోపలి వయస్సుగల యువతిని యాబదియేండ్లువెళ్ళినవృద్ధురాలను సమముగా జూచుచు నెంతమాత్రము వికారములేకయుండునతండు షండు డనంబడు.

పంగు వనగా, కాలుకుంటివాడుగాడు. మరియెవ్వడనిన, నిరంతరము యోజనదూరమునకంటె యెక్కువదూరము బోని యతడు పంగు వనంబడు.

అంధు డనగా, గుడ్డివాడుగాడు. మరియవడనిన, కన్నులున్నప్పటికిని యేసన్యాసియొక్క దృష్టి నాలుగుకాడిమానులు బెట్టిచూచితె అవలికి బోలేదో ఆసన్యాసి అంధు డనంబడు.

బధిరుడనగా, చెవిటివాడుగాడు. మరియన్వడనిన, హితమైనవాక్యమున్ను, మిక్కిలి అహితమైన వాక్యమున్ను విని హితాహితములు గ్రహింపక వినరానివానివలెనుండునతడు బధిరుడని చెప్పబడును.

ముగ్ధు డనగా, మూఢుడున్ను సౌందర్యహీనుడున్ను గాడు. మరియెవ్వడనిన, సమస్తవిషయములు సన్నిధానమందు వచ్చియున్నప్పటికిని తాను యింద్రియపటుత్వముగలవాడైయుండియు చలనములేక నిద్రబోవువానివిధముననుండునతడు ముగ్ధు డనంబడు.

13. షడ్విధలింగములు.

ఉపక్రమోపసంహారములువకలింగము, అభ్యాసమువకలింగము, అపూర్వ మొకలింగము, ఫల మొకలింగము, అర్థవాద మొకలింగము, ఉపపత్తి వకలింగము యీాన్ను షడ్విధలింగము లనంబడును.

ఉపక్రమోపసంహారములు—సృష్టికిపూర్వము ఈజగత్తు నామరూపరహితమై సత్తామాత్రమై యుండెనని ప్రతిపాదించుట ఉపక్రమమనంబడు.

ఈలోచునట్టి సర్వప్రపంచము అసత్తుయొక్క స్వరూపము. అదే సత్యము. అదే ఆత్మ అని ప్రతిపాదించుట ఉపసంహార మనబడును.

అభ్యాసము—నీవే బ్రహ్మము. బ్రహ్మమే నీవని తొమ్మిదిప్రకారముల బోధింపుచున్నది గాన, ఇది రెండవలింగ మనంబడును.

అపూర్వము—అష్టప్రమాణములలో నుపనిషత్ప్రమాణముచేత

ఆత్మలక్షణ మెరుగఁబడు గనుకనున్ను, ఇతరప్రమాణములచేత యెరుఁగఁ బడదు గనుకనున్ను ఇది అపూర్వమనబడును. ఇదియ్యే మూఁడవలింగమన బడును.

ఫలము—అద్వితీయాత్మజ్ఞానంబునకు ప్రారబ్ధ మెంతపర్యంతంబు నశింపలేదో అంతపర్యంతంబులును దేహేంద్రియాదిప్రపంచము మిధ్యా రూపంబుగాఁ దోఁచును. ఆప్రారబ్ధమునకు నిశ్శేషనాశంబు యెప్పుడువచ్చు చున్నదో అప్పుడు జగత్తు సర్వాత్మనా తోఁచక అద్వితీయాత్మస్వరూపం బుగా నుండు ననుట ఫల మనంబడును. ఇది నాలవలింగము.

అర్థవాదము—యేవస్తువ యెరుగఁబడుటచేత యెరుగఁబడనివస్తువు యెరుగఁబడుచున్నదో అది అర్థవాద మనబడును. ఇదియే ఐదవలింగము.

ఉపపత్తి—మృత్తువల్లఁబుట్టిన ఘటశరావాదులు కారణముకంటె వేరుగాఁదోఁచినప్పటికిని ఈకార్యములకు ఉచ్చారణంబు మంత్రము వినాఁగ అర్థములేదు. గనుక, కారణవ్యతిరిక్తముగా కార్యము లేదనె యుక్తిని ప్రతిపాదించుట వుపపత్తి యనంబడు. ఇది ఆరవలింగ మనంబడును.

ఈషడ్విధలింగప్రమాణములచేత ఆత్మను తెలియవచ్చునని వేదాంత శాస్త్రసిద్ధాంతము.

## 14. షట్కౌశికములు.

త్వక్కు, రుధిరము, మాంసము, అస్థి, మజ్జ, స్నాయువులు ఈ 6న్ను షట్కౌశికము లనంబడును.

త్వక్కు అనగా చర్మము, రుధిరమనగా రక్తము, మాంసమనగా నంజుడు, అస్థి అనగా యెముకలు, మజ్జ యనగా శుక్లములో యించుక భేదము, స్నాయువు లనగా నరములు.

యీఆరింటిలో త్వగ్రుధిరమాంసములు మూఁడున్ను తల్లిసంబంధ మైనవనియును, అస్థి మజ్జా స్నాయువులు మూఁడున్ను తండ్రిసంబంధమైన వనిన్ని తెలియవలెను.

## 15. సప్తప్రకృతులు.

భూతపంచకము, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము విషయపంచకము, అంతఃకరణచతుష్టయము, సప్తధాతువులు యీ6న్ను సప్తప్రకృతు లనంబడును.

## 16. షడ్గుణైశ్వర్యములు.

సర్వకర్తృత్వము, సర్వపాలకత్వము, సర్వసంహారకత్వము, సర్వ

నియంతృత్వము, సర్వభోక్తృత్వము, సర్వేశ్వరత్వము యీ 6 న్ను షడ్గుణైశ్వర్యము లనంబడును.

17. అరిషడ్వర్గజననవినాశహేతువులు.

కామము—సంకల్పముచేత బుట్టును. భగవద్ధ్యానముచేత నశించును.

క్రోధము—పరులదోషమువలన బుట్టును. క్షమగల్గిన నశించును.

లోభము—భూతానిత్యము దెలియనందువలన బుట్టును. తెలిసి నశించును.

మోహము—అజ్ఞానముచే బుట్టును. అధర్మము వర్జించుటచే నశించును.

మదము—కులధనవిద్యాదులచే బుట్టును. వాని అశాశ్వతము తెలిసిన నశించును.

మత్సరము—సాత్వికగుణ గానందున బుట్టును. సాధుసేవవలన నశించును.

18. షణ్మతములు.

వైష్ణవము, శైవము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము ఈ 6న్ను షణ్మతము లనంబడును. ఈషణ్మతములచేత ఆత్మ దెలియబడదని తెలియుటే ఫలము. ఈషణ్మతములకు తాత్పర్యము బహుళంబై యుండుటచే గ్రంథవిస్తారభీతిని నింకు దెలుపలేదు.

19. షట్కర్మలు.

యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము యీ 6 న్న షట్కర్మము లనంబడును. ఈషట్కర్మముల వలన మోక్షము లేదని తెలియుటే ఫలము.

20. షట్శాస్త్రములు.

తర్కము, వ్యాకరణము, ధర్మశాస్త్రము, మీమాంసము, వైద్యశాస్త్రము, జ్యోతిషము యీ 6న్ను షట్శాస్త్రము లనంబడును.

21. షడ్రసములు.

మధురము, ఆమ్లము, లవణము, తిక్తము, కటు, కషాయము యీ 6న్ను షడ్రసము లనంబడును. యీరసములను ఆత్మ సాన్నిధ్యమందుండు బుద్ధిరసనేంద్రియద్వారావిభజించి యెరుగుచున్నదని తెలియుటే యీవిచారమునకు ఫలము.

22. షడభిజ్ఞత్వము.

దివ్యదృష్టి, దివ్యశ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్తజ్ఞానము, అప్రత్యక్షవిషయజ్ఞానము, వియద్గమనాగమనవియోగాదిలక్షణమైన బుద్ధి యీ6న్ను షడభిజ్ఞత్వ మనబడును.

దివ్యదృష్టి యనగా, బహుదూరంబు జూచుట.

దివ్యశ్రవణ మనగా, మిక్కిలి దూరపుమాట వినబడుట.

పూర్వనివాసస్మృతి యనగా, పూర్వజన్మమందు తానెచ్చట నున్నది యెరుగుట.

పరచిత్తజ్ఞాన మనగా, ఇతరుల మనస్సులో నున్న సంగతి తెలిసికొనుట.

అప్రత్యక్షవిషయజ్ఞాన మనగా, కనుపడనివస్తువులను కనుగొనుట.

వియద్గమనాగమనవియోగాదిబుద్ధిలక్షణ మనగా, ఆకాశమార్గమున బోవుట వచ్చుటయందు నేర్పుగలబుద్ధి.

ప్రాణాయామాదియోగాభ్యాసమువలన ఈషడభిజ్ఞత్వముగలుగునని తెలియుటే యీవిచారమునకు ఫలము.

---

సప్తసంఖ్యాప్రకరణము.

---

1. సప్తధాతువులు.

రసము, రుధిరము, మాంసము, మేదస్సు, మజ్జ, శుక్లము, అస్థి యీ7న్ను సప్తధాతువు లనంబడును.

2. సప్తవ్యసనములు.

తనువ్యసనము, మనోవ్యసనము, ద్రవ్యవ్యసనము, రాజ్యవ్యసనము, విశ్వాసవ్యసనము, పుత్రస్నేహవ్యసనము, కలహవ్యసనము యీ7న్ను సప్తవ్యసనము లనంబడును.

యీవ్యసనంబులు ఆత్మజ్ఞానంబునకు విరోధం బని తెలిసి విడువవలెను.

3. సప్తావస్థలు.

అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షము, అపరోక్షము, అనర్థనివృత్తి, ఆనందావాప్తి యీ7న్ను సప్తావస్థ లనంబడును.

అజ్ఞానము—చిదాభాసు డయిన ఆత్మ సంసారమం దాసక్తి గల

వాఁడై యొకానొకప్పుడైనా తనకు స్వరూపభూతుఁడును, స్వప్రకాశుఁడునగు కూటస్థుని యెఱుగకుండుట అజ్ఞాన మనబడును.

ఆవరణము—ఒకఁడు చిదాభాసునిబిలిచి కూటస్థు నెఱుగుదువా యని యడుగుచుండఁగా, కూటస్థుఁ డని యొకఁ డున్నాఁడా? వుంటే తోఁచ బడఁడా? లేఁడు అని పలుకుట ఆవరణ మనబడును.

విక్షేపము—నేను కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని, మనుష్యుఁడను, బ్రాహ్మణుఁడను అనెడి అధ్యాసమునకు కారణమై దేహద్వయంబుతోఁడఁ గూడుకొనివుండెడు చిదాభాసుఁడు విక్షేప మనబడును.

పరోక్షము—ఈచిదాభాసుఁడు గురూపదేశముచే మొదట కూటస్థుఁ డొకఁడు గలఁడని పరోక్షంబుగా నెఱుంగుట పరోక్షజ్ఞాన మనబడును.

అపరోక్షము—చిదాభాసుఁడు గురువుయొక్క శ్రవణాదులను చేసి జ్ఞానంబు సంపాదించి తరువాత నాకూటస్థుఁడు నేనే నని యెఱుఁగుట అపరోక్షజ్ఞాన మనబడును.

అనర్థనివృత్తి—చిదాభాసుఁ డగు జీవుఁడు నిర్వికారుఁడు నసంగుఁడు నయిన యాత్మ నేనని యెఱిగిన తరువాత కర్తృత్వాదులు శోకజాతములని యెఱుఁగుట అనర్థనివృత్తి యనబడును.

ఆనందావాప్తి—సకల కర్తవ్యజాతంబును, పొందఁదగిన ఫలజాతంబంతయును తనవలెనే కల్పితంబులై పొందబడునని తెలిసి సంతోషించుచుండుట ఆనందావాప్తి యనబడును.

ఈసప్తావస్థలలో మొదటిమూఁడవస్థలు బంధహేతువులు. తక్కిన నాల్గవస్థలు మోక్షహేతువు లని తెలియుటే యీవిచారమునకు ఫలము.

4. సప్తాజ్ఞానభూమికలు.

బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రము, సుషుప్తి యీయేడ్న్ను సప్తాజ్ఞానభూమికలు.

బీజజాగ్రము—నామరూపరహితాఖండ పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మమందు జగత్సృష్టికి కారణముగా గలిగిన తెలివియే బీజజాగ్ర మనబడును.

జాగ్రము—అవిభక్తమగు నాతెలివికి ముందు లేనిభేదము సూక్ష్మముగా గలిగి ప్రపంచాభిముఖ మగుట జాగ్ర మనంబడు.

మహాజాగ్ర మనగా, ఆలోకవాసన ప్రబలుట.

జాగ్రత్స్వప్నము—జాగ్రద్దశయందు చూచినవిచూడనివిసంకల్ప నిష్ప్రయోజనముగా మనోరాజ్యమేలుట జాగ్రత్స్వప్న మనంబడు.

స్వప్న మనగా, ఆజాగ్రమందు కల్పితస్వరూపముల జూచుట.

స్వప్నజాగ్ర మనగా, మరచినదాని దలచుట.

సుషుప్తి యనగా, ఆత్మ ప్రతిబింబముగా దోచుచున్న జగద్విష యము సుఖమని దానిలో మునుగుట.

### 5. సప్తజ్ఞానభూమికలు.

సుఖేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, సంసక్తినామిక, పదార్థభావన, తురీయ్యము యీయేన్ను సప్తజ్ఞానభూమిక లనబడును.

సుఖేచ్ఛ—బహుజన్మార్జిత సుకృతపరిపాకమువలన కాకతాళీయ్య న్యాయముగా దైవికముచేత జ్ఞానముగలవాడై యీఅపారసంసారసాగర మెట్లుదాటగలనని పరితపించి సజ్జనులను జేరి పిమ్మట వారియుపదేశంబున సత్కర్మాచరణమును వేదాంతశాస్త్రపరిజ్ఞానమునుగలిగి మోక్షము నపే క్షించుట సుఖేచ్ఛ యనంబడు.

విచారణ—అద్వైతశాస్త్రపరిజ్ఞాన సత్సంగవైరాగ్యంబులు గలిగి బ్రహ్మ మెయ్యది యని విచారించుట విచారణ యనంబడు.

తనుమానసి—ఈరెండుభూమికల సాధనపూర్ణముగాగలిగి దారు ణము లగు విషయేంద్రియముల త్రిప్పలతో దగులక మనస్సును క్షీణింప జేయుట తనుమానసియనంబడు. దీనికేఅసంగమని మరియొకపేరుగలదు.

యీఅసంగమే సామాన్యాసంగమని విశేషాసంగమని రెండువిధ ములు. ఇవియే నాలుగువిధములుగా జెప్పబడు నదెట్లనిన,

సామాన్యాసంగమము, సామాన్యసామాన్యాసంగమము, విశేషా సంగమము, విశేషవిశేషాసంగమము అని నాలుగువిధములు. అందు,

సామాన్యాసంగమము—శబ్దాదివిషయములయందు నేనుకర్తను భోక్తను బాధ్యబాధకుడనుగాను సుఖదుఃఖములు యీశ్వరాధీనము లని దేనియందు దాశ లేకుండుట. సామాన్యాసంగమ మనబడును.

సామాన్యసామాన్యాసంగమము — సంచితకర్మములచేత లభ్య మయిన సుఖదుఃఖములయందు ప్రియాప్రియములులేక ననుభవింపుచు వేదాంతమహావాక్యార్థ నిశ్చయమందు జేరుట సామాన్యసామాన్యా సంగమ మనంబడు.

విశేషాసంగమము—సత్వాసంగత్యాపరోక్షజ్ఞానపురుషప్రయత్న జ్ఞానశాస్త్రముల సంతతాభ్యాసమువలన పరమవస్తువు కరతలామలకమై కనుపడుచుండగా పరమాతత్వస్థితిబొంది పూర్ణానిష్ఠుడై శాంతి గలిగియుండుట విశేషాసంగమ మనంబడు.

విశేషవిశేషాసంగమము—చరాచరాత్మకమయిన సకల వస్తువులను వస్త్వానుభవమునుఅఖండాకారముగాజూచుచు నిస్సంకల్పుడైయుండు దర్శించిన ఆత్మయందు మనసుగరుగుట విశేషవిశేషాసంగమమనంబడు.

ఈమూడుభూమికలలో దేనినైనా అభ్యాసముచేయుతరిని మృతులైన యోగులకు పునర్జన్మము గలదు అనగా, ఈగ్రంథంబులో తృతీయ నిరుక్తమందు యోగభ్రష్టునకు జెప్పిన ఫలమును బొందుదురని తెలియవలెను.

సత్వాపత్తి—ఈమూడుభూమికలనభ్యసించి యింద్రియార్థములం దాశయూని ఇతరసంకల్పములు లేక బ్రహ్మనిష్ఠగలిగియుండుట సత్వాపత్తి యనంబడును.

సంసక్తినామిక — యీనాలుగుజ్ఞానభూమికల అభ్యాసమువలన విషయసంగమము గుణత్రయసంగమము లేక బ్రహ్మనిష్ఠయందు పట్టుదప్పకయుండుట సంసక్తినామిక యనంబడు.

పదార్థభావన—ఈఐదుభూమికల అభ్యాసవిశేషముచేత బాహ్యాంతరదృశ్యము లేక స్వాత్మారాముడై బ్రహ్మము నేననుట పదార్థభావన యనంబడును.

తురీయము—ఈఆరుభూమికల మార్గ మెరిగి యేమింట భేదము లేమిం దెలిసి పరబ్రహ్మమాత్రుండై యుండుట తురీయ మనంబడు.

ఈవిచారమునకు ఫలం బేమనిన, ఇందులో మొదటిమూడుభూమికలు జాగ్రదావస్థయనియు, నాలవభూమిక స్వప్నావస్థయనియు, ఐదవభూమిక సుషుప్తావస్థయనియు, ఆరవభూమికతురీయావస్థయనియు, ఏడవభూమిక అవాఙ్మానసగోచర మయినదని తెలియుటేఫలము.

6. సప్తవిధబుద్ధినిరూపణ.

పండ, మేధ, చార్వి, చత్వా, గృహీత, శ్రౌతి, ప్రతిభ యని వక బుద్ధియే యేడువిధములుగా జెప్పంబడు.

పండ యనగా, తత్వమును తెలుసుకోతగిన బుద్ధి.

మేధ యనగా, విన్నవాని నన్నిటిని మరువకయుండు బుద్ధి.

చార్వి యనగా, వూహాపోహాలయందు నేర్పుగల బుద్ధి.

చత్వ యనగా, విషయములను చక్కగా అడిగి విసుకులేక వినుట యందు ఓర్పుగల బుద్ధి.

గృహీతయనగా, చెప్పినవానినన్నిటిని తప్పక గ్రహించుటయందు శక్తిగల బుద్ధి.

శ్రోతి యనగా, గురుశుశ్రూషలయందు సహనముగల బుద్ధి.

ప్రతిభయనగా, యేదియేని వకవిషయమును పలుకదలచినప్పుడు వాగ్ధోరణిగలిగి సమయోచితముగా శ్రుతిస్మృతీతిహాసానుభవములను పెక్కులు చూపి వినువారు ప్రశ్నలు చేయ దోచకుండా విషయములను వెలుపుటయందు శక్తిగలబుద్ధి.

7. మరియొకవిధ సప్తజ్ఞానభూమికలు.

సుఖేచ్ఛ, ఆత్మవిచారము, నిస్సంగము, వాసనాక్షయము, ఆనందిని, తూర్యము, తూర్యాతీతము యీ 7 న్ను సప్తజ్ఞానభూమిక లనబడును.

8. సప్తవిధచైతన్యములు.

శుద్ధచైతన్యము, ఈశ్వరచైతన్యము, జీవచైతన్యము, ప్రమాతచైతన్యము, ప్రమాణచైతన్యము, ప్రమేయచైతన్యము, ఫలచైతన్యము యీ 7 న్ను సప్తవిధచైతన్యము లనంబడును.

శుద్ధచైతన్య మనగా, మాయోపాధిరహితమయిన చైతన్యము.

ఈశ్వరచైతన్య మనగా, మాయోపాధితో గూడిన చైతన్యము.

జీవచైతన్య మనగా, అవిద్యోపాధితోగూడిన చైతన్యము.

ప్రమాతచైతన్య మనగా, అంతఃకరణముతోగూడిన చైతన్యము.

ప్రమాణచైతన్యమనగా, అంతఃకరణవృత్తితోగూడిన చైతన్యము.

ప్రమేయచైతన్య మనగా, యెరుగబడని చైతన్యము.

ఫలచైతన్య మనగా, యెరుగబడిన చైతన్యము.

ఈప్రకారంబుగా నొక్కడై పరిపూర్ణుడైనఆత్మ వుపాధిచేత ననేకవిధములుగా జెప్పబడుచున్నాడు. ఆవుపాధినితోసివేసి అద్వితీయుడై పరిపూర్ణు డయిన ఆత్మ నే నని యెవ డెరుగుచున్నాడో వాడు ముక్తు డని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

## 9. సప్తావరణములు.

చతుర్దశభువనాత్మకం బయిన విరాడ్రూపంబు. నారూపంబునకు కోటియోజనవిశాలంబై యండకటాహంబు పృథివి యగు దీని పంచాశత్కోటివిశాలంబని కొందరు అయ్యావరణంబుమీద సలిల తేజ సమీర గగనాహంకార మహత్తత్వంబనియెడి నావరణంబులు గ్రమంబున నొండొంటికి దశగుణోత్తరాధికంబులైయుండునట్టి యేడింటమీద ప్రకృత్యావరణంబు మహావ్యాపకంబై యుండును.

యీసప్తావరణములను క్రమముగా భేదించి పరమపదంబు ప్రవేశింపవలయునని తెలియవలెను.

## 10. సప్తావరణముల వివరము.

పృథివి, జలము, అగ్ని, వాయువ, ఆకాశము, అహంకారము, మహత్తత్వము యీ7న్ను సప్తావరణము లనబడును.

ప్రథమావరణమైన పృథివి—కోటియోజనవిశాలమై యుండును.

ద్వితీయావరణమైన జలము—పదికోట్లయోజనవిశాలంబై యుండును.

తృతీయావరణమైన అగ్ని—ఇరువదికోట్లవిశాలంబైయుండును.

చతుర్థావరణమైన వాయువు — ముప్పదికోట్లయోజనవిశాలంబై యుండును.

పంచమావరణమైన ఆకాశము—నలుబదికోట్లయోజన విశాలంబైయుండును.

షష్టావరణమైన అహంకారము—యాబదికోట్లయోజనవిశాలమై వుండును.

సప్తమావరణమైన మహత్తత్వము—అరువదికోట్లయోజనవిశాలమైవుండును.

ఇన్నిటిపైన మహావరణమై ప్రకృతి వ్యాపించియుండును.

ఈవిచారమునకు ఫలం బేమనిన, యీసప్తావరణములకు దృష్టిగోచరమైనంతవరకు యీచెప్పినయోజనములు నియమింపంబడినవేకాని వస్తుతః విచారించునప్పుడు అనంతములైయున్నవని తెలియుటేఫలము.

## 11 మరియొకవిధ సప్తావరణములు.

దుఃఖము, జన్మము, కర్మము, అభిమానము. అవివేకము. అజ్ఞాన

ము, మాయ యీ7న్ను సప్తావరణము లనబడును.

దుఃఖ మెందుచేత వచ్చినదంటే జన్మ మెత్తుటచేత వచ్చినది.
జన్మ మెందుచేత వచ్చినదంటే కర్మముజేయుటచేత వచ్చినది.
కర్మ మెందుచేత చేయబడినదంటే అభిమానముచేతచేయబడినది.
అభిమానము యెందుచేత వచ్చినదంటే అవివేకముచేతవచ్చినది.
అవివేకము యెందుచేత వచ్చినదంటే అజ్ఞానముచేత వచ్చినది.
అజ్ఞానము యెందుచేత వచ్చినదంటే మాయవలన వచ్చినది.
మాయ యెందుచేతవచ్చినదంటే మాయ అనాది గనుక, ఎందు చేతను వచ్చినదిగాదు.

12. మరియొకవిధ సప్తధాతువులు.

చర్మము, రక్తము, మాంసము, మేదస్సు, శల్యములు, మజ్జ, శుక్లము యీ7న్ను సప్తధాతువులని కొందరందురు.

13. మరియొకవిధ సప్తవ్యసనములు.

వేటాడుట, జూదమాడుట,సురాపానము జేయుట,స్త్రీలోలుడగుట కఠినవాక్యంబులుబలుకుట, కఠినదండంబుజేయుట, కానియీవియిచ్చుట యీ7న్ను సప్తవ్యసనము లనంబడును.

14. సప్తమండలములు.

భూమి, జలము, అగ్ని, వాయువ, ఆకాశము, సూర్యుడు,చంద్రుడు యీ7న్ను సప్తమండలము లనబడును.

15. సప్తసంతానములు.

సత్పుమారునిగాంచుట, తటాకము వేయించుట, కావ్యంబురచించుట, కోటికిపడిగెత్తుట, గుడికట్టించుట, వనము వేయించుట, సద్బ్రాహ్మణులకు జీవనాధారంబులుగల్పించుట ఈ7న్ను సప్తసంతతు లనంబడును.

యీసప్తసంతతులలో నేదైననొకటింజేసినవాడు తన నూటొక్క కులమువారిని నరకవిముక్తులంజేసి స్వర్గంబునకు నడుపుట నిక్కమయినను కావ్యం బిన్నిటికి భూషణంబయినను వీరలకు స్వర్గాదిభోగప్రాప్తియేకాని శాశ్వతసుఖం బయిన మోక్షంబు గలుగనేర దని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

## అష్టసంఖ్యాప్రకరణము.

### 1. అష్టప్రకృతులు.

మనస్సు, బుద్ధి, అహంకారము, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము యీయెన్మిది అష్టప్రకృతు లనబడును.

### 2. అష్టవిధవైరాగ్యములు.

అహింసయు, సత్యము, ఆస్తేయము, స్త్రీలను గంటికీర్తించకుండుట తద్భాషణములు వినకుండుట, గుహ్యభాషణము చేయ నుద్యోగించకుండుట, స్త్రీలనుగూర్చి స్తోత్రము జేయకుండుట, సంభోగమున కుపక్రమించకుండుట యీయెన్మిది అష్టవిధవైరాగ్యములని చెప్పబడును.

### 3. అష్టాత్మలు.

జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానాత్మ మహాత్మ, భూతాత్మ యీయెన్మిది అష్టాత్మ లనబడును.

జీవాత్మ యనగా, తన్నుతా నెరుగకుండునది.

అంతరాత్మయనగా, శరీరజడత్వమును గన తానెవరోయని చింతించుట.

పరమాత్మ యనగా, తన్ను తానెరిగి సుషుప్తిని నివర్తించునది.

నిర్మలాత్మ యనగా, మలత్రయాదులనుమీరి ఆనందించునది.

శుద్ధాత్మ యనగా, సర్వవ్యాపకుడై జడముతో కలసి కలియక యుండునది.

జ్ఞానాత్మయనగా, సకలభూతహృదయకమలములయందుండునది.

మహాత్మ యనగా, సకలభూతకార్యాకార్యముల నెరుంగునది.

భూతాత్మ యనగా, సర్వభూతములు తానై ప్రకాశించునది.

యీవిచారమునకు ఫలం బేమి యనిన, అద్వయుండగు పరమాత్మయే ఉపాధివశమున యిన్నివిధముల జెప్పబడినదిగాని ఉపాధుల తోసివేసిన ఆత్మ యొకటేనని తెలియుటేఫలము.

### 4. మరియొకవిధ అష్టతనువులు.

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, ఆత్మ, సూర్యుడు చంద్రుడు యీయెన్మిది అష్టతనువు లనంబడును.

### 5. అష్టతనువుల అధిష్టానదేవతలు.

పృథ్వికి భవుడు, జలమునకు సర్వేశ్వరుడు, అగ్నికి రుద్రుడు,

వాయువునకు భీముడు, ఆకాశమునకు మహాదేవుడు, ఆత్మకు పశుపతి, సూర్యతనువునకు ఉగ్రుడు, చంద్రతనువునకు సోమేశ్వరుడు నధిష్ఠానదేవతలని తెలియవలయు,

### 6. అష్టమదములు.

ధనమదము, విద్యామదము, కులమదము, శీలమదము, రూపమదము, యవ్వనమదము, రాజ్యమదము, తమోమదము ఈ 8 న్ని అష్టమదము లనంబడును.

ధనమద మనగా, నాయంతధనవంతుడు లేడని గర్వించుట.

విద్యామద మనగా, నావంటివిద్వాంసుడు లేడని గర్వించుట.

కులమద మనగా, నేను యెక్కువకులమందు బుట్టినా నని గర్వించుట.

శీలమద మనగా, నావంటిఆచారవంతుడు లేడని గర్వించుట.

రూపమద మనగా, నావంటిసౌందర్యవంతుడులేడని గర్వించుట.

యవ్వనమద మనగా, నావంటిబలవంతుడు లేడని గర్వించుట.

రాజ్యమద మనగా, నాకుసర్వరాజ్యాధిపత్యముగలదనిగర్వించుట.

తమోమద మనగా, నేను స్నానసంధ్యానుష్ఠానపరుడనని గర్వించుట,

### 7. అంతరంగాష్టమదము.

పృధివిమదము, జలమదము, అగ్నిమదము, వాయుమదము, ఆకాశమదము, ఆత్మమదము, సూర్యమదము, చంద్రమదము ఈ 8 న్ని అంతరంగాష్టమదములు.

పృధివిమద మెత్తినప్పుడు స్రక్చందనాదులు గోరును.

జలమద మెత్తినప్పుడు దారాపుత్రాదులజీవనార్థమై ధనముగోరును.

అగ్నిమద మెత్తినప్పుడు స్త్రీసంపర్కము గోరును.

వాయుమద మెత్తినప్పుడు ప్రయాణము గోరును.

ఆకాశమద మెత్తినప్పుడు వాహనాదుల గోరును.

ఆత్మమద మెత్తినప్పుడు శరీరసౌఖ్యము గోరును.

సూర్యమద మెత్తినప్పుడు శత్రుసంహారము గోరును.

చంద్రమద మెత్తినప్పుడు సంశయాపన్ను డగును.

ఈబాహ్యాంతరమదము లన్నియు జ్ఞానంబునకు ప్రతిబంధంబుగాన

వీనిరాకుండాతో శివేళ నిరంతరం బాత్మానాత్మవిచారణము జేయుచుండ వలెనని తెలియుటే ఈవిచారమునకు ఫలము.

౭. అష్టాంగయోగములు.

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి ఈకిన్ని అష్టాంగయోగములనం బడును.

వీనిలో మొదటినాల్గును పూర్వాంగము లనిన్ని, తక్కినవాల్గును వుత్తరాంగములనిన్ని చెప్పబడును.

1. యమము—అహింస, సత్యము, ఆస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము,ఓర్పు,మితభోజనము, సర్వజనప్రియత్వము ఈకిన్ని యమ మనంబడు. అందు,

అహింస—ఈరు, పేను, నల్లి, ఈగ, చీమ లోనగు స్వల్పజంతువులను; క్రూరము లయిన పాములు, తేళ్లు మొదలగు విషజంతువులను; భీకరములయిన శరభములు, సింహములు, యేనుగులు, పులులు, అడవి పందులు మొదలగు మృగములను చంపకుండుటయును; యజ్ఞముల యందు పశువులజంపుట ఈరెండును అహింస యనంబడును.

సత్యము—యున్నసంగతి యున్నట్టుగను, చూచినసంగతి చూచి నట్టుగను, విన్నసంగతి విన్నట్టుగను, తప్పక చెప్పుటయును, లోకనికి సంభవించిన ఆపద దప్పి మేలు గలుగుటకై యాడిన కల్లమాటయును సత్యమే నని చెప్పంబడును.

ఆస్తేయము—యెట్టికష్టకాలమందయినను పరులసొమ్ము నపహరింప మనస్సున దలచక, అపహరింపుమని నోటచెప్పక, చేతముట్టక యుండుటే ఆస్తేయ మనంబడును.

బ్రహ్మచర్యము—స్త్రీసంపర్కంబు మరణించునసుక లేకయైనను ఋతుకాలములయందు నిజభార్యం గలసి తనిబినొందుచునున్న నయినను బ్రహ్మచర్య మనంబడు.

అపరిగ్రహము—ధనధాన్యాదులను దానపూర్వకంబుగా నెవ్వరయిన నిచ్చిన పుచ్చుకొనకుండుటయును, సత్కృతముగా శిష్యు లిచ్చిన యడల పుచ్చుకొనుట ఈరెండును అపరిగ్రహ మనంబడు.

ఓర్పు—మేలు వచ్చినప్పుడు సంతోషమును, కీడు వచ్చినప్పుడు

వ్యథయును లేక సుఖదుఃఖములకు క్షమించుట ఓర్పు యనంబడును.

మితభోజనము—లేదని యవ్వరి నడుగక, ధాదాయె నని చింతింపక, పరులచే రాబడినయెడల వద్దని విసర్జింపక, ఆయాసము లేక యుండునట్లు యుక్తముగా భుజించుట మితభోజన మనంబడును.

సర్వజనప్రియత్వము—వొకరికి తాను వెరువక, తాను వకరిని వెరపింపక సర్వభూతదయగలిగియుండుట సర్వజనప్రియత్వ మనబడు.

2. నియమము—శౌచము, తపస్సు, సంతోషము, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము ఈ5న్ని నియమయోగ మనంబడును.

శౌచము—బాహ్యపరిశుద్ధి, అంతరపరిశుద్ధి ఈరెండును శౌచ మనబడును, వానిలో మృత్తికచేతను, జలముచేతను చేయబడునది. బాహ్య పరిశుద్ధము—కామ క్రోధ లోభ మోహ మద మత్సర దంభములు మొదలయిన దుర్గుణములతోడను, అణప కార్మికాది పంచమలములతోడను కూడక మనస్సు నిర్మలమై యుండుట, అంతరపరిశుద్ధ మని జ్ఞానసంపన్నులయిన పండితులచే జెప్పంబడు.

తపస్సు—శరీరవాఙ్మనస్సులచేత చేయంబడుపుణ్యకర్మ తపస్సనంబడు. నందు దేవబ్రాహ్మణ గురుప్రాజ్ఞులపూజించుటయును, బాహ్యపరిశుద్ధమును, బ్రహ్మచర్యవ్రతమును, అహింసయును గలిగియుండుట శరీర సంబంధమయిన తపస్సు.—వాక్తపస్సు-మనోవేదనగలుగ జేయునదిగాక సత్యమై వినసొంపై మేలుగలుగ జేసెడి మాటలాడుటయును, వేదమూలమంత్రముల పఠించుటయును వాక్యంబంధమైన తపస్సు.—మనోతపస్సు-మనస్సుకు సమాధానమయిన మంచినడవడియును, వాఙ్నియమమును, మనోనిగ్రహమును, మనశ్శుద్ధిగలిగియుండుటయును, మనస్సంబంధమైనతపస్సు.

సంతోషము—శుభాశుభకార్యములను నిలుపక తగినకార్యములయందే జరిపించుచు పేరాశపడక తనకు లభించిన ద్రవ్యముతోడనే తృప్తి బొందుట సంతోష మనంబడును.

స్వాధ్యాయము—వాచికమనియు, ఉపాంశు వనియు, మానసికమనియు త్రివిధముగా జెప్పబడు. వీనితాత్పర్యము. ఏతత్పూర్వమే త్రిసంఖ్యాప్రకరణములో 62-వ సంఖ్యగల త్రివిధాధ్యయనమందు దెలుపబడియున్నది గాన, నిందు దెలుపబడలేదు.

ఈశ్వరప్రణిధానము—జ్ఞానకర్మాంతరింద్రియములనుపూజాపాత్ర

ములుగాను, దశవిధప్రాణములు పనీశ్వరేంద్రుగాను, గంగా యమునా సరస్వత్యాదినామములు గల ఇడ పింగళాదినాడులు అభిషేకాది జలములుగాను, ఆధారాదిషట్కమలములు పుష్పములుగాను, జఠరాగ్నిధూపముగాను, చిత్కళలు దీపములుగాను, బ్రహ్మానందము నైవేద్యముగాను, సూర్యచంద్రమండలజ్యోతు లారతులుగాను, శరీర మనెడి దేవాలయమందలి సహస్రారకమలమనెడి సింహాసనమున శాంతియును, లక్ష్మీదేవితోగూడిన పరబ్రహ్మమగు శ్రీమన్నారాయణదేవుని యెల్లప్పుడుపూజించుచుండుట ఈశ్వరప్రణిధానమని బ్రహ్మవాదులైన పెద్దలు బలుకుదురు.

౩. ఆసనము—వీరాసనము, స్వస్తికాసనము, పద్మాసనము, యోగాసనము, కూర్మాసనము, భద్రాసనము, సిద్ధాసనము ఇవి మొదలైన యెనుబదినాలు గాసనములును ఆసనమనె చెప్పబడును.

వీరాసనము—యెడమతొడలమీద కుడిపాదమును, కుడితొడ యెడమపాదముమీదను జేర్చి శరీరము వంకర లేకుండానిల్పుట వీరాసనం.

స్వస్తికాసనము—జంఘోరువులనడుమ పాదములజొనిపి శరీరము చక్కగా నిక్కించుట.

పద్మాసనము—యెడమతొడమీద కుడిపాదమును, కుడితొడలపైన నెడమపాదము నునిచి వెనుకప్రక్కగా కుడిచేత నెడమతొడమీద నున్న కుడికాలిపెద్దవ్రేలును, యెడమచేత కుడితొడమీద నున్న యెడమకాలిపెద్దవ్రేలును పట్టుకొని రొమ్మున గడ్డముంచి భ్రూమధ్యమున దృష్టి నిలుపుట.

యోగాసనము—హంసదండము మోకాళ్ళక్రింద నుంచుకొని పాదముల నేలపై నిలిపి తొడలనడుమ చేతులు జొనిపి పిక్కలబట్టుకొని ఆత్మావలోకనము జేయుచుండుట.

కూర్మాసనము — ఆధారమునకు వుభయపార్శ్వములయందు రెండుకాళ్ళమడిమలు హత్తించి నిక్కి చక్కగా గూర్చుండుట.

భద్రాసనము — అండములకు క్రిందిప్రక్కలయందు చీలమండల నునిచి మడిమెలరెంటిని రెండు చేతులబట్టి కదలకుండుట.

సిద్ధాసనము—యెడమకాలిమడిమ మూలాధారమందు, కుడికాలిమడిమ లింగస్థానమం దుంచి ఋజుకాయుండై భ్రూమధ్యావలోకనము జేయుచుండుట.

సింహాసనము—అండములక్రింది నెలవులయందు తొడలవెనుక భోగములు సోకునట్లు కుడియడమమడిమెల మార్చియుంచి కుడియెడమ చేతులవ్రేళ్ళను మోకాళ్ళమీద సవ్యంబుగా వెడల్పుగా నుంచి నిక్కి కూర్చుండి నోరుదెరచికొని భ్రూమధ్యమందలి చిద్బిందువునుతిలకించుట.

గృహస్థాశ్రమస్థులు పద్మాసన శిద్ధాసనస్థులైయుండుట యుత్తమమైనను గృహస్థులకు పద్మాసనమును, తక్కిన యాశ్రమస్థులకు శిద్ధాసనము మేలని పెద్దలు బల్కుదురు.

4. ప్రాణాయామ మనగా—ఓంకారము, పంచాక్షరము, అష్టాక్షరము మొదలగు మంత్రములలో నొక్కమంత్రమును నొక్కమాత్రముగా జేసి పూరకమందు నిర్ణయములగు మాత్రలకంటె రెట్టిగా కుంభకమందు నిలిపి రేచకమునందు పూరక మందలి మాత్రలలో సగము నిర్ణయించి సుషుమ్నానాడియందలి వింతలజూడవలయును. మరి, యెడమముక్కున ప్రాణవాయువును పూరించి సుషుమ్నయందు నిల్పి కుడిముక్కున విడిచి మరల కుడిముక్కున పూరించి సుషుమ్నయందు నిల్పి యెడమముక్కున విడుచుచు నీరీతిన యెల్లప్పుడు యథాశక్తిగా జేయుచుండుట.

5. ప్రత్యాహారము—విషయములవలన అనగా, శబ్దస్పర్శరూపరసగంధాదివిషయములవలన శ్రోత్రత్వక్చక్షుజిహ్వాఘ్రాణాదేంద్రియముల మరలించుట.

6. ధ్యానము—సగుణధ్యానము, నిర్గుణధ్యానము యీ 2 న్ని ధ్యాన మనంబడు.

సగుణధ్యానము—హృదయపద్మమందు తటస్థలక్షణ స్వరూపుడయిన విరాట్పురుషుని నిలిపి మనస్సుచేత సమస్తవస్తువులను గల్పించి షోడశోపచారములనుచేసి ధ్యానించుట సగుణధ్యాన మనంబడు.

నిర్గుణధ్యానము—పద్మాసనంబునసుండి శరీరంబునిక్కించి హస్తంబులు తొడలపై నుంచి నేత్రములను మూసి శరీరత్రయమును పదునాలుగింద్రియములును, దశవిధప్రాణంబులును ద్రుశ్యములు. ఆదేహేంద్రియాదులు నేగాను. వీనిని వీక్షించు సాక్షిని. సాక్షిని నేననెడు వృత్తియును ద్రుశ్యమే. గనుక, ఆవృత్తినిజూచు సాక్షిని అని మాయాకల్పితములై విజాతియ్యము లగు యుష్మత్ప్రతీతి ప్రత్యయగోచారాదు లనెడు బహిర్ద్రుశ్యములను, సజాతియ్యము లగు అస్మత్ప్రతీతి ప్రత్యయగోచారాదు

లనెడి యాంతర్దృశ్యములను, ఆదృశ్యములకు సాక్షి ననెడు వృత్తిని నిషేధించుచు సత్యజ్ఞానానందనిర్మలాఖండస్వరూపమై సర్వద్రుక్కగు పరబ్రహ్మము తాననెడు దృఢముగలుగుదాకా యల్లప్పుడు నిర్వికల్ప బ్రహ్మనిష్ట గలిగియుండుటే నిర్గుణధ్యాన మనంబడును.

7. ధారణ—మూలాధారాది షట్కమలములయందు వాని కధిదేవతలైన గణపతి బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివ గురుచరణములను అక్కడక్కడ ధ్యానించునప్పుడు మనస్సునిలుపుటే ధారణయోగ మనంబడును.

8. సమాధి—ప్రత్యగాత్మనైన నేనేపరమాత్మను, పరమాత్మయే ప్రత్యగాత్మనైన నేను అని నిష్టజేయుచుండుట సమాధి యనంబడును.

9. అష్టసిద్ధులు.

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశ్వరత్వము, వశిత్వము యీయెన్మిది అష్టసిద్ధులని చెప్పబడును.

అణిమ యనగా, అణుప్రమాణములైన ప్రాణులయందు పరమాణుప్రమాణుడై యుండుట అణిమ యనంబడు.

మహిమయనగా, బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివ విరాట్పురుషాండములకంటె పెద్దవాడైయుండుట మహిమ యనంబడు.

గరిమయనగా, బ్రహ్మాండములకంటె భారమైయుండుట గరిమ యనంబడు.

లఘిమ యనగా, మేరువంతటి బరువుగలిగియుండి దూదిలేశమువలె తేలికైయుండుట.

ప్రాప్తి యనగా, ఇష్టపదార్థములను లభింపజేసికొనుట ప్రాప్తి యనంబడు.

ప్రాకామ్య మనగా, గగనగమనాదిసిద్ధి ప్రాకామ్య మనంబడు.

ఈశ్వరత్వ మనగా, సూర్య చంద్ర మహేంద్ర ఉపేంద్ర అగ్ని ప్రముఖదేవతులను పనులలో నియమించుట ఈశ్వరత్వ మనంబడు.

వశిత్వ మనగా, సకల జంతువులను వశము జేసుకొనుట.

10. అష్టపాశలక్షణము.

దయయు, జుగుప్సయు, మోహము, భయము, సంశయము, కులము, బలము, శీలము యీయెన్మిది అష్టపాశలక్షణ మనబడును.

యీగుణములువుండినా జ్ఞానమునకు ప్రతిబంధము గాన, విడిచి వర్తించవలయునని తెలియుటేఫలము.

11. ప్రణామోష్టాంగలక్షణము.

ఉదరము, శిరము, దృష్టి, మనస్సు, వచనం, పాదములు, హస్తములు, కర్ణములు యీ8న్ని ప్రణామోష్టాంగలక్షణ మనంబడును.

యీఅష్టాంగములును జేర్చి గురువునకు నమస్కరించవలయు నని తెలియుటేఫలము. 12. అష్టవిధానంద వేదనము.

బ్రహ్మానందము, వాసనానందము, విషయానందము, ముఖ్యానందము, ఆత్మానందము, అద్వయానందము, నిజానందము, విద్యానందము యీ8న్ని అష్టవిధ ఆనందము లనంబడును.

బ్రహ్మానందము—సుషుప్తియందు స్వజాతియ్య విజాతియ్య స్వగత భేదరహితముగా జ్ఞానము వెలుగుచుండుట బ్రహ్మానంద మనంబడును.

నిద్రగడచినక్షణమే వృత్తితోచుట వాసనానంద మనంబడును.

స్రక్చందనాభరణ వసన వనితాది భోగములచే గలిగిన సుఖము విషయానంద మనబడును.

ద్రవ్యాదిసమస్తవస్తువులు లభించినప్పుడు తొలగినప్పుడు సుఖదుఃఖములు లేకయుండుట ముఖ్యానంద మనంబడును.

వనితాదివిషయాభిలాషలయందు తోచు ప్రవృత్తులే ఆత్మానంద మనబడును.

ఆబ్రహ్మము సత్యము. నామరూపాత్మకప్రపంచము అసత్య మని తోచుట అద్వయానంద మనంబడును.

ఆయోగాభ్యాసముచేత మనోలయ మగుట నిజానందమనంబడు.

ఆతత్వమస్యాది వాక్యార్థవిచారణ జనితాపరోక్షజ్ఞానము విద్యానంద మనంబడు.

వాసనానందము, విషయానందము, ఆత్మానందము ఈమూడుదక్క తక్కిన ఐదును మోక్షప్రదంబని తెలియుటే యీవిచారమునకు ఫలము.

13. అష్టవిధగురువులు.

బోధక, వేదక, నిషిద్ధ, కామ్యక, సూచక, వాచక, కారణ, విహిత యీ8న్ని అష్టగురువు లనంబడుదురు.

శాస్త్రశబ్దార్థములు బోధించువాడు బోధకగురు వనంబడును.

తత్వమును దర్శింపజేయువాడు వేదకగురు వనంబడును.

వశ్యాకర్షణాద్యష్టకర్మలచేత ఇహపరలోకములయందు మోదఖేదముల నిచ్చువాడు నిషిద్ధగురు వనంబడు.

పుణ్యకర్మోపదేశములచేత ఇహపరలోక సుఖముల నిచ్చువాడు కామ్యకగురు వనంబడు.

వివేకగుణముచేత శమదమాదిసద్గుణములు గలుగజేయువాడు సూచకగురు వనంబడు.

విషయములయందు వైరాగ్యములు గలిగించిన ఆత్మానురాగప్రదుడు వాచకగురు వనంబడు.

శివజీవైక్యజ్ఞానమును గలుగజేసినవాడు కారణగురు వనంబడు.

సకల సంశయముల నివారించి నిత్యముక్తిని ఘటింపజేయువాడు విహితగురు వనంబడు.

14. ప్రాణాష్టవిధలక్షణము.

తత్వసంఖ్య, శ్వాససంధి, స్వరచిహ్నము, స్థానములు, తత్వవర్ణనములు, ప్రణవము, స్వరసంయుక్తము, గతిలక్షణము యీ8న్ని ప్రాణాష్టవిధము లనంబడును.

యీప్రాణాష్టవిధముతో గూడిన స్వరమే చరాచరాత్మకమయిన ప్రపంచాధార మనియును, సర్వమే స్వాత్మొత్పన్నము వనియును, స్వరమునకు పరమైనది లేదనియును తెలియుటే ఫలము.

15. అష్టవిధదేవసర్గములు.

విబుధులు, పితృదేవతలు, సురాసురులు, గంధర్వాప్సరసలు, యక్షరక్షస్సులు, భూతప్రేతపిశాచంబులు, సిద్ధచారణవిద్యాధరులు, కిన్నరకింపురుషులు ఈ8న్ని అష్టవిధదేవసర్గము లనంబడును.

16. అష్టావధానములు.

చతురంగము, కవిత్వము, వ్రాయుట, చదువుట, గణితము, సంగీతము, యుక్తిజెప్పుట, వాగనిపుణము ఈ8న్ని అష్టావధానము లనంబడును.

ఈఅష్టావధానములు భుక్తిహేతువేగాని, ముక్తిహేతువులుగావని తెలియుటే యిందుకుఫలము.

17. అష్టదళపద్మములు.

పూర్వదళమున పుణ్యముజేయుచింత, ఆగ్నేయదళమున భోజన

చింత, దక్షిణదళమున పాపచింత, నైరుతిదళమున దోషములెన్నుచింత, పశ్చిమదళమున నిద్రించుచింత, వాయువ్యదళమున సంచారచింత, ఉత్తరదళమున ధర్మచింత, ఈశాన్యదళమున వైరాగ్యచింత ఈరీతిఅష్టచింతలు గలిగియుండినది అష్టదళపద్మము.

హృదయమందుండు అష్టదళపద్మముయొక్క మధ్యను హంసదీపాకృతిగా వెలుగుచు గాలిచేఅష్టదళములలో యేయేదళముపై చలించి వ్రాలిన పూర్వోక్తమైన ఆయాచింతలుగలుగుననియును, ఆదీపాకృతియైన జ్యోతి పద్మకర్ణికయందు నిలచియున్నప్పుడు పరమార్థచింతయనియు తెలియుటే ఈవిచారమునకు ఫలము.

18. సిరోస్థితాష్టదిక్పాలకులపట్టణములు.

భ్రూమధ్యమున దేవేంద్రునిపట్టణము, కుడినేత్రమందు అగ్నిదేవునిపట్టణము, కుడిచెవియందు యమధర్మరాజుపట్టణము, కుడిచెవియొక్క పార్శ్వమున నైరుతిపట్టణము, పశ్చిమభాగంబున వరుణునిపట్టణము, దానికిసమీపమున వాయుదేవునిపట్టణము, యడమచెవియందు కుబేరునిపట్టణము, యడమనేత్రమందు యీశానుడైన యీశ్వరునిపట్టణము ఈరీన్ని సిరోస్థితాష్టదిక్పాలకులపట్టణములు.

ఈఅష్టదిక్పాలకులయొక్క పట్టణముల మధ్యను సచ్చిదానందస్వరూపుడగు శ్రీమన్నారాయణస్వామియుండునట్టి వైకుంఠపురంబుండును.

ఈవిచారమునకు ఫల మేమనిన, ఈచెప్పిన అష్టదిక్పాలకులపట్టణములయందు వారివారి సప్తాంగములతో నున్నారని తెలిసి వైకుంఠవాసుడైన నారాయణుని ధ్యానించుటే యీవిచారమునకు ఫలము.

19. మాయాశక్త్యష్టవిధము.

పృథివితన్మాత్ర గంధగుణము, ఉదకతన్మాత్ర రసగుణము, అగ్నితన్మాత్ర రూపగుణము, వాయుతన్మాత్ర స్పర్శగుణము, గగనతన్మాత్ర శబ్దగుణము, మనస్సు, బుద్ధి, అహంకారము ఈ రీన్ని మాయాశక్త్యష్టవిధమనబడును. యిదియే అష్టప్రకృతు లనంబడును. యీచెప్పినయెనిమిదిభేదములచేత మాయాశక్తి ప్రపంచస్వరూపమై యున్నదని తెలియుటే యీవిచారమునకు ఫలము.

20. శోకకారణాష్టకము.

ప్రాణము, అపానము, ఉదానము, వ్యానము, సమానము,

వాక్కు, మనస్సు, బుద్ధి యీ 8 న్ని దుఃఖములకు కారణము లగుటచే శోకకారణాష్టక మన్నబడును.

ఈదుఃఖము అంతఃకరణముతో గూడిన శరీరమునకేకాని ఆత్మకు లేదని తెలియుట యీవిచారమునకు ఫలము.

21. పుర్యష్టకము.

జ్ఞానేంద్రియంబులును, కర్మేంద్రియంబులును, అంతఃకరణచతుష్టయంబును, ప్రాణాదిపంచకంబును, వియదాదిపంచకంబును, కామమును, కర్మంబును, తమస్సు యీ8దియును పుర్యష్టక మనబడును.

22. అష్టతనువులు.

స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము యీ4న్ను జీవసంబంధమైన తనువులు.

విరాడ్రూపశరీరము, హిరణ్యగర్భశరీరము, అవ్యాకృతశరీరము, మూలప్రకృతిశరీరము యీ4న్ను ఈశ్వరసంబంధమైన శరీరములు.

ఈఅన్నియుంగూడి అష్టతనువు లనంబడును. అందు,

స్థూలము—ఇరువైఅయిదుతత్వములతో గూడియుండునది స్థూల మనంబడు.

ఇందు కవస్థ, జాగ్రత, నేత్రములు స్థానము, యుక్తభోగము, క్రియాశక్తి, రాజసగుణము, విశ్వు డభిమాని, అకారముమాత్రుక, ఆత్మ జీవాత్మ.

సూక్ష్మశరీరము — పదియేడుతత్వములతో గూడి యుండునది సూక్ష్మ మనబడును.

ఇందు కవస్థ, స్వప్నము, కంఠస్థానము, ఇచ్ఛాశక్తి, తైజసుం డభిమాని, సాత్వికగుణము, ఉకారము మాత్రుక, స్వేచ్ఛాభోగము, ఆత్మ అంతరాత్మ.

కారణశరీరము—సర్వేంద్రియ వ్యాపార శూన్యమై యుండునది కారణ మనంబడును.

ఇందు కవస్థ, సుషుప్తి, హృదయస్థానము, ప్రాజ్ఞు డభిమాని, ద్రవ్యశక్తి, ఆనందభోగము, తామసగుణము, మకారము మాత్రుక, యిందులవ్యాప కాత్మ పరమాత్మ యీ సాజ్ఞలు గలది కారణాంగము.

మహాకారణశరీరము—పంచబ్రహ్మలు, పంచశక్తులు, పంచకళలు,

పంచకర్తలు, పంచాక్షరములు నీయిరువైయయిదింటితో గూడినది మహా కారణశరీర మనంబడును.

నిందు కవస్థ తూర్యం అభిమాని, ప్రత్యగాత్మ, జ్ఞానశక్తి, శుద్ధసత్వగుణము, మూర్తిస్థానము, పరమానందభోగము, మాత్రుక ఓంకారము, వీటియందు వ్యాపకంబగు నాత్మ నిర్మలాత్మ యీ9ది సౌజ్ఞలు గలది.

ఈశ్వరతనుచతుష్టయము.

విరాట్‌శరీరము—పంచభూతంబులు, చంద్రుడు, సూర్యుడు, ఆత్మ యీ౮దింటితో గూడినది విరాట్‌శరీర మనంబడును.

ఇందుల కవస్థ, వుత్పత్తి, బ్రహ్మ, అభిమాని, క్రియాశక్తి, రాజసహంకారము, సూర్యస్థానము, సర్వకర్తృత్వభోగము, అకారము మాత్రుక వీటితో వ్యాపకంబగునాత్మ భూతాత్మ యీ9ది సౌజ్ఞలుగలది విరాట్‌శరీరము.

హిరణ్యగర్భశరీరము—చతుర్దశాధిదేవతలతోగూడినదిహిరణ్యగర్భశరీర మనంబడు.

ఇందు కవస్థ, స్థితి, విష్ణుం డభిమాని, యిచ్ఛాశక్తి, సాత్వికహంకారము, చంద్రస్థానము, సర్వపాలకత్వభోగము, ఉకారముమాత్రుక యిందుల వ్యాపకంబగు నాత్మ సూత్రాత్మ, నిదియును 9 సౌజ్ఞలు గలది. చతుర్దశాధిదేవతలను పదునాలుగవసంఖ్యలో తెలియజేయబడును.

అవ్యాకృతశరీరము—విరాట్ హిరణ్యగర్భాదులకు కారణమై బైందవస్వరూపంబైనది అవ్యాకృతశరీర మనంబడు.

ఇందు కవస్థ, ప్రళయము, రుద్రుం డభిమాని, ద్రవ్యశక్తి, తామసహంకారము, అగ్నిస్థానము, సర్వసంహారభోగము, మాత్రుక మకారము, వీటితో వ్యాపకంబగు నాత్మ శుద్ధాత్మ ఇదియును 9 సౌజ్ఞలు గలది,

మూలప్రకృతిశరీరము—ఈశ్వరమాయోపాధిశరీరంబులకు సాక్షిరూపంబగునదియ మూలప్రకృతి.

ఇందు కవస్థ, సర్వసాక్షి, ఈశ్వరుం డభిమాని, శుద్ధసాత్వికహంకారము, జ్ఞానశక్తి, బ్రహ్మాండాతీతస్థానము, షడ్గుణైశ్వర్యభోగము, ఓంకారముమాత్రుక ఇందుల వ్యాపకాత్మ మహాత్మ.

23. అష్టతనుచక్రము.

| విషయములు. | జీవతనుచతుష్టయము. | | | | ఈశ్వరతనుచతుష్టయము. | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| తనువులు - | స్థూలము. | సూక్ష్మము. | కారణము. | మహాకారణము. | విరాట్. | హిరణ్యగర్భుడు. | అవ్యాకృతము. | మూలప్రకృతి. |
| అవస్థలు - | జాగ్రత. | స్వప్నము. | సుషుప్తి. | తూర్యము. | వుత్పత్తి. | స్థితి. | లయము. | సర్వసాక్షిత్వము. |
| స్థానములు - | నేత్రములు. | కంఠము. | హృదయం. | మూర్తి. | సూర్యుడు. | చంద్రుడు. | అగ్ని. | బ్రహ్మాండాతీతము. |
| భోగములు - | యుక్తం. | స్వేచ్ఛ. | ఆనందము. | పరమానందము. | సర్వకర్తృత్వము. | సర్వపాలకత్వము. | సర్వసంహారకత్వము. | షడ్గుణైశ్వర్యము. |
| శక్తులు - | క్రియాశక్తి. | యిచ్ఛాశక్తి. | ద్రవ్యశక్తి. | జ్ఞానశక్తి. | క్రియాశక్తి. | యిచ్ఛాశక్తి. | ద్రవ్యశక్తి. | జ్ఞానశక్తి. |
| గుణములు - | రాజసము. | సాత్వికము. | తామసము. | శుద్ధసాత్వికము. | రాజసహంకారము. | సాత్వికాహంకారం. | తామసాహంకారం. | శుద్ధసాత్వికహంకారం. |
| అభిమానులు | విశ్వుడు. | తైజసుడు. | ప్రాజ్ఞుడు. | ప్రత్యగాత్మ. | బ్రహ్మ. | విష్ణు. | రుద్రుడు. | ఈశ్వరుడు. |
| మాత్రుకలు - | అకారము. | ఉకారము. | మకారము. | ఓంకారము. | అకారము. | ఉకారము. | మకారము. | ఓంకారము |
| ఆత్మలు - | జీవాత్మ. | అంతరాత్మ. | పరమాత్మ. | నిర్మలాత్మ. | భూతాత్మ. | సూత్రాత్మ. | శుద్ధాత్మ. | మహాత్మ. |

ఈజీవేశ్వరాద్యష్టశరీరంబులు ద్రుశ్యం బనియును, వీటికి సాక్షిస్వరూపంబగు సచ్చిదానందబ్రహ్మంబు నేనని తెలియుటే యీవిచారమునకు ఫలము.

---

## నవసంఖ్యాప్రకరణము.

---

### 1. నవవిధసంస్కారములు.

జ్ఞాత్రు, జ్ఞాన, జ్ఞేయము, కర్మ, కర్తృ, క్రియలు.భోక్తృ, భోజ్య, భోగము యీతొమ్మిన్ని నవవిధసంస్కారము లనబడును.

జ్ఞాత్రు వనగా తెలివి, జ్ఞానమనగా తెలుసుకొనుట, జ్ఞేయమనగా తెలియబడినది, కర్మ మనగా కార్యము, కర్త యనగా చేయువాడు, క్రియ అనగా చేయుట, భోక్తృఅనగా అనుభవించునతడు, భోజ్యమనగా అనుభవము, భోగ మనగా అనుభవించుట.

### 2. పక్షాంతరనవవిధసంస్కారములు.

ప్రాణపంచకము,జ్ఞానేంద్రియపంచకము,కర్మేంద్రియపంచకము, భూతపంచకము, అంతఃకరణచతుష్టయము,స్థూలశరీరము, త్రివిధకర్మలు, అవస్థాత్రయము, వీనికి కారణమైన అజ్ఞానంబునుం గూడి నవవిధసంస్కారము లనంబడు. దీనికే నవవిధప్రపంచమనియు పేరు,

యీనవవిధసంస్కారములు అహంకారంబునకే కాని, ఆత్మకు లేవని తెలియుటే యీవిచారమునకు ఫలము.

### 3. నవవిధసర్గములు.

ప్రథమసర్గము మహత్తత్త్వము, రెండవసర్గము అహంకారము, మూడవసర్గము పృథివ్యాదిభూతములు, నాలగవసర్గము దశవిధేంద్రియ జననము, ఐదవసర్గము సాత్వికాహంకారమువలన జనితమైన మనోమయ సుమనోగుణము, ఆరవసర్గము జీవులకుఅజ్ఞానముగల్పించుతామసవర్గము, యీ 6 న్ను ఈశ్వరుని లీలార్థంబులైన ప్రాకృతసర్గములు. ఏడవసర్గము సమస్తమైనవృక్షలతాదులు, ఎనిమిదవసర్గము 28 ది భేదములుగల మృగ పక్షిసముదాయము, తొమ్మిదవసర్గము త్రిగుణయుతంబైన మనుష్యజాతి యీమూడున్ను వైకృతసర్గము లనంబడును. అష్టప్రకరణమందు జెప్పిన దేవసర్గముతోకూడా సర్గములు దశవిధము లనబడును.

యీప్రకారము ప్రపంచము తొమ్మిదిభేదములు గలిగియుండునని తెలియుటే యీవిచారమునకు ఫలము.

4. నవవిధభక్తులు.

శ్రవణము, కీర్తనము, స్మరణ, పాదసేవన, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము ఈ9న్ని నవవిధభక్తు లనంబడును.

శ్రవణ మనగా, భగవంతునికథలు వినుట.

కీర్తన మనగా, భగవంతునినామములు దలంచి పాడుచుండుట.

స్మరణమనగా, భగవంతునిసహస్రనామములలో అత్యుత్కృష్టం బైన నారాయణశబ్దము మరువక స్మరించుట.

పాదసేవన యనగా, భగవంతుని ధ్యానించి పాదంబులువొత్తుట.

అర్చన మనగా, భగవంతుని మనస్సున పూజించుట.

వందన మనగా, భగవంతుని ధ్యానించి నమస్కరించుట.

దాస్య మనగా, భగవంతుని దాస్యము సలుపుచుండుట.

సఖ్య మనగా, త్రికరణశుద్ధిగా భగవంతుని ధ్యానించుట.

ఆత్మనివేదన మనగా, భగవంతునికి మనస్సు సమర్పించుట.

యీనవవిధభక్తులుఁ దెలిసి యీతొమ్మిదివిధములను భగవంతుని సేవించుచుండుటే ఫలము.

5. నవరంధ్రబంధనక్రమము.

శ్రోత్రరంధ్రయుగ్మము అంగుష్ఠములను, నేత్రరంధ్రయుగ్మము మధ్యతర్జనులచాతను, నాశికారంధ్రయుగ్మము అనామికలతోను, వక్త్రము కనిష్ఠికలచేతను, పాయుపస్థలు అంఘ్రియుగ్మములచేతను, గురువాజ్ఞప్రకారము మూయుట నవరంధ్రబంధన మనంబడు. యీప్రకారంబు దినదినా భ్యాసంబు జేయుచుండిన సుషుమ్నారంధ్రంబున కెక్కి వాయువు పరమాత్మయందు గలయునని తెలియుటే యీవిచారమునకు ఫలము.

6. అంతఃశత్రునవకము.

దంభము, అభిమానము, హర్షము, క్రోధము, కార్యసౌరంభము, శోకము, మోహము, సుషుప్తి, స్వప్నము యీ9న్ని అంతఃశత్రునవకము.

యీతొమ్మిదింటిలోమూడు మూడుగుణములుగా సత్వరజస్తమో గుణముల సంబంధ మైనవని తెలియవలెను. ఈగుణములు గలిగినప్పుడు శత్రులని యెంచి విడువవలయునని తలంచుటే ఫలము.

7. ప్రణవసౌజ్ఞానవవిధము.

అక్షరత్రయాత్మకంబును, నాదబిందుకళాత్మకంబును, సృష్టిస్థితిలయకారణంబును, గుణత్రయాత్మకంబును, త్రిమూర్త్యాత్మకంబును, శరీరత్రయాత్మకంబును, ఈశ్వరత్రయాత్మకంబును, మంత్రత్రయాత్మకంబును, శక్తిత్రయాత్మకంబును యీ9న్ని ప్రణవసౌజ్ఞానవవిధ మనంబడును.

ఈప్రణవముయొక్క నవవిధములలోనే ప్రపంచ మంతయు నంతర్భూతమని తెలియుటే యీవిచారమునకు ఫలము.

---

దశసంఖ్యా ప్రకరణము.

---

1. దశేంద్రియములు.

శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయు, ఉపస్థ యీ10న్ని దశవిధేంద్రియము లనంబడును.

2. దశవాయువులు.

ప్రాణవాయువు, అపానవాయువు, సమానవాయువు, ఉదానవాయువు, వ్యానవాయువు, నాగవాయువు, కూర్మవాయువు, కృకరవాయువు, దేవదత్తవాయువు, ధనంజయవాయువు యీ10న్ని దశవాయువులు.

ప్రాణవాయువు—ఇంద్రనీలవర్ణము, హృదయస్థానము, విశ్వాసము జేయుటకార్యము, విశిష్టుడు డధిష్ఠానదేవత ఇన్నిటితో గూడియుండునది.

అపానవాయువు—స్థానము గుదము, విశ్వకర్త యధిష్ఠానదేవత, నిశ్వాసము కార్యము, హరితవర్ణము ఇన్నిటితో గూడియుండునది.

సమానవాయువు—నీలవర్ణము, నాభిస్థానము, జయుడధిష్ఠానదేవత, చతుర్విధాన్నముల పచనముజేసి శరీరమునకు పుష్టి బుట్టించునది.

ఉదానవాయువు—లేతమంచుబిందువర్ణము, కంఠస్థానము, వైఖరి పల్కులు బల్కించుట కార్యము, అజు డధిష్ఠానదేవత.

వ్యానవాయువు—గోక్షీరవర్ణము, యల్లశరీరస్థానము, విశ్వయోని యధిష్ఠాన దేవత, ఇంద్రియపుష్టి గలిగించుట కార్యము. [చుట.

నాగవాయువు—పీతవర్ణము, రోమనాళ్ళయందుండి నాళ్లనాడిం

కూర్మవాయువు—శ్వేతవర్ణము, ఉదరలలాటమం దుండి నోరు మూయించుచు తెరిపించుచుండుట.

కృకరవాయువు—అంజనవర్ణము, నాసికాస్థానమందుండి తుమ్మించుట.

దేవదత్తవాయువు—స్ఫటికవర్ణము, కటిస్థానమందుండి హెచ్చరించి మాట్లాడించును.

ధనంజయవాయువు—నీలవర్ణము, బ్రహ్మరంధ్రకర్ణస్థానమందుండి మరణకాలమందు నిర్ఘోషము జేయును.

యీయుపవాయువులును ప్రాణవాయువులలో అంతర్భూతములగనుక, ప్రాణాదిపంచవాయువులకు జెప్పినవే వీనికి అధిదైవతములు.

3. దశవాయుచక్రము.

| వాయువులు | వర్ణములు. | స్థానములు. | అధిదేవతలు. | కర్మలు. |
|---|---|---|---|---|
| ప్రాణ. | ఇంద్రనీలము | హృదయం. | విశిష్టకుడు. | ఉచ్ఛ్వాసము. |
| అపాన. | హరితము. | గుదము. | విశ్వకర్త. | నిశ్వాసము. |
| వ్యాన. | గోక్షీరము. | శరీరమాద్యంతము. | విశ్వయోని. | అన్నంబుజీర్ణంబుజేయుట |
| ఉదాన. | మంచుబిన్దు. | కంఠము | అజుడు. | వైఖరిపలుకులు బలికించుట. |
| సమాన. | నీల. | నాభి. | జయుడు. | సకలనాడులనడిపించుట |
| నాగ. | పీత. | రోమపాద్లు. | విశిష్టకుడు. | సకలనాళ్ళ నాడించుట. |
| కూర్మ. | శ్వేతము. | ఉదరలలాటము. | విశ్వకర్త. | నోరుమూయించుట, తెరపించుట. |
| కృకర. | అంజనము. | నాశికాగం | విశ్వయోని. | తుమ్మించుట. |
| దేవదత్త. | స్ఫటిక. | కటి. | అజుడు. | పలికించుట. |
| ధనంజయ | నీలం. | బ్రహ్మరంధ్రకర్ణములు. | జయుడు. | మరణంబునొందించుట. |

ఈవిచారమునకు ఫలం బేమనిన, ఈదశవాయువులును ఆయా అధిష్టానదేవతలచే ప్రేరేపింపబడి ఈచెప్పినకార్యములు జేయుచుండును గాని, ఆత్మ వకకార్యమైనను జేయదని తెలియవలయునని [illegible]జనాభిప్రాయము.

### 4. దశనాడులు.

ఇడ, పింగళ, సుషుమ్నా, గాంధారి, అస్తిజిహ్వా, పూష, యశస్విని, అలంబుష, లకుహ, శంఖిని యీ10న్ని దశవాయువు లనంబడును.

ఇడకు—చంద్రస్థానము, రుద్రు డధిదేవత.

పింగళకు—సూర్యస్థానము, విష్ణు వధిదేవత.

సుషుమ్నకు—అగ్నిస్థానము, బ్రహ్మ అధిదేవత.

గాంధారికి—2 కుడికన్నుస్థానము, వరుణు డధిదేవత.

అస్తిజిహ్వాకు—యడమనేత్రస్థానము, వరుణు డధిదేవత.

పూషకు—కుడికర్ణస్థానము, దిగ్దేవత లధిదైవములు.

యశస్వినికి—యడమకర్ణస్థానము, పద్యోద్భవుం డధిదేవత.

అలంబుషకు—గుదనాళ్యస్థానము, సూర్యు డధిదేవత.

లకుహాకు—మధ్యనాళస్థానము, భూమి అధిదేవత.

శంఖినికి—నాభిస్థానము, భూమి అధిదేవత.

### 5. దశనాడీచక్రము.

| నాళ్లు. | స్థానములు. | పక్షాంతరస్థానములు. | అధిదేవతలు. |
|---|---|---|---|
| ఇడా. | యడమనాసా బిలము. | చంద్రస్థానము. | రుద్రుడు. |
| పింగళా. | కుడినాసాబిలం. | సూర్యస్థానము. | విష్ణు. |
| సుషుమ్నా. | మధ్యదేశము. | అగ్ని. | బ్రహ్మ. |
| గాంధారి. | వామనేత్రము. | కుడికన్ను. | వరుణుడు. |
| అస్తిజిహ్వా. | కుడినేత్రము. | యడమకన్ను. | వరుణుడు. |
| పూష. | కుడికర్ణము. | కుడికర్ణము. | దిగ్దేవతలు. |
| యశస్విని. | వామకర్ణము. | యడమచెవి. | పద్మోద్భవుడు. |
| అలంబుష. | వక్త్రము. | గుదము. | సూర్యుడు. |
| కుహు. | లింగదేశము. | మధ్యనాళము. | భూమి. |
| శంఖిని. | మూలాధారం | నాభి | భూమి. |

ఈదశనాడులయందు ఏతత్ పూర్వోక్త దశవాయువులు ప్రవహిం

పుచు వానివాని అధిదైవములచే ప్రేరేపింపంబడి సకలకార్యములు జేయు చున్నవని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

6. దశనాదములు.

చిణీనాదము, చిణిచిణీనాదము, ఘంటానాదము, మృదంగనాదము, మేఘనాదము, శంఖనాదము, వీణానాదము, తాళనాదము, వేణునాదము, భేరినాదము యీ10న్ని దశనాదము లనంబడును.

సద్గురుప్రోక్తమైన ముద్రచే కర్ణద్వయంబుమూసి ఈదశనాదంబు లాలకింపుచు తుదకు ఘంటానాదమందు మనంబు లయము జేయవలెనని బుధులు వచింపుచుందురు.

7. దశవిధమండలములు.

వియన్మండలము, తమోమండలము, మేఘమండలము, విద్యున్మండలము, తారామండలము, జ్యోతిర్మండలము, సూర్యమండలము, చంద్రమండలము, వహ్నిమండలము, హిరణ్మయమండలము యీ10న్ని దశవిధమండలము లనంబడును.

ఈదశవిధమండలంబులను ద్విదళాబ్జంబున దృష్టి నిల్పి చూచుచు తుదకు జ్యోతిర్మండలమందు మనంబు లయము గావింపవలె నని విజ్ఞాన సంపన్నులయిన పండితులు భాషింపుచుందురు.

8. దశవిధసిద్ధులు.

చిరజీవత్వము, వాయువేగము, అదృశ్యత్వము, వస్తునిర్మాణము, పరభావత్వము, దూరదృష్టి, నిరాహారత్వము, వాక్యసిద్ధి, దూరశ్రవణము, కామరూపము యీ10న్ని దశవిధసిద్ధు లనంబడును.

చిరజీవత్వ మనగా, దీర్ఘాయువు గలిగియుండుట.

వాయువేగ మనగా, గాలివలె శీఘ్రముగా బోవుట.

అదృశ్యత్వ మనగా, కనుపడకుండా చరించుట.

వస్తునిర్మాణ మనగా, వస్తువులను కల్పన జేయుట.

పరభావత్వ మనగా, ఇతరులమనస్సులోనిసంగతి తెలిసికొనుట.

దూరదృష్టి యనగా, బహుదూరము జూచుట.

నిరాహారత్వ మనగా, అన్నవర్జితుడైయుండుట.

వాక్యసిద్ధి అనగా, అన్నమాట తప్పకుండుట.

దూరశ్రవణ మనగా, బహుదూరపుమాట వినవచ్చుట.

కామరూప మనగా, కోరినరూపము ధరించుట,

ఈసిద్ధులు జ్ఞానమునకు ప్రతిబంధము గనుక, సిద్ధులు గోరకుండ వలయునని సుజ్ఞానులు వచింపుచుందురు.

9. దశావతారములు.

మచ్చావతారము, కూర్మావతారము, వరాహావతారము, నారశింహావతారము, వామనావతారము, పరశురామావతారము, శ్రీరామావతారము, బలరామావతారము, బుద్ధావతారము, కలికావతారము యీ10న్ని దశావతారము లనంబడు.

ఈదశావతారములు సచ్చిదానందస్వరూపుడైన నారాయణునకు లేవనియును, కవీశ్వరులు శారపదంబులచే జన్మకర్మములు గల్పించినారనియును భాగవతపురాణాభిప్రాయము.

10. జ్ఞానదశాచిహ్నములు.

అక్రోధము, ఆరోగ్యము, జితేంద్రియత్వము, దయ, క్షమ, జనప్రియత్వము, అలోభత్వము, దాతృత్వము, అభయము, నైర్మల్యత్వము యీ10న్ని జ్ఞానదశాచిహ్నము లనంబడు.

ఫలము స్పష్టము.

11. దశబలములు.

బుద్ధి, క్షాంతి, వీర్యము, ధ్యానము, జ్ఞానము, కృప, శీలము, బలము, దానము, ఉపేక్ష యీ10న్ని దశబలము లనంబడు. ఫలార్థములు స్పష్టము.

12. భాగవతదశలక్షణము.

సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతులు, మన్వంతరము, ఈశానుచరిత్రము, నిరోధము, ముక్తి, ఆశ్రయము యీ 10న్ని భాగవత దశలక్షణము లనంబడును.

సర్గము—మహదహంకార పంచతన్మాత్ర పంచభూతేంద్రియ ప్రపంచము భగవంతునియందుగనుట

విసర్గము—బ్రహ్మ విరాట్పురుషునియందు జనించి చరాచర భూతసృష్టి జేయుట.

స్థానము—లోకద్రోహు లయిన నరేంద్రుల బరిమార్చి జగము నిల్పినట్టు విజయాకల్పము స్థాన మనంబడును.

ఊతులు—శ్రీహరిజేయు నిజభక్తజనోద్ధరణము పోషణ ఊతులనంబడును.

మన్వంతరము—భగవంతుని అనుగ్రహముచేత సకలలోకపాలనైశ్వర్యమహిమబొందినవారియొక్క ధర్మములు విస్తరించి పలుకుట మన్వంతర మనంబడు.

ఈశానుకథలు—భగవంతుని అవతారకథలు, తదియ్యానువృత్తి, తచ్చారిత్రములు విస్తరించిపలుకుట ఈశానుకథ లనంబడును.

నిరోధము — భగవంతుడు యోగనిద్రాసమేతుడైయున్నవేళ్ళ అఖిలజీవులు నిజవ్యాపారశూన్యులైయుండగా జంగమస్థావరాదిచేష్టాము లెల్లను విదితమగునట్లు బలుకుట నిరోధ మనంబడును. నిదియే అనాంతర ప్రళయ మనియునుం జెప్పబడును.

ముక్తి—జీవుండు భగవత్కృపావశమున అనేకజన్మార్జితపాపములను బోదోలి పిదప కళేబరంబు విడిచి భగవంతునియం దైక్యంబగుట.

ఆశ్రయము—ఉత్పత్తిస్థితిలయంబులు యందున నగుచు ప్రకాశింపబడునో అది ఆశ్రయ మనబడును.

దశమవిద్యర్థంబు నిందు దెలుపలేదు.

ఫలము. చతుశ్శ్లోకరూపంబగు భాగవతప్రశ్నలకు నీదశవిధంబులను వుత్తరంబైయుండునని తెలియుటేఫలము.

13. దశవిధబ్రాహ్మణులు.

ఆంధ్ర, కర్ణాట, ద్రావిడ, ఘూర్జర, మహారాష్ట్రులు, ఉత్కల, మైథుల, గౌడ, కనోజ, సారస్వతి, సార్వర్యులు యీ 10 న్ని దశవిధ బ్రాహ్మణు లనంబడుదురు.

14. దశవిధవైష్ణవులు.

యామునేయులు, కులశేఖరులు, త్రైవర్ణికులు, చాత్తరులు, నంబిళ్లు, నంజియ్యరులు, తళఘులు, గోఘులు, కైవర్తులు, వాచ్ఛాంబిళ్లు ఈ10న్ని దశవిధవైష్ణవు లనంబడుదురు

బ్రాహ్మణులు వైష్ణవం బుచ్చుకొనిన శ్రీవైష్ణవు లనియు, యామునేయు లనియు చెప్పబడుదురు.

క్షత్రియులు వైష్ణవం బుచ్చుకొనిన కులశేఖరు లనంబడుదురు.

కోమట్లు వైష్ణవం బుచ్చుకొనిన త్రైవర్ణికు లనంబడుదురు.

శూద్రులు వైష్ణవం బుచ్చుకొనిన చాత్తాను లనబడుదురు.

శూద్రులలో కాపుకులము వైష్ణవం బుచ్చుకొనిన నంబి ళ్ళనం బడుదురు,

సాలెకులము వైష్ణవం బుచ్చుకొనిన సంజియ్యారు లనంబడుదురు.

వందిమాగధులనె భట్రాజులు వైష్ణవం బుచ్చుకొనిన తళఘులని చెప్పబడుదురు.

ముతరాచలు వైష్ణవం బుచ్చుకొనిన గౌణులని చెప్పబడుదురు.

వడ్డెరలు వైష్ణవం బుచ్చుకొనిన కైవర్తులని చెప్పబడుదురు,

ఇతరమైన బోయ మంగల గొల్ల కుమ్మర్లు మొదలైనవారు వైష్ణవం బుచ్చుకొనుట వాచ్ఛాంబి ళ్ళనంబడుదురు.

పశ్చాంతరమున తిరుపణ్యులను పెరియసంబంధులనుగూడి పంద్రెండువిధ వైష్ణవు లనంబడుదురు.

తిరుపణ్య లనగా, వైష్ణవం బుచ్చుకొనిన పంచములు,

పెరియసంబంధు లనగా, వైష్ణవం బుచ్చుకొనిన పష్టములు, చర్మకారకులు మొదలగు నీచులు.

ఇందుకు పూర్వాచార్యులవారు ఆనతిచ్చిన దేమనగా, యీపంద్రెండువిధము లయిన వైష్ణవులలో ప్రాకృతమున తిరుపణ్య పెరియ లనే యిద్దరు వైష్ణవులుదక్క తక్కినపదుగురు వైష్ణవులకును జ్ఞానభక్తివైరాగ్యములు యమనియమాద్యష్టాంగములు యేకమై గురుపుత్రు లయినందున భ్రమరకీటన్యాయముగా వక్కటేకుల మని యాళ్వారాదు లానతిచ్చియున్నారు.

యేకులమైనను కులములతో ప్రయోజనము లేదనియును, యెవరు జ్ఞానవంతులయియున్నారో వారలే కులశ్రేష్టులని తెలియుట యీవిచారమునకు ఫలము.

---

## ఏకాదశసంఖ్యాప్రకరణము.

---

### 1. ఏకాదశేంద్రియములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనస్సు 1 ఈ 11 న్ను ఏకాదశేంద్రియము లనబడును.

## ద్వాదశసంఖ్యాప్రకరణము.

### 1. ఆత్మద్వాదశలక్షణము.

షడ్భావవికారరహితుడున్ను, నిత్యుడున్ను, క్షయరహితుడున్ను, శుద్ధుండు, క్షేత్రజ్ఞుడు, గగనాదులకు నాశ్రయుండు, క్రియాశూన్యుండు, స్వప్రకాశుండు, సృష్టిహేతువు, వ్యాపకుండు, నిస్సంగుండు, పరిపూర్ణుండొక్క డని వివేకసమర్థంబులగు నాత్మలక్షణములు పండ్రెండని యెరుంగుటే యీవిచారమునకు ఫలము.

### 2. ద్వాదశాంగుళన్యూనప్రత్యేకఫలము.

శరీర మను పట్టణమును వాయు వనేరాజుచే పాలింపబడుచుండు. నట్టిదేహములోనుంచి శ్వాసము దశాంగుళములు లోపలికిప్రవేశించును. ద్వాదశాంగుళములు నిర్గమించును. అందు శ్వాసము 1 అంగుళముతగ్గిన నిష్కామత్వమును, 2 అంగుళములుతగ్గిన ఆనందమును, 3 అంగుళములు తగ్గిన యేనుగ కున్నంత బలమును, 4 అంగుళములు తగ్గిన వాక్యసిద్ధియు, 5 అంగుళములు తగ్గిన దూరదృష్టిత్వము, 6 అంగుళములు తగ్గిన ఆకాశగమనము, 7 అంగుళములుతగ్గిన చండవేగమును, 8 అంగుళములు తగ్గిన అష్టసిద్ధులును, 9 అంగుళములు తగ్గిన నవనిధులును, 10 అంగుళములు తగ్గిన దశమూర్తిత్వమును, 11 అంగుళములుతగ్గిన దశావతారత్వమును 12 అంగుళములు తగ్గిన గంగామృతరసపానంబును గలుగు నని తెలిసి యోగాభ్యాసము జేయవలయు నని తాత్పర్యము.

---

## త్రయోదశసంఖ్యాప్రకరణము.

### 1. త్రయోదశేంద్రియములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనోబుద్ధ్యహంకారములు 3 యీ13న్ని త్రయోదశగుణము లనంబడును.

### 2. రాగద్వేషాదిత్రయోదశదుర్గుణములు.

రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము, దర్పము, అహంకారము యీ13న్ని రాగద్వేషాదిత్రయోదశదుర్గుణము లనంబడును.

రాగ మనగా, స్త్రీలయందుండెడి యాసక్తి. దీనివలన శునక జన్మము వచ్చును.

ద్వేష మనగా, వొకం డపకృతిజేసిన మళ్ళీ ప్రతిక్రియ జేయదలంచుట. దీనివలన పాముజన్మము వచ్చును.

కామ మనగా, గృహారామక్షేత్ర ధనధాన్యాదులను సంపాదింపవలె ననెడు చిత్తవృత్తి. దీనివలన పిల్లిజన్మము వచ్చును.

క్రోధ మనగా, తాను సంపాదించినట్టి పదార్థములకు నెవడు విఘ్నముజేయునో నట్టివానియందు దుర్గ్రముగ గ్గెడు చిత్తవృత్తి. దీనకోడియై పుట్టును,

లోభ మనగా, తాను ఆర్జించిన పదార్థములను శెలవుసేయకూడ దనె చిత్తవృత్తి. దీనివలన ఈగయై పుట్టును.

మోహ మనగా, అజ్ఞానస్వరూపమైన భ్రమగలిగియుండుట. దీని వలన కప్పయై పుట్టును.

మద మనగా, సకలసంపదలు గలిగిన నేను నేమిజేసినాచెల్లునని దోచెడు చిత్తవృత్తి. దీనివలన వరాహంబై పుట్టును.

మాత్సర్య మనగా, వొకడు తనకంటె నధికుడై యుండెనేని వాని వుత్కర్షము సహింపనోపనిచిత్తవృత్తి. దీన నక్కజన్మము వచ్చును.

ఈర్ష్య అనగా, దుఃఖము పరులకురాక తనకురావచ్చునాయనెడు చిత్తవృత్తి. ఇందువలన కోతియై పుట్టును.

అసూయ యనగా, మనవలెనే పరులుసుఖముగా నుండవచ్చునా యనెడు చిత్తవృత్తి. దీనివలన పెద్దపులియై పుట్టును.

దంభ మనగా, తానొనర్చినధర్మము నలుగు రెరిగి మెచ్చవలెనని తోచెడుచిత్తవృత్తి. ఇదిగలిగియుండిన మహిమజన్మ మెత్తునని యెరింగేది.

దర్ప మనగా, తాను దొడ్డవాడననియును, నితరు లెవరును తనకు సరిరా రనియును తోచెడు చిత్తవృత్తి. దీనివలన సాళువ మను పక్షియై పుట్టును.

అహంకార మనగా, ఓరీ నిన్ను శిక్షించెవాడ నని యెరుగవా? నేను పట్టినకార్యము విడుచునట్టివాడను గానని, పరులను బెదరించెడు చిత్తవృత్తి, దీనివలన రాక్షసుడై జనించును.

ఈచెప్పిన 13 గుణములలో యేగుణము గలిగియుండినను నరక

విముక్తి లేదనియును, అథవా బహుకాలంబునకు నరకవిముక్తి గలిగిన ఆయాగుణానుకూలజన్మము లెత్తుచురని బుధులు వచింపుచుందురు.

---

## చతుర్దశసంఖ్యాప్రకరణము.

---

### 1. చతుర్దశకరణములు.

శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయు, ఉపస్థ, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఈ 14న్ను చతుర్దశకరణము లనంబడును.

### 2. చతుర్దశాధిదేవతలు.

దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు అశ్వినులు, వహ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, చతురాననుడు, చంద్రుడు, బ్రహ్మ, జీవుడు, శివుడు యీ14న్ను చతుర్దశాధిదేవత లనంబడుదురు.

### 3. చతుర్దశకర్మములు.

శబ్దమువినట, శీతాదులనెరుంగుట, చూచుట, రుచిగొనుట, ఆఘ్రాణించుట, పలుకుట, పనులుజేయుట, నడుచుట మలమూత్రవిసర్జనం బొనరించుట, ఆనందించుట, చలించుట, నిశ్చయించుట, చింతించుట, అభిమానపడుట యీ14న్ను చతుర్దశకర్మ లనంబడును.

ఆత్మ సాన్నిధ్యమందుండి మొదటిచతుర్దశకరణములు, చతుర్దశాధిదేవతలచేత ప్రేరేపింపంబడినవై చతుర్దశకర్మంబులను జేయుచున్నవి గాని, ఆత్మ యొక్కకార్యంబును చేయలేదని వేదాంతసిద్ధాంతము.

### 4. చతుర్దశమహావిద్యలు.

తపస్సు, జ్ఞానము, వేదము, గణితము, శబ్దశాస్త్రము, ధనుర్విద్య, మహేంద్రకము, భరతము, సూపశాస్త్రము, జ్యోతిషము, శిల్పము, వైద్యము, చందస్సు, మాలినీశాస్త్రము యీ14న్ను చతుర్దశమహావిద్య లనంబడు

తప స్సనగా, యమనియమాదితపస్సు.

జ్ఞాన మనగా, ఆత్మానాత్మవివేకము.

గణిత మనగా, లీలావతిగణితము మొదలగున లెక్కలు

శబ్దశాస్త్ర మనగా, వ్యాకరణాదిశాస్త్రములు.

ధనుర్విద్య యనగా, అస్త్రవిద్య.
మహేంద్రక మనగా, ఇంద్రజాలాదిటక్కరివిద్య.
వేద మనగా, చతుర్వేదములు.
భరత మనగా, వాద్యభేదములు.
జ్యోతిష మనగా, జాతకాదుల కుపయోగమగు విద్య.
సూపశాస్త్రమనగా, భక్ష్యాదులు వండుట కుపయోగమైనవిద్య.
శిల్ప మనగా, విగ్రహాదులుజేయుట కుచితమైన విద్య.
వైద్య మనగా, ఆయుర్వేదము.
ఛందస్సు అనగా, కవితాదుల కుపయోగమైన విద్య.
మాలినీశాస్త్ర మనగా, వాదులు నడుపునట్టి విద్య.
ఈవిచారమునకు ఫలం బేమనిన, మొదటి తపో జ్ఞానములుదక్క తక్కినవిద్య లన్నియు ప్రతిష్ఠకును, భుక్తికిని హేతువైనవేశాని, ముక్తి హేతు వయినవిగావని తెలియుటే యీవిచారమునకు ఫలము.

## 5. చతుర్దశభువనాత్మకవిరాడ్రూపము.

అతలము పాదములు, వితలము చీలమడిమెలు, సుతలము జంఘలు, రసాతలము జానువులు, మహాతలము వూరువులు, తలాతలము కటిస్థలము, పాతాళము నాభ్యధోభాగము, భూలోకము నాభి, భువర్లోకము జఠరము, స్వర్లోకము వక్షము, మహర్లోకము కంఠము, జనలోకము ముఖము, తపోలోకము భ్రూమధ్యము, సత్యలోకము శిరస్సు ఈ 14న్ను చతుర్దశభువనాత్మకంబయిన విరాడ్రూప మనంబడును.

ఇందులో అతలాదిపాతాళమువరకు గల 7 లోకములున్ను విరాట్పురుషుని అధోంగము లనియును, తక్కిన 7 పూర్వఅంగము లనియును చెప్పబడు. మరియు, ఆవిరాట్పురుషునకు భూమి పాదములు, స్వర్గము శిరస్సు, ఆకాశము నాభి, సూర్యచంద్రులు నేత్రములు, దిక్కులు కర్ణములు, అగ్నిహోత్రుడు ముఖము, వాయువు ప్రాణములు, శైలములు యెముకలు, నదులు నరములు, సముద్రములు త్రిసంధ్యలు, వస్త్రములు భూమి జలాగ్నిపవనాకాశప్రకృతులు క్రమముగా ఆధారాది షట్చక్రంబులుగా గలిగి విశ్వరూపుడై ప్రకాశించుచుననియును చెప్పబడును.

## పంచదశసంఖ్యాప్రకరణము.

---

### 1. పంచదశయోగాంగములు.

యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసామ్యము, దృక్స్థితియు, ప్రాణాయామము, ప్రత్యాహారము. ధ్యానము, ధారణయు, సమాధి యీ 15న్ను పంచదశయోగాంగము లనంబడును.

యమము—పంచభూతములు, సర్వేంద్రియములు, ప్రాణమనోబుద్ధిచిత్తాహంకారములు మొదలైన బాహ్యాంతరముల గనుపడు. దృశ్యమంతయు దృక్స్వరూపముగా జూచుచు ఆదృగాత్మక బ్రహ్మము నేనని యెల్లప్పుడు భావించుచుండుట యమయోగ మనంబడు.

నియమము—సకల కర్మములు జేయుచు నుండు సమయములో యీసర్వేంద్రియములు ఇంద్రియార్థము లందు వర్తించుచున్నవి. వీటి కన్నిటికిని సాక్షిని. గుణజాతిరూపనామరహితుడ. సచ్చిదానందస్వరూపుడనని తనను తాజూచుచు నీయఖండనియమంబు దప్పకుండుట నియమయోగ మని చెప్పంబడును.

త్యాగము—ప్రత్యగాత్మస్వరూపుండై ప్రకాశించు తనకు ఇతరమైన దేహేంద్రియాది దృశ్యమంతయు లేదని విడుచుట త్యాగ మనంబడు.

మౌనము—పలుకుల కందక భావాతీత మైన బ్రహ్మము తానై పలుమారుబలుకక పలికినప్పటికిని నేను బలికినా నని తెలియక సంకల్పవికల్పములులేక ఆనందరసపానంబు జేయుచుండుట మౌనయోగ మనంబడు.

దేశము—యేదేశము పరమపవిత్రమై ప్రకాశించుచున్నదో యేదేశమున మానసేంద్రియ అహంకారదుఃఖములు గనుపింపక నిరుపద్రవమై నిరతిశయసుఖకరమైయుండునో ఆదేశము ఏకాంతదేశ మనంబడును. అట్టి సుపవిత్రదేశంబునందు నివాసియైనవానికి నిరతిశయసుఖము గలుగునని భావము.

కాలము—కాలముల నన్నిటిని గల్పించి అన్నికాలములు వక్క రీతిగా వెలుగుచు కాలనియమములేక సమస్తకాలములను మ్రింగియుండు

నది కాల మనంబడు. అట్టికాలమును యోగి యైనవాడు ద్రిమ్మింగి ప్రకాశిం చుచునని భావము.

ఆసనము—కాయక్లేశము, అలసట, జాడ్యనిందలు, ఆయాసము యెట్టియునికిచేత గలుగకుండునో యట్టియునికి సుఖాసన మనంబడు. ఇదియే అకల్పితమై సమస్తసిద్ధుల కాలయమైన సిద్ధాసనము.

మూలబంధము—బంధముల కన్నిటికిన్ని, మూలబంధముల కన్నిటి కిని మూలబంధము ప్రకృతి. అట్టిప్రకృతి యెద్దిగనిన బాయునో అఖిల తత్త్వములకును ఆదిమూలబంధము ప్రకృతి. అట్టిప్రకృతి యెద్దిగనిన బాయు నో అఖిలతత్త్వములకును ఆదిమూల మెద్దియో నదియే మూలబంధమనం బడు.

దేహసామ్యము—యేరు లన్నియు బోయి సముద్రములో గలసి నట్లుగా సమస్తేంద్రియములును, సచ్చిదానందంబునుం జేరి సమభావమై యుండుట దేహసామ్య మనంబడు.

దృక్స్థితి — లోచూపు వెలిచూపు మొదలయిన చూపులలో శాంభవీదృష్టిశ్రేష్టము. గనుక, ఆచూపుచే ప్రాణమనోబుద్ధులు మొద లయిన సమస్తప్రపంచము దృశ్యముగానిది దృక్కు. అదియే తా నని యుండుట దృక్స్థితి యనంబడును.

ప్రాణాయామము—బాహ్యాంతరముల గనుపడు దృశ్యమంతయు రేచించి సచ్చిదానందమును మనస్సున పూరించి అట్టిమనస్సు యల్లప్పుడు కుంభించుట ప్రాణాయామ మనంబడు.

ప్రత్యాహారము—సమస్తవిషయములకు బోధస్వరూపు డయిన పరమాత్మునిగా నెల్లప్పుడు దలంచుచుండుట ప్రత్యాహార మనంబడు.

ధ్యానము— దేహేంద్రియ ప్రాణాదిదృశ్యము నేను గానని దృ క్స్వరూపునిగా దెలిసి చింతింపుచుండుట ధ్యానయోగ మనంబడు.

ధారణ—మనస్సునకు యేయేవస్తువులుగనుపించునో ఆయావస్తువు లన్నియు పరమాత్మయని తలంచుచుండుట ధారణ యనంబడు.

సమాధి—సర్వావస్థలయందును గనుపడు సర్వంబును బ్రహ్మమే నని సంకల్పరహితుడైయుండుట సమాధి యనంబడు.

యీపంచదశయోగాంగములను గురుముఖముగా నెరిగి నిరంతరం బభ్యసింపుచుండిన బ్రహ్మవిద్వరిష్టుండగునని బుధోత్తములచే జెప్పంబడు.

## షోడశసంఖ్యాప్రకరణము.

### 1. షోడశవికారములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనోబుద్ధిఅహంకారములు 3, రజస్సత్వతమోగుణములు 3 ఈ16న్ను షోడశవికారము లనంబడు.

### 2. మరియొక షోడశవికారములు.

జ్ఞానకర్మేంద్రియములు 10, శబ్దాదివిషయములు 5, మనస్సు 1 యీ16న్ను షోడశవికారము లనంబడును.

### 3. మరియొక షోడశవికారములు.

జ్ఞానకర్మేంద్రియములు 10, పృథివ్యాదిభూతములు 5, మనస్సు 1 యీ16న్ను షోడశవికారము లనంబడు.

ఆత్మకు కాలత్రయంబునందును, నీషోడశవికారంబులు లేవని బుధులు వచింపుచుందురు.

## సప్తదశసంఖ్యాప్రకరణము.

### 1. సప్తదశలింగభౌతికము.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, ప్రాణాదివాయువులు 5, చిత్తంబుతో గూడిన మనస్సు 1, బుద్ధితో గూడిన అహంకారము 1 యీ17న్ను సప్తదశలింగభౌతికము లనంబడును.

ఇదియే లింగభౌతికము లనంబడును.

ఇదియే లింగశరీరమనియును, సూక్ష్మశరీరమనియునుం జెప్పబడును.

ఆత్మకు విపాధియైన యీసూక్ష్మశరీరముచేతనే స్థూలశరీరద్వారా సమస్తకర్మలు జేయబడుచున్నవి గాని, ఆత్మ యొకకార్యంబునుం జేయదని తెలియుటే యీవిచారమునకు ఫలము.

## అష్టాదశసంఖ్యాప్రకరణము.

### 1. అష్టాదశపురాణములు.

బ్రహ్మము, పద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, కూర్మము,

మార్కండేయము, భవిష్యోత్తరము, నారదియ్యము, ఆగ్నేయము, బ్రహ్మకైవర్తము, లైంగ్యము, వారాహము, స్కాందము, గారుడము, వామనము, మత్స్యము, బ్రహ్మాండము ఈ 18న్ని అష్టాదశపురాణములు.

యీవిచారమునకు ఫలం బేమనిన, ఇవి మొదలైన సమస్తపురాణములయందు జ్ఞానంబు స్వల్పమై కర్మము బలిష్టమైయున్నదిగాన, కేవలం బగు జ్ఞానశాస్త్రములనే అభ్యసింపవలెనని బుధజనాభిప్రాయము.

---

## ఏకోనవింశతిప్రకరణము.

---

### 1. ఏకోనవింశతితత్త్వాత్మశరీరము.

జ్ఞానకర్మేంద్రియములు 10, ప్రాణాదివాయువులు 5, మనోబుద్ధిచిత్తఅహంకారములు 4 యీ19న్ని ఏకోనవింశతితత్త్వాత్మక సూక్ష్మశరీరమని కొందరిమతము.

---

## వింశతిసంఖ్యాప్రకరణము.

---

అమానిత్వము అనగా, అభిమానము లేకయుండుట.

అదంభిత్వము అనగా, దంభము లేకయుండుట.

అహింస అనగా, హింస జేయకుండుట.

ఆర్జవము అనగా, ఋజుత్వము.

ఆచార్యోపాసన యనగా, గురుసేవ జేయుట.

శౌచ మనగా, శుచిత్వము.

స్థైర్య మనగా, ఆసనజయము గలిగియుండుట.

ఆత్మవినిగ్రహ మనగా, మనోనిగ్రహము గలిగియుండుట.

ఇంద్రియార్థవైరాగ్య మనగా, సుఖములు గోరకుండుట.

అహంకార మనగా, అహంకారము లేకయుండుట.

జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శన మనగా, వీని నన్నింటిని దెలియుట.

పుత్రదారగృహాద్యనాసక్తి అనగా, భార్యాపిల్లలయందును గృహాదులందును అపేక్ష లేకయుండుట.

అనభిష్వంగ మనగా, సంగరహితుడౌట.
ఇష్టానిష్టోపపత్తి యనగా, ఇష్టానిష్టముల నెంచకుండుట.
వాసుదేవేతరము లేదనెభక్తి.
వివిక్తదేశసేవిత్వ మనగా, రహస్యస్థలమందు వాసముజేయుట.
జనసంగవర్జన మనగా, జనులతో గూడకుండుట.
క్షాంతి యనగా, ఓర్పుగలిగియుండుట.
అధ్యాత్మజ్ఞాననిత్యత్వ మనగా, ఆత్మజ్ఞానము సత్యమనుట.
తత్వజ్ఞానార్థదర్శన మనగా, ఆత్మావలోకనము జేయుచుండుట.

---

ఏకవింశతిసంఖ్యాప్రకరణము.

---

1. భగవంతుని ఏకవింశత్యవతారములు.

బ్రహ్మణ్యావతారము, యజ్ఞవరాహావతారము, నారదావతారము, నారాయణావతారము, కపిలావతారము, దత్తావతారము, యజ్ఞావతారము, వురుక్రమావతారము, పృథుచక్రవర్త్యావతారము, మీనావతారము, కూర్మావతారము, ధన్వంతర్యావతారము, మోహిన్యవతారము, నరసింహావతారము, వామనావతారము, పరశురామావతారము, వ్యాసావతారము, శ్రీరామావతారము, రామకృష్ణావతారము బుద్ధావతారము, కలికావతారము యీ౨౧న్ని భగవంతుని ఏకవింశత్యవతారము లనంబడును.

వీనికిని దశావతారములకు జెప్పిన ఫలమే నని యెరింగేది.

---

చతుర్వింశతిసంఖ్యాప్రకరణము.

---

1. చతుర్వింశతిగురువులు.

భూమి, వాయువ, ఆకాశము, జలము, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, కపోతము, అజగరము, సముద్రము, శలభము, భృంగము, స్తంబేరమము, సరఘయు, హరిణము, జలచరము, పింగళయు, గరరము, కుమారిక, శరకారుడు, దందశూకము, పూర్ణనాభి, గణుంమురు, గురరండిభము యీ౨౪న్ను చతుర్వింశతిగురువు లనంబడు,

భూమివలన సైరణయు, వాయువవలన వరోపకారంబును, ఆకాశంబువలన కాలసృష్టిగుణసాంగత్యంబును, ఉదకంబువలన నిత్యశుచిత్వంబును, అగ్నివలన నిర్మలత్వంబును, నిశాకరప్రభాకరులవలన నధికాల్పసమత్వాజీవగ్రహణమోక్షంబులును, పావురమువలన కళత్రపుత్రమోహంబును, కొండచిలువవలన స్వేచ్ఛాసమాగతాహారంబును, సముద్రంబువలన నుత్సాహశోషణంబులును, మిడతవలన శక్త్యానుకూలకర్మాచరణంబును, తుమ్మెదవలన సారమాత్రగ్రహణ్యావిశేషంబును, యేనుగవలన గాంతావైముఖ్యంబును, తేనెటీగవలన నిరంతరసారసంగ్రహణంబు, హారిణంబువలన జింతాపరత్వంబును, మీనమువలన జిహ్వాచాపల్యంబును, కోతివలన యధాలాభసంతుష్టియును, పెన్నెడపులుగువలన మోహపరిత్యాగంబును, వకచిన్నదానివలన సంగత్యాగంబును, శరకారుడు కంసాలవానివల్ల లేక వేటకానివల్ల తదేకనిష్టయు, పాముచలన పరగృహనివాసంబును, సాలెపురుగువలన సంసారపరిత్యాగంబును, తేలువలన లక్ష్యగతజ్ఞానంబును, కురరండిభమువలన నిశ్చలతత్వజ్ఞానంబును సంపాదింపవలయు.

యీ24గింటియొక్క గుణములు దెలిసి తత్ప్రకారము యోగులైనవారు వర్తింతురని తెలియుటే యీవిచారమునకు ఫలము.

## 2. చతుర్వింశతితత్వములు.

భూమ్యాదిభూతములు 5, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, శబ్దాదివిషయములు 5, అంతఃకరణములు 4 యీ24న్ను చతుర్వింశతితత్వములు.

### మతాంతరచతుర్వింశతితత్వములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, శబ్దాదివిషయములు 5, ప్రాణాదివాయువులు 5, అంతఃకరణములు 4 యీ 24 న్ను చతుర్వింశతితత్వములు అనంబడు. ఇదియే స్థూలశరీరమని తెలియవలయు.

యీచతుర్వింశతితత్వములను శరీరత్రయమనియును, క్షేత్రమనియును, క్షరమనియును, ప్రకృతి అనియును, అనాత్మయనియును, దృశ్యమనియును, పంచకోశంబులనియును, అసత్తనియును, జడమనియును, దుఃఖాత్మకమనియును, సంసారమనియును తెలియుటే యీవిచారమునకు ఫలము.

1. పంచవింశతితత్త్వములు.

పూర్వోక్తచతుర్వింశతితత్త్వములు జీవునితో గూడి పంచవింశతితత్త్వము లనంబడు. 1. షడ్వింశతితత్త్వములు.

ఈపంచవింశతితత్త్వములు ఈశ్వరునితో గూడి షడ్వింశతితత్త్వము లనంబడును. 1. సప్తవింశతితత్త్వములు.

ఈషడ్వింశతితత్త్వములు పరమాత్మతో గూడి సప్తవింశతితత్త్వము లనంబడును.

---

ద్వాత్రింశతిసంఖ్యాప్రకరణము.

---

1. సత్యాదిసద్గుణద్వాత్రింశతి

సత్యము, దయయు, నుపవాసాదితపంబును, శౌచంబును, సైరణయు, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియజయంబును హింసలేమియు, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచితజపంబును, సంతోషంబును, మార్దవంబును, సమదర్శనంబును, మహాజనసేవయు, గ్రామ్యంబులయిన కోరికలు మానియుండుటయు, నిష్ఫలక్రియలువిడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబుగాని తన్ను వెదకికొనుటయు, సన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుటయు, ప్రాణులు యందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధిజేయుటయు, శ్రీనారాయణచరణస్మరణయు, తన్నామకీర్తనము, తత్కథాశ్రవణము, తత్సేవయు, తదర్చనము, తన్నమస్కారము, తద్దాస్యము, తదాత్మసమర్పణము, తత్సఖ్యము యీ 32న్ని సత్యాదిసద్గుణద్వాత్రింశతి యనంబడును.

సకల వర్ణంబుల జనులకును యీద్వాత్రింశతి లక్షణములు గలిగి యుండిన మోక్షంబని బుధోత్తములచే జెప్పంబడు.

---

షట్త్రింశతిసంఖ్యాప్రకరణము.

---

1. షట్త్రింశతితత్త్వములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, ప్రాణాదివాయువులు 5, శబ్దాదివిషయములు 5, అంతఃకరణములు 4, దేహములు 3, అవ

స్థలు 3, అజ్ఞానము 1, అపంచీకృతభూతములు 5, యీ36న్ను షట్ త్రింశతితత్వము లనంబడును.

---

షణ్ణవతిసంఖ్యాప్రకరణము.

---

1. షణ్ణవతితత్వములు.

జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, ప్రాణాదివాయువులు 5, శబ్దాదివిషయములు 5, మానసాదికరణములు 4, స్థూలాదిదేహములు 3, జాగ్రదాద్యవస్థలు 3, అపంచీకృతభూతములు 5, అజ్ఞానము 1, త్వగాదిషట్కోశికములు 6, క్షుధాదిషడూర్మలు 6, కామాది అరిషడ్వర్గములు 6, విశ్వాదిజీవులు 3, సత్వాదిగుణములు 3, పుణ్యాదికర్మలు 3, వచన దాన గమన విసర్జనానందములు 5, సంకల్పాధ్యవసాయాభిమాన అవధారణలు 4, రక్తశ్వేతపీతకృష్ణవర్ణములు 4, దిగ్వాయుసూర్యాద్యధిదైవములు 14, ఇన్నియుంగూడి అనగా, యీ96న్ను షణ్ణవతితత్వము లనంబడు.

దీనికిని చతుర్వింశతితత్వములకు జెప్పబడిన ఫలమేనని యూహింపవలయు.

గద్య.

ఇది శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ వర
ప్రసాదలబ్ధ కవితా విలాస సండడి నాగదాస ప్రణీతంబైన
సకల తత్వార్థ దర్పణ మను వేదాంతశాస్త్రంబు
నందు షష్ఠ, సప్తాష్ట, నవ, దశ, ఏకాదశ,
ద్వాదశ, త్రయోదశ, చతుర్దశ,
పంచదశ, షోడశ, సప్తదశ, అష్టాదశ,
ఏకోనవింశతి, ఏకవింశతి, చతుర్వింశతి, పంచ
వింశతి, షడ్వింశతి, సప్తవింశతి, ద్వాత్రింశతి, షట్త్రిం
శతి, షణ్ణవతిసంఖ్యాప్రకరణంబులుఁ గల
ద్వితీయనిరుక్తము సంపూర్ణము.

శ్రీ రస్తు.

అస్మద్గురుభ్యోన్నమః.

శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరబ్రహ్మణేనమః.

# సకలతత్త్వార్థదర్పణము.

## తృతీయ నిరుక్తము.

---

## సంఖ్యారహితశబ్దప్రకరణము.

---

### 1. ఆత్మానాత్మవివేకము.

ఆత్మ యనగా, శరీరత్రయవిలక్షణుడై అవస్థాత్రయసాక్షియై పంచకోశవ్యతిరిక్తుడై సచ్చిదానందస్వరూపుడైయుండునట్టివాడాత్మయనంబడు.

అనాత్మ యనగా, సమష్టివ్యష్ట్యాత్మకమైన శరీరత్రయముతో గూడుకొనియుండునట్టిప్రపంచ మనాత్మ యనంబడు.

### 2. జ్ఞానాజ్ఞానస్వరూపము.

జ్ఞాన మనగా, అద్వితీయు డగు నాత్మ నద్వితీయ్యునిగాను, అపరిచ్ఛిన్ను డగు నాత్మ నపరిచ్ఛిన్నునిగాను, అసంగు డగు నాత్మ నసంగునిగాను, అభోక్తయగునాత్మ నభోక్తగాను, అకర్తయగు నాత్మ నకర్తగాను యేది తలంపించుచున్నదో నది జ్ఞాన మనంబడును.

అజ్ఞాన మనగా, అద్వితీయు డగు నాత్మను సద్వితీయు డనియు, అపరిచ్ఛిన్నుడగు నాత్మను పరిచ్ఛిన్నునిగాను, అసంగు డగు నాత్మను సంగునిగాను, అకర్తయగునాత్మను కర్తగాను, అభోక్తయగు నాత్మను భోక్తగాను యేది దలంపించుచున్నదో నదియే అజ్ఞాన మనంబడు.

### 3. శ్రవణ మనన నిధిధ్యాస నిరూపణము.

శ్రవణ మనగా, షడ్విధలింగములతో సమస్తమైన వేదాంతవాక్యములు నంతర్యాతము. గనుక, షడ్విధలింగములచేత బ్రహ్మమును దెలుపుచుండగా, విని వానియందు బుద్ధినిలుపుట శ్రవణ మనంబడు.

మనన మనగా, శ్రుత్యర్థమునువిని ఆయర్థమును యుక్తులచేత ఏకవాక్యముజేసి చింతించుట మనన మనబడును.

నిధిధ్యాసన మనగా, విజాతీయ్యములైన కామక్రోధాదులనువిడిచి సజాతీయ్యమైన, అహంబ్రహ్మాస్మియను నెడు అర్థము నిరంతరము చింతించుట నిధిధ్యాసన మనంబడు.

ఇందుకు ప్రయోజనం బేమనిన, సర్వదా శ్రవణంబు జేయుట వలన సకల సంశయములును, సర్వదా మననము జేయుటచేత అసంభావనయును, సర్వదా నిధిధ్యాసనము జేయుటచేత విపరీతభావములును నశించునని తెలియుటే ప్రయోజనము.

4. ఈశ్వరస్వరూపము.

మాయయు, మాయాధిష్ఠానచైతన్యంబును, మాయాప్రతిబింబచైతన్యంబును యీమూడునుంగూడి ఈశ్వరుం డాయెను.

5. జీవస్వరూపము.

అంతఃకరణంబును, అంతఃకరణాధిష్ఠానచైతన్యంబును, అంతఃకరణప్రతిబింబచైతన్యంబును గూడి జీవు డాయెను.

ఈశ్వరున కుపాధియైన మాయయు, జీవున కుపాధియైన అంతఃకరణము తోసివేసి చూడగా, జీవేశ్వరుల కైక్యంబుగలిగి పరిపూర్ణబ్రహ్మమై యుండునని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

6. సచ్చిదానంద స్వరూపము.

సత్తు, చిత్తు, ఆనందము యీమూడునుం గూడి సచ్చిదానంద మనంబడు.

సత్తు — భూతభవిష్యద్వర్తమాన కాలత్రయంబునందు బాధింపబడక నిరంతరం బేకరూపముగా నుండునది సత్తు అని చెప్పబడును.

చిత్తు—సాధనాంతరము నపేక్షింపక సకలమైన బాహ్యాంతర పదార్థముల నిరంతరం బేవస్తువెలుంగుచున్నదో ఆవస్తువ చిత్తనంబడును.

ఆనందము — నిత్యమై నిరుపాధికమై నిరతిశయమై నిరుపమానమై యేసుఖ ముండునో ఆసుఖ మానంద మనంబడును.

ఈసచ్చిదానందములు భిన్నములు గావు. హస్తకరపాణిశబ్దంబుల వలె వకవస్తువున కనేకనామంబులునుంగావు. మరియెట్లనిన, వకదీపమునకు లోహితోష్ణప్రకాశంబు లెట్లుభిన్నాభిన్నంబులుగావో అట్లే ఆత్మకు సచ్చిదానందములు భిన్నాభిన్నములుగాని స్వరూప మని వేదాంతసిద్ధాంతము.

7. మాయాస్వరూపము.

మాయ యనునది సత్తని చెప్పదా మనిన, సమాధిసమయంబున లేకపోవుచున్నది. గనుక, సత్తని చెప్పగూడదు. అసత్తని చెప్పదా మనిన, అహామజ్ఞుడ నని యనుభవ మున్నది. గాన, అసత్తనియునుం జప్పగూ

డదు, ఉభయాత్మక మని చెప్పుదా మనిన, విరుద్ధంబు, గాన, చెప్పగూడదు. సావయవమని చెప్పుదా మనిన, సుషుప్తిసమయంబున దోషలేదు. గాన, సావయవమనియును జెప్పగూడదు. నిరవయవమని చెప్పుదామనిన జగద్రూపమైయున్నది. గాన, నిరవయవమనిన్ని చెప్పగూడదు. ఉభయాత్మకమని చెప్పుదా మనిన, విరుద్ధంబు. గాన, చెప్పగూడదు. పరమాత్మనకు భిన్నమని చెప్పుదామనిన, పరమాత్ముడద్వితీయుడని శృతులు బలుకుచున్నది. గాన, భిన్న మని చెప్పగూడదు. అభిన్న మని చెప్పుదా మనిన, ప్రకృతి అజ్ఞానము, మాయ యని ప్రత్యేకనామము లున్నవి. గనుక, అభిన్న మని చెప్పగూడదు. ఉభయాత్మక మైన విరుద్ధంబు. గాన, చెప్పగూడదు. మరియేమని చెప్పవలయు ననిన, అనిర్వచనీయమని చెప్పవలయు, అనిర్వాచ్య మనగా, నోట ఉచ్చరింపగూడనిది.

మరియును, ఈమాయ అనుభవజ్ఞానదృష్టిచేజూచిన నభావంబగుననియు, యుక్తిదృష్టిచేజూచిన అనిర్వచనీయం బగుననియు, కేవల లౌకికదృష్టిచేజూచిన అనంతంబగుననియును సర్వజ్ఞులైనపండితులచే జప్పంబడు.

## 8. క్షరాక్షరవిభేదము.

క్షర మనగా, పంచభూతములును, అంతఃకరణచతుష్టయంబును, అవ్యక్తంబును, దశేంద్రియములు, విషయపంచకము, చేతనేచ్ఛాసుఖదుఃఖములు మొదలుగాగలవన్నియు క్షరమని చెప్పబడును. నిదియే క్షేత్రమనియును, అపరాప్రకృతియనియు, పరాప్రకృతియనియును జప్పబడును.

అక్షర మనగా, ఈప్రకృతితో గలసి వర్తించు చిదాభాసుడు ఇతనికే క్షేత్రజ్ఞుడనియును, పురుషుండనియును రెండుపేర్లుచే జప్పబడును.

ఈక్షరాక్షరములకు సాక్షియై ప్రకాశించు పరమాత్మునకు పరమపురుషుండనియు, పురుషోత్తముండనియు, గుణాతీతుడనియు మూడుపేర్లు గలవు.

## 9. చేతనాచేతనస్వరూపము.

చేతన మనగా, పాదములతో నడుచునట్టి మనుష్యులు మృగములు మొదలైనవియును, రెక్కలతో నెగయునట్టి పక్షులు మొదలైనవియును నేలపాకెడు చీమలు మొదలుగాగలవియును చేతనములనిచెప్పబడును. నివియే జంగమములనియును, చరము లనియునుం బల్కబడును.

అచేతన మనగా, పృథివ్యాదిపంచభూతంబులును, వృక్షములును, పాషాణములు మొదలైనవి అచేతనము లనంబడును. నివియే అచరము

లనియును, స్థావరము లనియునుం జప్పబడును.

ఈచేతనాచేతనములయం దంతటను ఆత్మపరిపూర్ణుడై యున్నాడని తెలియవలెను.

10. అధ్యారోపనిరూపణము.

స్థాణువునందు పురుషాధ్యారోపము, రజ్జువునందు సర్పాధ్యారోపము యెటువలెనో, అటువలెనే నిష్ప్రపంచస్వరూపుడైన యాత్మునందు ప్రపంచముయొక్క ఆరోపము అధ్యారోప మనబడును. ఈఅధ్యారోపమెందుచేత వచ్చినదంటే, అధిష్ఠానాజ్ఞానముచేతనే వచ్చినది. ఈఅజ్ఞానము ప్రకృతియనియు, మాయయనియు, తమస్సనియు అనేకనామములచే జప్పంబడు. ఆప్రకృతిస్వరూపము నిరూపించుచున్నారము. అది యెట్టులనిన, గుణంబులయొక్క సామాన్యావస్థకు ప్రకృతి యని పేరు. ఇదియే ప్రళయావస్థ యనియునుం జప్పబడును. ఈప్రకృతిలోపల ననేక కోటిజీవరాసులు, తమతమకర్మములు, వాసనలు అదృష్టములతోట్టు గూడా లయించియుండును. అదియేలాగంటే, మైనపువుండలో స్వర్ణ రేణువులు యెటుల లీనమైయున్నవో, నటువలెనే లీనమైయున్నారు. ఇందుకు సర్వజనానుభవమైన సుషుప్తియే దృష్టాంతము. ఇట్లు బహుకాలము లీనమైయుండగా, నొకసమయమందు లీనమైనజీవుల అదృష్టములు పరిపక్వమాను. అప్పుడు త్రిగుణాత్మకమైన ప్రకృతియయ్యె. సత్వగుణము విజృంభించుటచేత మాయయని చెప్పబడును. ఈమాయయందు ప్రతిఫలించిన చైతన్యమున్ను, మాయయున్ను, మాయాధిష్టానచైతన్యమున్ను కూడి ఈశ్వరుడని చప్పబడును. ఆయీశ్వరునికే నంతర్యామి యనియు, నవ్యాకృతుం డనియు రెండుపేర్లు. ఇతడే జగత్సృష్టి యనియునుం జప్పబడును. మరియు, నీఈశ్వరుడే సత్వగుణప్రధానమైన మాయతోడగూడి నిమిత్తకారణ మాయెను. తమోగుణప్రధానమయిన మాయతోడంగూడి ఉపాదానకారణ మాయెను. ఈఉభయకారణుం డయిన ఈశ్వరునివలన జగదుత్పత్తియైనవిధంబెట్లనిన, ఈశ్వరుండు సత్వగుణప్రధానమైనమాయతో గూడి తమోగుణప్రధాన మయిన మాయకు వీక్షించెను. తమోగుణప్రధాన మయిన మాయతోడంగూడిన చైతన్యంబువలన త్రిగుణాత్మకంబైన ఆకాశంబు బుట్టెను. ఆయాకాశంబువలన నొకటి కొకటిక్రమంబుగా వాయు వగ్ని సలిల భూతత్వంబులు త్రిగుణాత్మకముగా బుట్టెను. నవి పంచీకృతభూతములనిన్ని, సూక్ష్మభూతములనిన్ని, తన్మాత్రలనిన్ని చెప్ప

బడును. ఈభూతములవలన వ్యష్టిసమష్ట్యాత్మకం బయిన లింగశరీరంబు బుట్టెను. ఈలింగశరీరస్వరూపం బేమనిన, ఆకాశాది పంచభూత సాత్వికాంశంబులవలన క్రమముగా శ్రోత్రాది జ్ఞానేంద్రియంబులు బుట్టెను. ఆభూతములయొక్క సాత్వికాంశసమష్టివలన అంతఃకరణంబుబుట్టె. వృత్తిభేదములచే నాలుగువిధము లాయెను. పంచభూతరజోంశమువలన క్రమముగా కర్మేంద్రియములుబుట్టెను. ఈభూతములయొక్క రజోంశంబువలన ప్రాణంబుబుట్టి నది వృత్తిభేదములచేత నైదువిధంబులై యుండెను. నిందులో నుపవాయువులు నంతర్భూతములని తెలియవలయు. ఈపదిహేడవయవంబులంగూడి సమష్టివ్యష్ట్యాత్మకంబైన లింగశరీరంబు బుట్టెను. పదియేడింటిలెక్కను మనస్సును చిత్తంబు గూడి వక్కటాయెను. బుద్ధియు నహంకారంబునుం గూడి వక్కటాయెను. ఆఈశ్వరుడే లింగశరీరమునం దభిమానము జేసి హిరణ్యగర్భు డాయెను. ఇతనికే సూత్రాత్మయనియు, ప్రాణుం డనియు రెండుపేర్లు. నిదియంతయు సూక్ష్మసృష్టి యనంబడు.

ఇక, స్థూలసృష్టి యెట్లనిన, ఆఈశ్వరునియొక్క వీక్షణముచేత తమోగుణప్రధానంబులైనఅపంచీకృతభూతంబు లొక్కటొక్కటి రెండేసి భాగంబులైఅందులోసగమువిడిచి తక్కినసగములో నొక్కొక్కభాగంబు ఐదుభాగంబులైఆయాభాగంబులలో స్వాంశంబులువిడిచి ఇతరభూతముల యందు తక్కినభాగంబులుంగూడి పంచీకృతభూతంబులాయెను. ఈపంచీకృతభూతంబులకు స్థూలభూతములనిపేరు. ఈభూతమువల్లనుంచి ఈశ్వరుని యొక్క వీక్షణముచేత అండంబు గలిగెను. ఈఅండంబులో నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబు లనెడి నేడైన యధోలోకంబులును, భూలోకము మొదలు మీది యేడులోకములును, ఆయాలోకముల కుచితమైన చతుర్విధభూతగ్రామంబునుం గల్గెను. ఇంతవట్టును స్థూలప్రపంచమని చెప్పబడును. ఈప్రపంచముయొక్క అవాంతర సృష్టిస్థితిలయంబులకొరకై ఆఈశ్వరుడే సత్వగుణముతోఁగూడి రక్షకుడైనవిష్ణువును, రజోగుణముతోఁ గూడి సృష్టికర్త యైన బ్రహ్మయు, తమోగుణముతోఁగూడి సంహారకర్తయైన రుద్రుడును నాయెను. మరియు, హిరణ్యగర్భాంతర్భూతుండు విష్ణువును, విరాడంతర్భూతుండు బ్రహ్మయు, అవ్యాకృతాంతర్భూతుండు రుద్రుండును ఈప్రకారంబు ప్రపంచోత్పత్తి. ఇదే అధ్యారోపమని చెప్పబడును.

11, అపవాదనిర్ణయము.—అపవాదము. కారణవ్యతిరిక్తముగాను, కార్యములేదని యెఱుంగుట అపవాద మనంబడును. అదియేలాగంటే, మృత్తులవలన బుట్టిన ఘటశరావాదులు మృద్వ్యతిరిక్తముగా నెటువలె లేవో, అటువలెనే ఆత్మవలనబుట్టినప్రపంచము ఆత్మవ్యతిరిక్తముగాలేదనియెరుంగుటేఅపవాదము. 12, సూక్ష్మశరీరపంచీకరణచక్రము.

| | అపంచీకృత పంచసూక్ష్మభూతములు. | ఆకాశము. | వాయువు. | అగ్ని. | జలము. | పృథివి. | సత్వరజ సూక్ష్మభూతములు. |
|---|---|---|---|---|---|---|---|
| సత్వసూక్ష్మ పంచభూతములు. | సత్వసమష్టిసూక్ష్మ పంచభూతములు. | | మనస్సు. చంద్రుడు. | బుద్ధి. బృహస్పతి. | చిత్తము. జీవుడు. | అహఙ్కారం. రుద్రుడు. | అంతఃకరణములు. అధిదేవతలు. |
| | సత్వవ్యష్టిసూక్ష్మ పంచభూతములు. | శ్రోత్రము. దిక్కులు. | త్వక్కు. వాయు. | చక్షు. అర్కుడు. | జిహ్వ. వరుణుడు. | ఘ్రాణము. అశ్వినులు. | జ్ఞానేంద్రియములు అధిదేవతలు. |
| రజస్సూక్ష్మ పంచభూతములు. | రజస్సమష్టిసూక్ష్మ పంచభూతములు. | సమానము జయుడు. | వ్యానము. విశ్వయోని. | ఉదానము అజుడు | ప్రాణము. విశిష్టుడు. | అపానము. విశ్వకర్త. | పంచప్రాణములు. అధిదేవతలు. |
| | రజోవ్యష్టిసూక్ష్మ పంచభూతములు. | వాక్కు. వహ్ని. | పాణి. ఇంద్రుడు. | పాదము. విష్ణువు. | గుహ్యము. బ్రహ్మ. | పాయు. మృత్యువు. | కర్మేంద్రియములు. అధిదేవతలు. |

జీవసూక్ష్మదేహతత్త్వాధిదేవతలే ఈశ్వరసూక్ష్మదేహతత్త్వములు.

13. స్థూలశరీరపంచీకరణచక్రము.

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశము. అంతఃకరణం. | మనస్సు. | బుద్ధి. | చిత్తము. | అహంకారం. |
| సమానవాయువు. | వాయువు. వ్యానవాయువు. | ఉదానవాయువు. | ప్రాణవాయువు. | అపానవాయువు. |
| శ్రోత్రేంద్రియము. | త్వగింద్రియము. | తేజస్సు. చక్షురింద్రియము. | రసనేంద్రియము. | ఘ్రాణేంద్రియము. |
| శబ్దము. | స్పర్శము. | రూపము. | జలము. రసము. | గంధము. |
| వాగింద్రియం. | పాణీంద్రియం | పాదేంద్రియము. | ఉపస్థేంద్రియము. | పృథివి. పాయువేంద్రియము. |

జీవస్థూలదేహతత్త్వాధిదేవతలే ఈశ్వరస్థూలదేహతత్త్వములు.

14. వ్యష్టిసమష్టులకు వివరము.

వ్యష్టి యనగా, యేకము. సమష్టి యనగా, సమస్తము. ఇందుకు దృష్టాంతము. వ్యష్టియన వృక్షము, సమష్టి యన వనము, సమష్టి శరీరత్రయమునం దభిమానించిన ఆత్మకు ఈశ్వరు డనియు, వ్యష్టి శరీరత్రయమునకు అభిమానించిన ఆత్మకు జీవుడనియు పేరు. అదియెట్లనిన, సమస్తప్రాణులయొక్క స్థూలశరీరములు సమష్టిస్థూలశరీర మనియును, సమస్తప్రాణులయొక్క సూక్ష్మశరీరములు సమష్టిసూక్ష్మశరీరమనియును, సమస్తప్రాణులయొక్క కారణశరీరములు సమష్టికారణశరీరమనియును, ఒకప్రాణియొక్క స్థూలశరీరము వ్యష్టిస్థూలశరీర మనియును, ఒకప్రాణియొక్క సూక్ష్మశరీరము వ్యష్టిసూక్ష్మశరీర మనియును, నొకప్రాణియొక్క కారణశరీరము వ్యష్టికారణశరీరమనియునుం జప్పబడును.

ఈవ్యష్టిసమష్ట్యుపాధులు జీవేశ్వరులకు కల్పితము లయినవి గాని, పరమార్థతా లేవని విచారించినయెడల జీవేశ్వరుల కైక్యంబు గలుగు నని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

15. అధ్యాత్మికాధిభౌతికాధిదైవికచక్రము.

| అధ్యాత్మము. | అధిభౌతికము. | అధిదైవికము. |
|---|---|---|
| శ్రోత్రము. | శబ్దము. | దిక్కులు. |
| త్వక్కు. | స్పర్శము. | వాయువు. |
| చక్షులు. | రూపము. | సూర్యుడు. |
| జిహ్వ. | రసము. | వరుణుడు. |
| ఘ్రాణము. | గంధము. | అశ్వినీదేవతలు. |
| వాక్కు. | వచనము. | అగ్ని. |
| పాణి. | దానము. | ఇంద్రుడు. |
| పాదము. | గమనము. | ఉపేంద్రుడు. |
| పాయువు. | విసర్జనము. | మృత్యువు. |
| ఉపస్థ. | ఆనందము. | ప్రజాపతి. |
| బుద్ధి. | నిశ్చయము. | బృహస్పతి. |
| చిత్తము. | స్మరణ. | క్షేత్రజ్ఞుడు. |
| అహంకారము. | అభిమానము. | రుద్రుడు. |
| మనస్సు. | సంకల్పము. | చంద్రుడు. |

ఈవిచారమునకు ఫలం బేమనిన, అధ్యాత్మిక మనబడు చతుర్దశేంద్రియములచేత అధిభౌతికమను చతుర్దశకర్మములును, అధిదైవికమను చతుర్దశాధిదైవములచేత ప్రేరేపింపంబడి చేయబడుచున్నవని తెలియుటే ఫలము.

16. ఉపదేశానర్హజనులు.

ఉపదేశానర్హులు యథార్థం బైన వేదాంతరహస్యము ఖలునకు, నవినీతునకు, జడునకు, దురాచారునకు, దాంభికునకు, ఇంద్రియలోలునకు, పుత్రదారాగారాద్యత్యంతాసక్తునకు, భగవద్భక్తిహీనునకు, విష్ణుదాసులయందు ద్వేషపడువానికి నుపదేశింపగూడదని సిద్ధాంతము.

ఉపదేశార్థులు శ్రద్ధాసంపన్నునకు, భక్తునకు, వినతునకు, అసూయా రహితునకు, సర్వభూతమిత్రునకు, గురుశుశ్రూషాభిరతునకు, బాహ్యార్థ జాతవిరక్తునకు, శాంతచిత్తునకు, నిర్మత్సరునకు, శుద్ధాత్ములగు భగవద్భక్తులయందు ప్రేమగలవారికి, అన్యకాంతావిముఖునకు, నిష్కామునకు నుపదేశింపవలయునని వేదాంతసిద్ధాంతము.

17. భాగవతోత్తమధర్మములు.

తమ్ముదామెఱుగక విషయాసక్తులైన మూఢజనులపొంతలంబోవక కేవలవిష్ణుభక్తిగల సద్గురువుల ప్రతిదినమును భజించుటయు, సాత్వికంబును, భూతదయయును, హరికథామృతపానంబును, బ్రహ్మచర్యవ్రతంబును, విషయముల మనంబు జేరకుండుటయు, సాధుసాంగత్యంబును, వినయసంపత్తియు, శుచిత్వంబును, తపంబును, క్షమయు, మౌనవ్రతంబును, వేదశాస్త్రాధ్యయనమును, తదర్థానుష్ఠానంబును, అహింసయును, సుఖదుఃఖద్వంద్వసహిష్ణుతయు, ఈశ్వరుని సర్వగతునిగా భావించుటయు, ముముక్షుత్వంబును, జనసంగవర్జనంబును, వల్కలాదిధారణయును, యదృచ్ఛాలాభసంతుష్టియు, వేదాంతశాస్త్రజిజ్ఞాసయు, దేవతాంతర నిందావర్జనంబును, గరణత్రయశిక్షణంబును, సత్యవాక్యతయు, శమదమాదిగుణ విశిష్టత్వంబును, గృహారామకళత్రపుత్రక్షేత్రవిత్తాదుల హరి కర్పణ జేయుటయును, ఇతరదర్శనవర్జనంబును మొదలుగాగలధర్మంబులు భాగవతోత్తమ ధర్మంబులని తెలియవలయు.

18. ద్రుశ్యాత్మనిర్ణయము.

జ్ఞానేంద్రియంబులు 5, కర్మేంద్రియంబులు 5, ప్రాణాదులు 5, శబ్దాదులు 5, కరణములు 4, నివియన్నియుగూడి 24 తత్వంబులనంబడు. ధవళశ్యామలరక్తపీతవర్ణంబులమధ్యప్రకాశించునదియేప్రకృతి. యదియే క్షరము. అదియే క్షేత్రము. అదియే శిఖయు. అదియే ఆపోజ్యోతియు. అదియే అంతర్లక్ష్యము, అదియే నీవారశూకము. నదియే గగనసముద్రం. నదియే నీలతోయదమధ్యస్థంబయిన విద్యుల్లేఖ. అదియే మేరుశిఖరము. అదియే శిఖరాస్థానము. అదియే నిత్యవైకుంఠము. అదియే సత్యకైలాసము. నదియే చిన్మయనేత్రం. బదియే జీవము, అదియే ఆత్మ, యదియే సర్వసాక్షియైన సచ్చిదానందస్వరూపము. మరియు, ముందు చెప్పినధవళశ్యామలరక్తపీతవర్ణంబులలో మొదటిరక్తవర్ణంబే స్థూలదేహము, స్వా

వర్ణంబే సూక్ష్మదేహము, శ్యామలవర్ణమే కారణదేహము, వీటినడుమ ప్రకాశించు పీతవర్ణంబే మహాకారణదేహంబు, ఇన్నిటిమధ్యను కైవల్యంబను తనువు ప్రకాశింపుచుండు నని శ్రుతిస్మృతీతిహాసములు ఘోషింపుచుండును. ఈతనువుల ప్రమాణం బెట్లనిన, అంగుళార్థము గుండ్రనైయుండునదియే స్థూలదేహము, అంగుళప్రమాణంబై యుండునదియే సూక్ష్మదేహము, అర్థాంగుళప్రమాణంబైయుండునదియే కారణదేహము, ఇందులో సగముగా నుండునదియే మహాకారణదేహము. వీటిమధ్యనుయుండి ఇన్నిటిని ప్రకాశింపజేయుచు అణువై యఖండమైయుండునదియే ఆత్మ. నదియే సచ్చిదానందస్వరూపచైతన్యమని బుధులు వచింపుచుందురు. ఈచెప్పినదంతయు నేత్రమం దున్నదని తెలియవలయు.

## 19. వైరాగ్యబోధోపరతులనిర్ణయము.

వైరాగ్యమునకు హేతుస్వరూపకార్యములలో హేతువు సమస్తవిషయములయందును వాంత్యశనంబువలె వదలవలయు ననునట్టితలంపు వైరాగ్యమునకు హేతువు.

స్వరూపము—ఈవిషయంబులయందు వృత్తిరాకుండుట వైరాగ్యమునకు స్వరూప మనంబడు,

కార్యము—ఆవిషయసుఖములయందు విరక్తి బుట్టి సర్వాత్మనా విడుచుట వైరాగ్యమునకు కార్య మనంబడు.

బోధకు హేతుస్వరూపకార్యములు. వానిలో హేతువు శ్రవణమనననిధిధ్యాసలు బోధకు హేతు వనంబడు.

స్వరూపము—ఆశ్రవణాదులచేత దేహేంద్రియాదులను బంచి అద్వితీయాత్మస్వరూపము నేననియును, ఈదేహేంద్రియాదిప్రపంచము నాకులేదనియును తెలియుట బోధకు స్వరూప మనంబడు.

కార్యము—ఈఅనాత్మస్వరూపంబగు దేహేంద్రియాదులు కాలత్రయమునందును నేనుగాననేదృఢనిశ్చయము బోధకు కార్య మనంబడు.

ఉపరతికి హేతుస్వరూపకార్యములు. వానిలో యమనియమాదులు హేతువు, చిత్తనిరోధము, స్వరూపము, సర్వవ్యవహారనాశము కార్యము

ఈవిచారమునకు ఫలంబేమనిన, ఈవైరాగ్యబోధోపరతులు మోక్షంబునకు సమప్రధానంబులో, లేక రెండుప్రధానంబులో, లేక వకటి

ప్రధానమో యనిన, బోధ యనునది సాధనాంతరము నపేక్షింపకనే మోక్ష మిచ్చుచున్నది గాన, నొకటిప్రధానము, తక్కిన రెండును సాధనములు. ఈ రెన్ను వకపురుషునియందు పుష్కలంబయితె అనేకజన్మతపఃఫలంబనియెరుంగవలయు. లేక ప్రతిబంధవశంబున నొకపురుషునికివైరాగ్యోపరతులు పూర్ణములుగా నుండి జ్ఞానంబు లేకపోయినట్టయితె వానికి మోక్షంబులేదు. అయితె వైరాగ్యోపరతులు వ్యర్థంబులాయె గదా యనిన, వైరాగ్యోపరతులు తపస్సు గాన, స్వర్గాదిలోకప్రాప్తిగలుగును. వకపురుషునికి జ్ఞానంబుపూర్ణంబై యుండి వైరాగ్యోపరతులులేకపోయినను నతనికి మోక్షంబు సిద్ధించును. అట్లయితె వైరాగ్యోపరతులవలన ప్రయోజనంబేమనిన, అవిలేకున్న ప్రత్యక్షదుఃఖంబుబోదు గాన, నవియును యుండవలయును.

వైరాగ్యబోధోపరతులకు అవధి యెప్పు డనిన, బ్రహ్మలోక తృణీకారమువచ్చుట వైరాగ్యమున కవధి. అజ్ఞానకాలంబున దేహేంద్రియాదులు నేనని తోచినట్లు ఆత్మస్వరూపము నేనని దృఢముగాదెలియువరకు బోధ కవధి. సుషుప్తియందువలెనే జాగ్రతయందును ముముక్షువునమస్తవిషయములను మరచియుండుట యంతవరకు సిద్ధించునో అంతవరకు వుపరతి కవధి.

ప్రారబ్ధము నానావిధములు గాన, వివేకు లయినవారలు వారలయొక్క వ్యాపారంబులుజూచి శాస్త్ర మెటువలె నున్నది. వీర లెటువలె నున్నారని భ్రమింపపనిలేదు. వారివారిప్రారబ్ధానుసారంబుగా నానావిధ వ్యాపారములతో గూడుకొనియున్నప్పటికి జ్ఞానంబును, జ్ఞానఫలంబయిన మోక్షంబును సమమేనని యెరుంగుట యీవిచారమునకు ఫలము.

## 20. దైవాసురసంపద్విభాగములు.

దైవసంపత్తునుగూర్చి పుట్టినవానికి భయరహితమున్ను, సత్యభావవ్యవహారమున్ను, జ్ఞానయోగమం దుండుటయును, దానము చేయుటయును, బాహ్యేంద్రియనిగ్రహమున్ను, యజ్ఞముజేయుటయున్ను, వేదాధ్యయనమును, తపస్సును, ఋజుత్వంబును, హింసారాహిత్యమును, సత్యవాక్యతయును, క్రోధములేకయుండుటయు, వితరణయును, శాంతియు, సర్వప్రాణులయందు దయయు, విషయసన్నిధి నింద్రియ వికారములు లేకయుండుటయును, మృదుత్వమును, సిగ్గును, చపలములేకయుండుటయు

ప్రతిభతో గూడియుండుటయు, ఓర్పును, ధైర్యమును, బాహ్యాంతరపరిశుద్ధత్వము, పరులకు ద్రోహము జేయకుండుటయు, గర్వము లేకయుండుటయు ఈచెప్పబడిన భయరహితము మొదలైనగుణములు దైవసంపత్తును గూర్చి పుట్టినవారికి గలిగియుండు నని తెలియవలెను. ఈదైవసంపత్తు సంసారబంధనివృత్తికిన్ని, మోక్షమునకున్ను కారణమైయుండును.

అసురసంపత్తును గూర్చి పుట్టినవారికి డంభమున్ను, గర్వమున్ను, అభిమానిత్వమున్ను, పౌరుషమున్ను, క్రోధమున్ను, అజ్ఞానము మొదలైన గుణములు గలిగియుండును. ఆఅసురసంపత్తున బుట్టినవారికి పుణ్యాపాపములు దెలియకుండును. వారియందు శుచిత్వమున్ను, ఆచారమున్ను లేకయుండును. సత్యమున్నువుండదు. మరియు, నాయసురజనులు జగత్తు లేనిదానిగానున్ను, ప్రతిష్ఠారహితమైనదానిగానున్ను, నియామకుడు లేనిదానిగానున్ను చెప్పుదురు. ఇదిగాక, ప్రపంచము స్త్రీపురుషులసంయోగమువలననేపుట్టినది. వేరేయేమియున్నది: అంతా కామహేతువు గలిగినదని చెప్పుదురు. ఈప్రకారము నొకజ్ఞానము నవలంబించి నష్టాత్ములై స్వల్పబుద్ధి గలవారలై హింసాదిక్రూరకర్మములు గలవారలై శత్రువులై లోకనాశముకొరకు పుట్టుచున్నారు. నిండింప నశక్యమైన కోరిక నాశ్రయించి అజ్ఞానమువలన అన్యాయపుపరిగ్రహులై దంభమాన మదములతో గూడి ప్రవర్తింపుచున్నారు. మరియును, మరణమే తుదగా గలిగినట్టి అపరిమిత చింతను నాశ్రయించి కోరికల ననుభవించుటయే శ్రేష్ఠముగానెంచి నూరువిధములైన ఆశాపాశములచేత కట్టబడినవారలై కామక్రోధపరాయణులై కామభోగముకొరకు అన్యాయముచేత పదార్థములబొందగోరుచు ఇప్పుడు నాచేత యీధనము పొందబడినది. ఈకోర్కెనున్ను పొందగలను. యీధనము నాకువున్నది. ఇదిగాక, కొంతధనమురాగలదు. ఈశత్రువు నాచేత చంపబడెను. ఇతరశత్రువులను సంహరింపగలను. ఈప్రకారముగా అజ్ఞానముచేత మోహింపబడినవారలై నానావిధచిత్తవైకల్యముగలవారలై అశుచియైన నరకమునందు బడుచున్నారు. ఇతరదేహములయందు వుండే భగవంతుని ద్వేషింపుచున్నారు. అట్టిక్రూరులు నిరంతరమున్ను అసురసంబంధమైన యోనులయందు బుట్టుచున్నారు. ఈఅసురగుణము నరకమునకున్ను: సంసారబంధమునకున్ను కారణమైనదని పండితులు వచింపుచుందురు.

## 21. జ్ఞానాద్యజ్ఞనిరూపణము.

ఆసక్తిరహితుడై సంసారబంధమువదలి జ్ఞానమం దున్న చిత్తము గలవాడు యజ్ఞార్థమైన కర్మమును లోకసంరక్షణార్థము జేసినను, అతని యజ్ఞఫలముబొందక ఫలముతోగూడినకర్మములు తానె నశింపుచున్నవి. మరియు, హోమసాధనము లయిన స్రుక్స్రువాదులు బ్రహ్మస్వరూపమే. ఆజ్యాదిహవిస్సును బ్రహ్మమే. అందుండు అగ్నియు బ్రహ్మమే. అట్టిఅగ్ని యందు హోమముచేయుడమనే హవనక్రియయు బ్రహ్మమే. అట్టియజ్ఞము చేత పొందదగిన ఫలమును బ్రహ్మమే నని తెలిసినవారికి కర్మంబు లేదని సిద్ధాంతము.

కొందరు జ్ఞానులు హవిస్స్రువాది యజ్ఞసాధనములచేతనే పరమార్థముతో గూడిన యాత్మను బ్రహ్మ మను నగ్నియందు వేల్చుచున్నారు. బ్రహ్మాత్మైక్యనిష్ఠులని యర్థము, ఇదియే జ్ఞానయజ్ఞము. కొందరు నైష్ఠికులు శ్రోత్రాదింద్రియములను నిగ్రహ మనెడి అగ్నియందు వేల్చుచున్నారు. కొందరు శబ్దాదివిషయములను యింద్రియము లనే యగ్నియందు వేల్చు చున్నారు, కొందరు జ్ఞానేంద్రియముల కర్మేంద్రియములయొక్క శబ్దాది వచనాది విషయములను, దశవాయువుల కర్మములను జ్ఞానముచే ప్రకాశింపబడిన తనయింద్రియనిగ్రహ మనెడి యగ్నియందు వేల్చుచున్నారు. కొందరు శబ్దాదివిషయములను యింద్రియము లనె యగ్నియందు వేల్చు చున్నారు, కొందరు జ్ఞానేంద్రియముల కర్మేంద్రియములయొక్క శబ్దాది వచనాది విషయములను, దశవాయువుల కర్మములను జ్ఞానముచే ప్రకాశింపబడిన తనయింద్రియనిగ్రహ మనెడి ఉపాయముగల అగ్నులయందు వేల్చుచున్నారు. కొందరు పుణ్యతీర్థములయందు ద్రవ్యదాన మనెడు ద్రవ్యయజ్ఞము గలవారును, కొందరు కృఛ్రాదితప మనెడి తపోయజ్ఞము గలవారును, కొందరు ప్రాణాయామాదియోగములనెడి యోగయజ్ఞము గలవారును, కొందరు వేదపారాయణ శాస్త్రార్థ పరిజ్ఞానము లనెడి స్వాధ్యాయజ్ఞానయజ్ఞములు గలవారును, కొందరు తీక్షణముగా జేయబడిన వ్రతము లనెడి నియమయజ్ఞములుగలవారును ఈచెప్పబడినవారు మొదలుగా గలవార లందరును యజ్ఞమును తెలిసినవారలు. యజ్ఞములలో మిగిలిన అమృతమును భుజించినవారును గాన, శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నారు, ఈచెప్పినయజ్ఞములలో నొకటిని జేయనివానికి ఈసర్వ

ప్రాణి సాధారణ మైన లోకము లేదు, పరలోకము మొదలే లేదు. ఈ సమస్తయజ్ఞములు కర్మమువలనబుట్టినవానిగా దెలియువలయు. ఈచెప్పిన యజ్ఞములలో జ్ఞానయజ్ఞము మిగుల శ్రేష్టమని యాచరింపదగినది.

22. నాదబిందుకళాస్వరూపము.

సకల కర్మంబొనర్చు మనంబు ప్రవర్తిల్లుచుండును. నమ్మనంబు గరణంబుగా గైకొని పవనమనోగ్రస్థితయు, కర్తృత్వ భోక్తృత్వాది ధర్మ సమేతయున్నై బుద్ధి విలసిల్లు. అదియే బిందు వనంబడు. వాయువుయొక్క ధ్వని నాదమని చప్పబడును. ఈబిందునాదములకు సాక్షియైయున్న ఆత్మ యొక్క ప్రతిబింబమే కళ యనంబడు. ఈనాదబిందుకళాతీతుడై సచ్చి దానందస్వరూపుడైయున్న ఆత్మ నేనని యెఱుంగవలయు.

అకారము నాదము, ఉకారము బిందువు, మకారము కళ యని చప్పబడును.

23. నాదబిందుకళాస్వరూపచక్రము.

| విషయములు – | నాదము. | బిందు. | కళ. |
|---|---|---|---|
| పన – | పవనఘోషము. | దేహప్రాణమనో గ్రస్థితబుద్ధి. | ఆత్మప్రతిబింబము. |
| | లింగము. | అంగము. | లింగాంగసంగము |
| వర్ణములు – | అకారము. | ఉకారము. | మకారము. |

24. బ్రాహ్మణత్వాద్యభిమాననిర్ణయము.

బ్రాహ్మణత్వాద్యభిమానము యెందుచేత వచ్చుచున్న దనిన, అవివేకముచేత వచ్చుచున్నది. యెటువలెనంటె, సమస్తమైనవారలకు నేను బ్రాహ్మణుడ ననియు, క్షత్రియుడ ననియు, వైశ్యుడ ననియు, శూద్రుడ ననియు, బ్రాహ్మణత్వా ద్యభిమానము వచ్చుచున్నదిగదా. అది దేని నవలంబించుకొని వచ్చుచున్న దని తెలుసుకునే వివేకము యెవరికి లేదు గాన, వచ్చుచున్నది. దీనికి అవలంబములేదా. అంటె, అదియెటు వలనంటే, శరీరమునవలంబించుకొని బ్రాహ్మణత్వాద్యభిమానమువచ్చు చున్నదని చెప్పుదామంటె, శరీరము క్షత్రియాదులకున్ను సహజమైయు న్నది. గాన, శరీరము నవలంబించుకొని బ్రాహ్మణత్వా ద్యభిమానము వచ్చుచున్నదని చెప్పుదామనిన, శిఖాయజ్ఞోపవీతములు క్షత్రియాదులకును

సాధారణములైయున్నవి గాన, శిఖాయజ్ఞోపవీతముల నవలంబించుకొని బ్రాహ్మణత్వాదులు వచ్చినవనిచెప్పఁగూడదు. విశిష్టమైన మాతాపితృల వలన జన్యమైన అవయవములకు బ్రాహ్మణత్వాదులు చెప్పుదామనిన, విశిష్టమైన మాతాపితృలవలన త్యజింపబడిన కేశ రోమ నఖ దంత మల మూత్రాదులకును బ్రాహ్మణత్వాదులు రావలెను. అట్లురాలేదు. గాన, విశిష్టమైన మాతాపితృల నవలంబించుకొని బ్రాహ్మణత్వాదులు వచ్చిన వని చెప్పఁగూడదు. అట్లయితె బ్రాహ్మణత్వాద్యభిమానమునకు గతి యేమనిన, శోభన మనియు ఉత్సవ మనియు అనేకవస్తుసమూహమునకు ఆయానామంబులు యెటువలె వచ్చుచున్నవో, అటువలెనే అనిర్వాచనీయమైన దేహేంద్రియాదులకే బ్రాహ్మణత్వాదులు వ్యవహారమునందు జప్పబడుచున్నవి. ఆత్మకు కాలత్రయంబునందును బ్రాహ్మణత్వాద్యభిమానంబులేదు. ఈలాగు నెరుగనిదే అవివేకము. ఈఅవివేకము యెందుచేత వచ్చిన దనిన, అజ్ఞానముచేత వచ్చినది. ఆయజ్ఞానం బనాదియౌటచే యెందుచేతను వచ్చినదిగాదు.

## 25. తారకయోగలక్షణము.

పంచముద్రలను వేర్వేర యెరింగి అందు నాదబిందుకళల గనుంగొని హంసతత్వంబునుం దెలిసి సచ్చిదానందస్వరూపం బగు పరంజ్యోతియందు మనస్సు లయంబుగావించుట తారకయోగ మనంబడు.

## 26. సాంఖ్యయోగలక్షణము.

అపంచీకృత పంచమహాభూతంబుల విభాగించి ఇరువైఅయిదుతత్వములుగా నొనర్చి ఆతత్వంబుల వృత్తులను వాని అధిదైవములను ఆతత్వస్థానాదుల నెరింగి అవి అన్నియు నాత్మ గావని కడద్రోచి విశేషించిన సచ్చిదానంద నిత్యపరిపూర్ణ బ్రహ్మచైతన్యమే ఆత్మయనియు, నదియే నేననియు తెలిసి దృఢనిశ్చయుం డగుటయే సాంఖ్యయోగ మనబడును.

## 27. అమనస్కయోగలక్షణము.

సర్వావస్థలయందును పంచేంద్రియములకు గోచరం బగు సర్వంబును సచ్చిదానందంబుగా నెఱింగి బాహ్యాంతరప్రపంచము మిధ్యగా జూచుచుండుటయే అమనస్కయోగ మనంబడు.

## 28. శరీరవిశాలాదులు.

మనుష్యుఁడు తొంబదియారు అంగుళములపొడవు అనగా, మెని

మిదిజానలు, నాలుగుజానలవెడల్పు, ముప్పదిమూడుకోట్లరోమములు, డెబ్బదిరెండువేలనాళ్లు, అరువదిఆరుఎముకలు, -తొంబదియారుకీళ్లు, ముప్పదిమూడు మూరలపేగు, మణుగునాల్గుశేర్లమాంసము, వకశేరు గుండెలు, అర్ధసేరురక్తము, సోలెడుపైత్యము, అరసోలెడుశ్లేష్మము, శుక్ల మరసోలెడు యీప్రకారముగా శరీరము మాంసరక్తాదులచే పూరింపం బడినదని తెలిసి దీనియందు భ్రాంతిలేకుండవలెనని బుధులు వచింపు చుందురు.

## 29. ఇడపింగళనాడులక్రమము.

ఇడనాడియందు చంద్రుండు ప్రవహించును. గనుక, ఆవాయువు బయలువెళ్ళినకాలము రాత్రి యని చెప్పబడును. ఆఇడానాడియందే వాయువు లోపలికి ప్రవేశించుకాలము పగలని చెప్పబడును. పింగళనాడి యందు సూర్యుం డధివసించియుండును. గనుక, ఆనాడిప్రవహించు కాలము పగలనియును, లోపలికి ప్రవేశించుకాలము రాత్రియనియునుం జెప్పబడును. వాయువు దక్షిణమునసడుచుచు వుత్తరభాగమైన ఇడయందు యెంతకాలము నడువకుండునో అంతకాలము ఉత్తరాయణ మనబడును. వాయువు ఉత్తరభాగమయిన ఇడయందు నడుచును. దక్షిణమున యెంత కాలము నడువకుండునో అంతకాలము దక్షిణాయన మని చెప్పబడును. అనగా, ఇడానాడి దక్షిణాయనమనియును, పింగళానాడి వుత్తరాయణమని చెప్పబడును.

ఇడానాడి వామనిశ్వాసము చంద్రమండలమును బొంది మూలాధారము మొదలుకొని సహస్రారము తుదగా వ్యాపించియుండును. ఈ నాడి పితృయానమనియును, ధూమమార్గమనియును, పునరావృత్తికికారణమనియును చెప్పబడును.

పింగళానాడి అగ్నిమండలమును బొంది పుణ్యకర్మానుకూలమై మూలాధారంబు మొదలుకొని సహస్రారము తుదగా వ్యాపించి దక్షిణ పార్శ్వము నాశ్రయించియుండును. ఇది దేవయానమనియును, పునరావృత్తి రహితమనియును తెలియవలయును.

కుండలీనాడి యనెడి సర్పము చంద్రనాడియనే వాయువును యె ప్పుడు మ్రింగుచున్నదో అప్పుడు శేషాంగకగ్రాస మను గ్రహణ మని యెరుగదగినది. ప్రాణంబుసూర్యుండు, చంద్రుడపానవాయువు, మూలా

ధారప్రవేశానంతరమందు ఉదయించును. మూర్ధ్నిప్రవేశానంతరమున అస్తమించును. సూర్యోదయకాలము చంద్రాస్తమయకాలమునిన్ని, సూర్యాస్తమయకాలము చంద్రోదయకాలమునిన్ని తెలియవలయు. ఆనాడుల అస్తమయోదయకాలములే నాడీసంక్రమణములని చెప్పబడును.

౩౦. సుషుమ్నానాడిలక్షణము.

బ్రహ్మలోకప్రాప్తిద్వారం బగుటచే సుషుమ్న బ్రహ్మనాడి యనం బడును. తొంబదియారంగుళముల ప్రమాణంబైన దేహంబు నట్టనడుమ త్రికోణాకారంబై కోడిగ్రుడ్డుచందంబున నుండునది కందస్థానంబు. ఆనాభి కందమునకుక్రింద కుండలీశక్తియనే దేవతయుండును. కుండలీశక్తియనగా పామువలె నుండు మొదటినాడి. మూలప్రకృతి మహదాదులు యేడును మలకలుగాగలదై సుషుమ్నానాడితో బెనగొనుచును కుండలినిబ్రాకి నిట లాంతముదాక క్రిందటిముఖమై వ్రేలుచుండును. ఆనాడినిజుట్టుకొని డెబ్బది రెండువేలనాడు లుండును. వానిలో దశనాడులు శ్రేష్టంబు. గాన, అవి పూర్వమే దశసంఖ్యాప్రకరణమందు దెలుపబడియున్నవి. బ్రహ్మనాడి వాయుజయంబునగాని సిద్ధింపదు. అదియెట్లనిన, పాపరూపిణియైనప్రకృతి మహదాదితత్వముల యేడింటితో గూడినదై ముఖము విచ్చి సుషుమ్నా మూలరంధ్రంబుగప్పి మూలాధారంబుమొదలుకొని వీణాదండంబురీతిగా నున్న వెన్నెముకసంబంధమువలన మీదికిబ్రాకి మధ్యమనాడిలోగూడా బ్రహ్మరంధ్రము తోకచివరతో గప్పియుండును. గనుక, వాయువు నడిమి నాళమైన సుషుమ్నయందు జొరలేక ఇడపింగళద్వారములను యెక్కుచు దిగుచునుండును. గావున, ఈరెండువాకిళ్లనుమూసి గురుప్రసాదంబున సాధనం బవలంబించి నడిమివాకిలి దెఱవనేర్చినపుడు వాయువు తనవశమై యుండును. నదియే పవనజయ మనంబడు.

ఆసుషుమ్నానాడ్యగ్రమందు సర్వవ్యాపకమైన ఏతేజస్సుగలదో ఆతేజస్సే పరబ్రహ్మమనియు, పరంజ్యోతి యనియు, త్రిమూర్తులనియు, అనేకనామములచే పలుకబడెను. ఆసుషుమ్నానాడియందు అనేకసూర్య చంద్రాగ్నిపరమేశ్వరులును, చరాచరాత్మకమైన ప్రాణులును, చతుర్దశ భువనములును, అష్టదిక్పాలును, వారణాశి మొదలయిన క్షేత్రములును, సప్తద్వీపములును, గంగాదినదులును, నాలుగువేదములును, మీమాంసాది శాస్త్రములును, చతుష్షష్టికళలును, వర్ణములును, అకారాదిస్వరములు ను

గాయత్ర్యాదిమంత్రములును, అష్టాదశపురాణములును, నాగాదివాయువులును, సత్వాదిగుణములును బీజములును, క్షేత్రజ్ఞులయిన జీవులును, ఈచెప్పబడిన సర్వంబును సుషుమ్నానాడి మధ్యగతంబైయుండు. గనుక, సకలజగములకును ఆసుషుమ్నానాడియే కారణభూతమని పెద్దలుబలుకుదురు.

డెబ్బదిరెండువేలనాడులును సూక్ష్మరంధ్రములు గలిగియుండును. వాయు వారంధ్రములవెంట సూక్ష్మముగా నడుచుచుండును. గనుక, ఆ రంధ్రము లన్నియు మూసి సుషుమ్నానాడిమార్గమున వాయువు నెక్కించినవారికి మోక్షము కరతలామలకమని తెలియవలెను.

### 31. ఇంద్రియద్రుశ్యనిరూపణము.

శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు అనగా శబ్దాదివిషయములు ఐదును శ్రోత్రాదికరణములకు ద్రుశ్యమాను. శ్రోత్రాదికరణములయిదును మనోబుద్ధ్యహంకారములకు ద్రుశ్యమాను. మనోబుద్ధ్యహంకారములకు ద్రుగ్రూపబ్రహ్మ మద్రుశ్యమగుగాని ద్రుశ్యము గాదని తెలియుటే ఈవిచారమునకు ఫలము.

### 32. జరామరణజననావస్థలనిరూపణము.

#### అందు జరావస్థలక్షణము.

లోకమందు సకలజనులును సుఖమునకు హేతువగు మార్గమును దొరకనందుచేత మహాదుఃఖములను బొందుచుందురు. అది యెటువలెననిన, అసత్యములయిన గృహక్షేత్రపశుధనదారాపుత్రాదివస్తువులు సత్యమని నమ్మి వానియొక్క సంరక్షణ విషయమై పదార్థంబులు బొందగోరి నానాదుఃఖంబుల బొందుచు సంసారమోహంబుచే తా ననుభవించెడి దుఃఖములే సుఖముగా దలపోసి తాము సంపాదించిన ద్రవ్యముచేత పరులకు నిరంతరమును కుచ్ఛితబుద్ధిచేత హింసలుజేయుచు మిక్కిలి మూఢచిత్తుడై దారాపుత్రాదుల పోషించుచు వారల భుక్తిశేషంబు భుజింపుచు బహుశ్రమలం బొందుచుండు. నంతట వృద్ధాప్యంబు ప్రాప్తించిన బలిమిజాలక బుద్ధిహీనుడై క్రియారహితుడై వృథాప్రయత్నంబులు సేయుచు దారిద్రుడై కార్పణ్యమున జరిగించుచుండగా జూచి వానిభార్యాపుత్రాదులు తమమనస్సులలో వీడు మిక్కిలిఅశక్తుడు, పోషింపలేడని యెగ్గింతురు. మరియును, తాను పోషించినవారలచే పోషింపంబడుచు ముదిమి మిక్కిలి

బాధబెట్టుచుండ బెడరూపుదాల్చి బంధువు లధైర్యపడగా మరణమున కభిముఖుఁడై యిల్లువెడలజాలక శునకమురీతిగా గుడుచుచు మిక్కిలి రోగపీడితుఁడై జఠరాగ్నిమంద మైనందువలన సూక్ష్మాశనుఁడై వాతకఫములచేత గప్పబడిన కంఠనాళాదు లందు ఘురఘుర మను శబ్దంబుదోరుగగా బంధువులమధ్యను శయనించి బహువిధంబులం బిలిచిన పలుకలేక కాలపాశవశుఁడై దారాపుత్రాదుల నెవరుపోషింతురనేచింతచేత వికలేంద్రియుఁడై జ్ఞానహీనుఁడైయుండు నంతట మరణావస్థప్రాప్తించు నదెట్లనిన,

### మరణావస్థలక్షణము.

మరణావస్థంబొందుసమయంబున నతిభయంకరాకారులును, నరభక్షకులు నగు యమదూత లిద్దరు దనముందర నిలిచినం జూచి త్రస్తహృదయుఁడై మలమూత్రంబులు విడుచుచు యమపాశంబులచే బద్ధుఁడై శరీరంబువలన నిర్గమించి యంత నాశరీరం బవలంబించి బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమంబగు మార్గంబునుబొంది రాజభటులచే నీయమానుండగుచు దండంబున కభిముఖుండై చను. నపరాధిచందంబునజనుచుండి అనయంబును మూర్ఛబొందుచు శునకావళిచేతఁ భక్ష్యమాణుండై కాలకింకర భయంకర తర్జనగర్జనంబునం మనంబుగలంగ దేహమంతయు గంప మొందగా పూర్వజన్మ పాపకర్మ సముదాయము చిత్తములో దలచుచు అతిశయంబయిన క్షుత్తృష్ణలులోపలఁ బాధింప చండభానుప్రదీప్తంబయిన వాలుకామార్గంబునంబొంది తప్యమానగాత్రుండై వీపు కశలచే నడువంబడి వికలాంగుం డగుచు మార్గంబునం దచటనచట మూర్ఛలంబొందుచు ఆశ్రయశూన్యమైన నీళ్ళలో మునుగుచు లేచుచు పాపరూపంబగు తపములచే నిరూఢుం డగుచు తొంబదితొమ్మిదివేలయోజనముల దూరంబుగల యమనగరంబునకు మహాపాపాత్ముండైనవాఁడు ముహూర్తత్రయకాలంబునను, సామాన్యదోషియగువాఁడు ద్విముహూర్తంబున నేగి యాతనలంబొందు. నందు యమదూతలు తప్తతోయంబుల ముంచుచు గదలతో మొత్తుచు పెనుమంటల కడ్డంబుగా నెత్తుచు ఏనుగులచే ద్రొక్కించుచు పాములచే గఱపించుచు రౌరవాదినరకంబుల మహాబాధలం బెట్టుచుందు రదెట్లనిన,

### నరకభేదములు.

యమలోకమందు పితృపతియగు శమనుండు పాపకర్మంబులు

జనుభవించు జంతువులకర్మంబులకుం దగినఫలంబులనిచ్చి శిక్షించుచుండు. నందు దమిస్రంబు, నంధతామిస్రంబు, రౌరవంబును, మహారౌరవంబును, కుంభీపాకంబును, కాలసూత్రంబును, నశిపత్రవనంబును, సూకరముఖం బును, నంధకూపంబును, క్రిమిభోజనంబును,సందంశమును, తప్తోర్మియును, వజ్రకంటకశాల్మలియు, వైతరణియు, బూయోదయు, ప్రాణరోధయు, విశసనంబును, లాలాభక్షమును, సారమేయాదనంబు,నావీచీరయంబును, శేతఃపానంబు నను యేకవింశతి మహానరకంబులును, క్షారకర్దమంబును, రక్షోగణభోజనంబును, శూలప్రోతంబును, దందశూకంబును, నవటనిరో ధంబును, పర్యావర్తనంబును, సూచీముఖంబును నను సప్తవిధనరకం బులతోఁగూడి యష్టావింశతినరకంబులుగల పదికొండదు నుడువుదురందు,

యాతనాభేదములు.

1. పరపుత్రకళత్రముల నపహరించిన పాపాత్ముని దామిస్రనరకం బునంవైచి దుష్కరమైన పాశబద్ధునిజేసి అన్నంబునిడక సద్రిపాతనదండ తాడన తర్జనాదిబాధలంబెట్టుచుండ భయంబునొంది మూర్ఛలంబొందు చుండును.

2. పురుషుం డుండగా నతనికి తెలియకుండా పరకాంతను బొందు నట్టి పాపాత్మునిబట్టి యమదూతలు అంధతామిస్ర మనె నరకములోవేసి బాధింపుచుందురు.

3. యవ్వాడేనియు కుటుంబపోషణార్థంబు పరులకుద్రోహంబుజేసిన వానిరౌరవనరకంబునందు బడవైచి యాతనలు బెట్టుచుందురు.

4. యవ్వాం డిహలోకంబునందు స్వేచ్ఛావిహారంబున నంచరిం చుచు పరోపద్రవపరాఙ్ముఖులైయుండు పశుపక్షిమృగాదుల హింసించు చుండునో నట్టివాని రౌరవ మహారౌరవ నరకంబులందు తొల్లి తనచేత బాధలంబొందిన ఆయామృగాదులు సర్పాదులకన్న నతిక్రూర మైన విష జంతువులరూపములు దాల్చి నానావిధంబుల యాతనలం బెట్టుచుందురు.

5. యవ్వాడేనియు దేహపోషణార్థంబు మూషకాదులబిల నిరో ధంబుజేసి వధించునో నాపాపాత్ముని కుంభీపాక నరకంబులయందు గల తప్తతైలంబులందువైచి ననేకబాధలం బొందింతురు,

6. తల్లిదండ్రులకును బ్రాహ్మణులకును విరోధంబుజేసిన పాప కర్ముని కాలసూత్రంబను తీవ్రనరకంబునందు పదివేలయోజనము వెడల్పు

గల విశాలపాత్రాదులందు కింద అగ్నిహోత్రమును, మీఁదనూన్యంబును మిక్కిలి మండుచుండఁగా బడద్రోచిన ఆకలిదప్పులచే మిక్కిలి శ్రమ నొందుచు పరువులిడినను, పడియున్నను, కదలకున్నను విడువక పశురోమముల లెక్కనపరిమితసంవత్సరంబులు బాధింపుచుందురు.

7. వేదమార్గంబువిడిచి పాషండమార్గము లాచరించు పురుషుని నశిపత్రవనంబునందు యమకింకరులు తరట్లనడుచుచు బరిహరింపుచు దోలునెడ నాయశిపత్రంబు లిరుగెలంకుల ద్రెంచుచుండ నడుగడుగున మొరబెట్టుచుండును.

8. దండింపందగని సత్పురుషులనున్న, బ్రాహ్మణులనున్న దండించిన దుర్మతులను యమదూతలు కాలసూత్రనరకమునందు దండింపుచుందురు.

9. నెవ్వఁడేనియు నీశ్వరకల్పితవృత్తిగల జంతువుల హింసించునో నట్టివాని నంధకూపంబను నరకంబున బడవైచిన నందు నతండు తొల్లి తాను జేసిన భూతద్రోహంబున నచ్చట వివిధక్రూర పక్షి మృగ పశుసర్ప మశక మత్కుణ మక్షికాదులచేత హింసబొందుచు మహాంధకారంబునందు నిద్రానుభవ మసుఖలేశంబును లేక కుశరీరంబునం దులజీవుండునుం బోలె మృతప్రాయుండైయుండును.

10. యవ్వఁడేనియు తనకలిమి బాంధవులతోడంగూడి తినక తాను పాయసంబుభక్షించినట్లు భక్షించునో నట్టివాఁడు క్రిమిభోజనమనియెడి నరకంబునంబడి క్రిములే కూడుగా గుడుచుచు తానున్న క్రియునై లక్షయోజనపరిమాణముగల క్రిమిగుండమందు నాటికొనియుండును

11. బ్రాహ్మణులసొమ్ము దొంగిలించిన పాపాత్ముని అగ్నివర్ణంబులగు యినపముద్దలతో అగ్నితప్తంబులైన శూలంబులతో నతనిశరీరంబు దివియుచుందురు.

12. మదనాతురులగుచు స్త్రీపురుషు లగమ్యాగమనంబుచేసిరేని నట్టివారిని యమలోకంబున నతితీక్ష్ణకశాతాడితులంజేసి అగ్నిమయంబులయిన యుక్కుప్రతిమల నాలింగనంబు సేయింతురు.

13. సకలజంతుజాలసంగమ మొందెడువానింబట్టి వజ్రకంటకములు గలిగినట్టి శాల్మలీతరువులందుజేర్చి యాతనలం బెట్టుచుందురు.

14. పాషండమతము నాశ్రయించి ధర్మమార్గంబు విడిచిన పాప

కర్మునివైతరణీనదిలో బడవైచిన నావైతరణీనదియందు నతనిజలగ్రాహం
బులు దిగిచి భక్షింప ప్రాణంబులునిర్గమింప దనపాపంబు లుచ్చరించుచు
మల మూత్ర పూయ శోణిత కేశ నఖాస్థి మేదోమాంస వసావాహినియగు
నందు తప్తుం డగుచు నుండును.

15. విప్రుండు శూద్రకామినులం బొంది శౌచాచారంబులం బాసి
గతలజ్జుండై చరియించెనేని నతండు నరకంబునం బొంది యందు బూయ
విణ్మూత్రలాలాశ్లేష్మపూర్ణార్ణవంబునందు ద్రోయంబడి నతి భీభత్సంబు
లగు నాద్రవ్యంబుల భక్షింపుచుండును.

16. శునకముల బెంచి వేటసల్పి మృగములు హింసించినవాని
అస్త్రములచే మర్దింపుచుందురు.

17. ద్రవ్యలోభమున దంభార్థులై పశువులను జంపి యజ్ఞములు
జేసినపాపాత్ముల యమదూతలు నిరంతరంబు కత్తులతో గోయుచుందురు.

18. కామమోహితుండై తనభార్యచేత రేతఃపానంబు జేయించిన
పాపాత్ముని రేతోహ్రదంబునందోచి నా రేతంబునే పానంబు సేయింతురు.

19. రాజపుత్రు లయినను చోరు లయినను ధనికులగ్రామంబుపై
గృహదాహంబు చేసినవారలను విషాదులవలన మనుష్యుల జంపెడువారలను
వజ్రదంష్ట్రలుగల ఏడునూటఇరువదికుక్కలు యెడతెగక దిగిచి భక్షింపు
చుందురు.

20. లంచముతీసుకొని అబద్ధపుసాక్షి బలికినవాని మహావీచి యనే
నరకమందు నూరుయోజనములు పొడవు గల పర్వతశిఖరముపై నుంచి
తలక్రిందుగా బడద్రోచిన బొబ్బలు బెట్టుచు చదునైన రాతిమీదపడును.
అంతట నతనిదేహంబు బగిలి పెక్కుతునకలై పాశికూడికొనుచునుండ
దుఃఖపడుచుండుగాని వానికి చావు లేకుండును.

21. తపోదానాదులచే పెద్దల నవమానించునీచులు రౌరకర్దమం
బను నరకంబునంబడి అధోముఖులై యాతనలం బొందుచుందురు.

22. స్త్రీపురుషు లెవ్వరేనియు శరీరరక్షణార్థంబు పశువుల నైనా
మానవులనైనా బలియిచ్చిరేని, వారల నిరయంబునందు యమకింకరులు
సురియలందునిమి తద్రక్తంబుపానంబు సేయించు చుండ పారాడుచుందురు.

23. గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతలంగావించి
హింసించుచు హర్షించుచున్నవారలను నరకంబునందు శూలప్రోతలం

జేసిన క్షుత్పిపాసాపరు లగుచుండ గంక గృధ్రాదులు తీక్షణతుండాగ్రం బులుందిగిచి భక్షించుచుండును.

24. జంతుపీడనంబు గావించెడి పాపాత్ముల దందశూకంబను నరకంబునందు ఐదునేడుముఖంబులుగల సర్పంబులు గరచుచుండును.

25. యెవ్వడు తనయింటికివచ్చినఅతిథిని క్రోధదృష్టితోజూచునో నట్టివాని కండ్లవెంట నిప్పులుప్రకాశించుచున్న కాకులుగ్రద్దలు భక్షింపుచుండును.

26. ధనవంతు డయినవాడు ధర్మోపకారములు జేయకుండెనేని వానియమలోకమందు సూచీముఖ మనే నరకములో ద్రోచి పాశంబులు గట్టి బాధింతురు.

27. దేవాధికారులను, భార్యావర్జితులను, దేవాలయంబున సురతం బొనరించినవారలను అగ్నిగుండములలో బడద్రోతురు.

28. అబద్ధమాడువాని నాలుకగోసివేయుదురు.

29. యుద్ధములోఝడిసి శరణన్న రక్షించని దుష్కర్ముని నిప్పలయేటిలో ద్రోతురు.

30. రుణముదీసుకొని యివ్వక బారద్రోయుదుర్జనుని పురివెంట్లు జుట్టికాల్తురు.

31. రుణధనము రెట్టికి మిగుల దీసుకొనినవాని ఇనుపగుదియలచే మొత్తుదురు.

32. దేవునిసొమ్ము దిన్నవాని కాలేనూనెలో వుడికించి కండలు గోయుచుందురు.

33. నిత్యనైవేద్యవ్రతముబట్టి విడిచినవాని ముండ్లరాసులమీద వేసి బాధింతురు.

34. తాముచేసిన పుణ్యము చెప్పుకొనిన పాపులనోళ్లు గాలగా సీసముగాచి పోతురు.

35. సర్వదినముల స్త్రీలతోగూడిన ఘృతఘటంబులలో వ్రేల్చుచుందురు.

36. బ్రాహ్మణస్త్రీలచెరబెట్టి చెరిచిన పాపాత్ముల కొరతవేసెదరు.

37. ధర్మముతప్పజేప్పిన దుర్మార్గులను నీళ్లులేనిబావిలో బడవైచి బాధింతురు.

38. తనమొగనిగానకుండా పరపురుషునితో రతిసలిపిన స్త్రీని మాంసము చెండి వైతురు.

39. కన్యావిక్రయులను అశిపత్రవనంబులందును యమదూతలు నిరంతరంబును బాధింపుచుందురు.

40. గురుతల్పగులను దారుయంత్రములయందును యమదూతలు నిరంతరంబును బాధింపుచుందురు.

41. విశ్వాసఘాతకులను కాలసూత్రనరకమునందును యమదూతలు నిరంతరంబును బాధింపుచుందురు.

42. పంక్తిభేదము జేసిన పాపాత్ములనోటిలో నిప్పులు బోసెదరు.

43. తల్లిని, చెలియలిని, గోవును తన్నిననరుని కాళ్లునరికివైతురు.

44. ఉదకసమీపమందు మాటుబెట్టి మృగాదులజంపినవాని కుదియగట్టి యండలో ద్రోయుదురు.

45. ఉపకారము మరచిన ఖలుని పొడవైనవృక్షశాఖను వ్రేలగట్టి బాధింతురు.

46. విష్ణుభక్తులైయుండి శంకరునున్ను, శంకరభక్తులై యుండి విష్ణువునున్ను నిందించినవారిని రాళ్ళతో వైచి యాతనలు బెట్టుచుందురు.

47. ఫలవృక్షములు నరికినవారిని పర్వతశృంగములయందునిచి బాధబెట్టుదురు.

48. తటాకములు దెగగొట్టినవారిని పర్వతశృంగములయందునిచి బాధబెట్టుదురు.

49. అధిపతివద్దవుండి సజ్జనుల నవమానించి వారియిావులుదప్పించిన పాపాత్ములశరీరము తిత్తితీసి బాధింపుచుందురు.

50. అన్నమున్ను వేదమున్ను వెలకు అమ్మినట్టి దుర్మార్గులనోట కొత్తనున్న మెత్తి బాధింతురు.

51. ఆవులదొడ్డిదున్నినవాని శరీరము అనేకరంధ్రములు బడునట్లు శూలముతో గ్రుచ్చెదరు.

52. ఆవులను నీళ్లుమేత తప్పించి బందెబెట్టినవాని గానుగలో వేసి చిదుముదురు.

53. అగ్రజునికన్న ముందర వివాహము జేసుకొనినవాని కఠినశిలల మీాద ఈడ్చెదరు.

54. పెనిమిటితోచిత్యు రకనట్టిస్త్రీని అగ్నిగుండములోబడవైతురు.

55. చోరులసేవి వారివలన జీవించువాని అంధతామిశ్రములో బడవైతురు.

56. పరస్త్రీనిగోరి చూచినవాని నేత్రములు దీసెదరు.

57. పరస్త్రీముఖము చుంబనముజేసినవాని వక్త్రమున కొఱ్ఱదిమెదరు.

58. పరస్త్రీని కౌగలించుకొనినవానిశరీరము తిత్తొలిచెదరు.

59. పరస్త్రీతో సంగమము జేసినవానిగొంతు మొదలంట గోసివేసెదరు.

60. నదులలో తటాకములలో వనంబులలో దేవాలయములు మొదలయినవానిలో మలమూత్రాదులు విడిచినపాపాత్ముని మెద డదరగొట్టుచుందురు.

61. కలకొలది తనపిత్రాదులకు శ్రాద్ధముబెట్టనివాని కారాగృహములం దుంచి బాధింతురు.

ఈప్రకారంబున యమలోకంబునం దనేక నరకంబులు గలవు. అందు యమదూతలు పాపాత్ము లయిన నరుల బహుభంగుల యాతనల బెట్టుచుందురు. లేక, పుణ్యకర్మంబు లాచరించినవార లయిన స్వర్గాది భోగంబులం బొందెద రదెట్లనిన,

పుణ్యకర్మవివేచనము.

హరిహరహిరణ్యగర్భాదిదేవతుల నుపాశించువారును, ప్రాణాయామాదియోగంబులాచరించువారును, రాజసూయాద్యియజ్ఞములు జేసినవారలును, కృచ్ఛ్రాదితపస్సులు జేసినవారును, గాయత్ర్యాదిమంత్రములు జపించినవారలును, వైష్ణవాదిమతములు ప్రారంభించి చేసినవారును, ద్వాదశ్యాదివ్రతములుచేసినవారలును, అన్నదానాదిదానములు జేసినవారును, గంగాదిపుణ్యతీర్థావగాహనులయినవారును, వారణాశిమొదలయిన పుణ్యక్షేత్రముల కేగువారును, నిందు సప్తసంఖ్యాప్రకరణములో 15 విషయమందు దెలుపబడిన సప్తసంతానంబులు గలవారలును, పరోపకారంబు సేయువారును, గురుదేవతాబ్రాహ్మణప్రాజ్ఞపూజాపరులును, అన్యాకాంతా విముఖులును, శౌచాచారాదిసద్గుణసంపన్నులును వీర లాదిగా గలవార లందరును దేవదూతలచే నాహూయమానులై పుష్పరథములనెక్కి తమ

తమ కర్మానుసారమైన లోకములకేగి అందు బహుకాలంబును స్రక్చందనాదిసమస్తసుఖము లనుభవించి క్షీణపుణ్యులై మఱల బ్రాహ్మణాది ఉత్తముల ఇండ్లలో జన్మింతు రని బుధులు వచింపుచుందురు. నదెట్లనిన,

జననావస్థలక్షణము.

జీవుండు తత్ పాపపుణ్యావశేషంబున మనుష్యాదిజన్మంబు లెత్తుటకై నరక స్వర్గ విముక్తి బొంది కొంతకాలంబు ఆకాశవీథినం దిరుగుచుండి నంతట చంద్రమండలంబుజొచ్చి యాచంద్రునియొక్క హిమంబునకు నోర్వలేక దుఃఖింపుచునుండి మఱికొంతకాలంబునకు మంచుబిందువులలో ప్రవేశించి నామంచుకు సహింపలేక శ్రమపడుచుండి అపిమ్మట సూర్యమండలంబు ప్రవేశించి యాసూర్యునివేడిమి సహింపలేక తపించుచుండి అంత కొంతకాలమునకు వర్షములో ప్రవేశించి మేఘమండలద్వారా భూమిమీదంబడి సస్యరూపంబుగా జనియించి పిమ్మట ధాన్యరూపంబు బొందిన నాధాన్యం బన్నమై నాయన్నంబు పురుషునకు భోజ్యంబయిన తద్వారా పురుషునిగర్భంబు జొచ్చును. నాయన్నంబు పురుషునిజఠరాగ్నిచేత పచనమై రసంబగు. నారసంబు 7 రోజులకు రక్తంబగు. నారక్తంబు 7 రోజులకు మాంసం బగు. నామాంసంబు 7 రోజులకు మెదడగు. నామెదడు 7 రోజుల కెముక లగు. నాయెముకలు 7 రోజులకు మజ్జయగు. నామజ్జ 7 రోజులకు శుక్లం బగు. నాశుక్లంబు పురుషుని గర్భంబులో 3 మాసంబు లుండి యంతట నాపురుషుండు నిజస్త్రీసంగమంబు జేయగా, నాస్త్రీగర్భంబు ప్రవేశించి బహుదుఃఖంబు లనుభవించుచుండు.

ఇచ్చట కొందరిమతముగల దదెట్లనిన, స్త్రీలయొక్క ఋతుదినంబు లెరిగి యాఋతుదినములలో సుదినంబున స్త్రీసంగమంబుజేసిన సుపుత్రుండనియును, దుర్దినంబున జేసిన దుర్గుణుడు బుట్టు ననియును, దారిద్ర్యసంపత్తులు మొదలయినవి యిట్లే సంభవించు ననియును కొందరు చెప్పుదురు. మరియును, సూర్యచంద్రనాడులందుగల పంచతత్త్వంబులం దెలిసి సుతత్త్వంబున స్త్రీసంగమంబు జేసిన ధనాదిసుగుణములు గల సుపుత్రుండు బుట్టు ననియును, క్రూరతత్త్వంబులైన దారిద్ర్యాదిదుర్గుణములుగల సుపుత్రుండు బుట్టు ననియును, యిట్లే నవగ్రహములచేత శుభాశుభంబుల బొందు ననియును, నివియన్నియు జననకాలమందును జూడవలయుననియును కొందరు శ్లాఘించి చెప్పినప్పటికిన్ని ఇవియన్నియు పూర్వార్జితకర్మానుసారముగా

తటస్థించునుగాని, పూర్వాకృతకర్మంబు వీని కనుకూలముగా తటస్థించ దనే నిస్సందేహముచేత నావిషయంబులన్నియు నిచ్చట వివరించియుండ లేదు.

పిండోత్పత్తిలక్షణము.

పూర్వోక్తప్రకారంబున శుక్లంబు స్త్రీగర్భంబుజొచ్చి శోణితము తోడంగలసి యేకరాత్రికి చింతపండు గలిపిన ట్లవును. అయిదురాత్రులకు నీళ్ళమీదబొడిచిన బుగ్గవలె నుండును. పదిరోజులకు రేగుబండురీతిగా నండమగు. నెలరోజులకు శిరస్సు యేరుపడు. రెండుమాసములకు కర చరణంబులు గలుగును. మూడుమాసంబులకు గోళ్లును, నవరంధ్రంబు లును, చర్మంబును, యెముకలును, రోమంబులుంబుట్టు. నాలుగునెలలకు సప్తధాతువులు యేర్పడును. నైదునెలలకు తృష్ణాక్షుత్తులు బుట్టు. నారవ మాసంబున తల్లిగర్భంబునందు దక్షిణభాగంబునం దిరుగుచు మాత్రు భుక్తాన్నపానంబులవలన తృప్తిబొందుచు సప్తధాతువులుం గలిగి జంతు సంకీర్ణంబగు విణ్మూత్రగర్తంబునం దిరుగుచు గ్రిమిభక్షితశరీరుండై మూ ర్ఛలంబొందుచు దల్లి భక్షించిన కటుతిక్తోష్ణలవణక్షారామ్లాద్యుల్బణంబు లయిన రసంబులచేత పరితప్తాంగుండై జరాయువున గప్పంబడి బహిప్రదే శంబునందు నాంత్రంబులచేత బద్ధుండై కుక్షియందు శిరంబు మోపికొని పృష్ఠగ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుండగుచు బంజరం బునం దుండు శకుంతంబుచందంబుననుండి దైవకృతంబయిన జ్ఞానంబునం బూర్వజన్మదుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు సుఖ లేశంబునుం బొందక వర్తించు, నంత, నేడవనెలయందు లబ్ధజ్ఞానుండై చేష్టలుంగలిగి విట్క్రిమిసోదరుండై యొకదిక్కుననుండక సంచరించుచు ప్రసూతిమారుతంబులచేత నతివేపితుండగుచు బంధనభూతంబగు సప్త ధాతువులచేత బద్ధుండై కృతాంజలిపుటుండు దీనవదనుండునై జీవుండు దానెవ్వనిచే నుదరంబున వశియింప నియమింపంబడె. నట్టి సర్వేశ్వరుని యిట్లని స్తుతియించు, యెవ్వండు నిష్కారణుండై సర్వకారణుండగు ఈ ప్రపంచం బంతయు నెవ్వనియందు లీనంబైయుండు, నెవ్వండు సర్వజగ ద్రష్టయై వెలుంగు, నట్టియీశ్వరునకు నమస్కరించెద. నస్మదియ్యగర్భ నరక వేదనలంజూచి శాంతినొందించుట కని యనేకప్రకారంబుల నన్ను తింపుచు దీనరక్షకుండయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన

విముక్తునిం జేయు నమ్మహాత్మునకు బ్రత్యుపకారంబు సేయ లేమికి నంజలి మాత్రంబు సేయందగునట్టి జీవుండ నయిన నేను శమదమాదియుక్తంబైన శరీరంబునందు విజ్ఞానదీపాంకురంబునం బురాణపురుషుని వీక్షింతు. మరియును, బహుదుఃఖంబుల కాశ్రయంబైన యీగర్భనరకంబు నేను వెడలి బహిఃప్రదేశంబునకు వచ్చిన నతిశయంబైన దేవమాయావిమోహితుండం గాక, గర్భంబునం దుండు శోకం బపనయించి యాత్మకు సారథి యైన విజ్ఞానంబున తమోరూపమైన సంసారసాగరోత్తారణంబు జేసి యీఆత్మను రక్షించుకొందునని కృతనిశ్చయుండై విజ్ఞానంబుగలిగి జీవుండు గర్భంబున నుండి వెడలజాలక శ్రమలంబొందుచుండ. నంత నవమాసంబులుం గడచి దశమమాసంబు బ్రాప్తంబైన వాని నధోముఖునిం గావించిన నుచ్ఛ్వాసనిశ్వాసంబులు లేక ఘనదుఃఖభాజనుండు విగతజ్ఞానుండు రక్తదిగ్ధాంగుండై నిష్ఠాస్థక్రిమింబోలి నేలంబడి యేడ్చుచుండు. నంతట పూర్వజ్ఞానహీనుండై జడుంబోలియుండి యంతనిజభావనాభిజ్ఞులగు పరులవలన వృద్ధిబొందుచు నభిమతార్థంబులం జెప్పనేరక యనేకకీటసంకులంబైన పర్యంకంబునందు శయానుండై యవయవంబులు కండూయమానంబు లయిన గోకనేరక యాసనోత్థానగమనంబుల నశక్తుండై తనశరీర చర్మంబు మశక మత్కుణ మక్షికాదులు వడవ గ్రీములచే వ్యథంబడు క్రిమికుంబోలి దోధూయమానుండై రోదనంబు జేయుచు విగతజ్ఞానుండై యుండు, నంత శైశవంబున దత్తత్క్రియానుభవంబు గావించి పౌగండవయస్సున దదనురూపంబులగు నధ్యయనాదిదుఃఖంబు లనుభవించి తదనంతరంబ యవ్వనంబు బ్రాప్తంబయిన నభిమతార్థఫలప్రాప్తికి సాహసపూరంబులగు వృథాగ్రహంబులు సేయుచు బంచమహాభూతాదిదేహం బందు బెక్కుమారు లహంకారమమకారంబులం జేయుచు తదర్థంబులైన కర్మంబు లాచరింపుచు సంసారబద్ధుండై దుష్పురుషసంగమంబున శిశ్నోదరపరాయణుండై వర్తింపుచు నజ్ఞానంబునం జేసి వర్థిష్యమాణరోషుండగుచు దత్ఫలంబులగు దుఃఖంబు లనుభవింపుచు గాముకుండై నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తింపుచుండ మరలమరల పూర్వోక్తప్రకారంబునను నాదికాలంబున నుండి యిట్లనంతకాలంబు జరామరణ జననావస్థలం బొందుచు జీవుండు బహుదుఃఖంబు లనుభవించుచుండు.

ఈవిచారమునకు ఫలం బేమనిన, పురుషుండు ఈజరామరణ

జననావస్థలఁబొంది ముక్తుండెట్లగునని యనేకజన్మపుణ్యపరిపాకవిశేషంబువలనను, ఈశ్వరానుగ్రహంబువలనను, పరిశుద్ధహృదయుండు సాధనచతుష్టయ సంపద్విశిష్టుండునై సద్గురుచరణంబు శరణంబు నొంది తత్ప్రసాదలబ్ధాత్మానాత్మవివేకజ్ఞానసహితుండై ముక్తుండగునని తెలియుటే ఈవిచారమునకు ఫలము.

## 33. ప్రణవస్వరూపము.

అకార ఉకార మకారములు మూడునుంగూడి బిందుసహితముగానుండిన నిదియే ప్రణవమనబడును. ఈప్రణవంబు అజపామంత్రైక్యమధ్యంబైన బ్రహ్మవాచకము. అదియెట్లనిన, విసర్గయుక్తంబైన సకారంబును, బిందుయుక్తం బయిన హకారంబునుం గూడి అజప యనదగును. సకారోపరినాదంబును, హకారోపరిబిందువునుం గూడి ప్రణవం బగు. నిదియే అతిరహస్యస్థానంబైన తారకం బనందగు. మండలత్రయమధ్యము ప్రకాశించు పరంజ్యోతియే పరబ్రహ్మం బనంబడు. గాన, నిట్టిప్రణవంబు దివసంబునకు పండ్రెండువేలచొప్పున ముముక్షువు లయినవారు జపించుచుండవలెనని యోగీంద్రులచే జప్పబడును.

## 34. జీవుని గమనాగమన నిరూపణము.

జీవుఁడు యేలోకమునకుబోయినా ఆలోకంబునకు మనస్సుతో నింద్రియముల నారింటినింగొని ఆయింద్రియములద్వారా సుఖదుఃఖముల ననుభవించుచు బోవుచు వచ్చుచుండును. ఆసుఖదుఃఖములకు హేతువయిన కర్మములతోగూడా పువ్వులయందుండు పరిమళము వాయువు యేతీరునగొనిపోవునో ఆతీరుననే జీవుండు కర్మంబుల గొనిపోవును.

ఇందుకు ముఖ్యతాత్పర్య మేమనగా, తనకు నుపాధియైన సూక్ష్మశరీరము నాశ్రయించి యాసూక్ష్మశరీరద్వారా జీవుండు స్వర్గమర్త్యపాతాళలోకంబులు నిజకర్మానుసారంబుగా దిరుగుచు తత్ఫలంబు లయిన సుఖదుఃఖంబు లనుభవించుచుండును. ఈసుఖదుఃఖంబులకు నివృత్తి యెప్పుడువచ్చు ననిన, సద్గురుప్రసాదంబువలన జీవేశ్వరైక్యద్వారాసూక్ష్మశరీరభంగంబుగలిగినప్పుడు సుఖదుఃఖములుదొలగి ముక్తుడగునని వేదాంతసిద్ధాంతము.

## 35. ఆత్మనామములు.

ద్రుక్కు, సంవిత్తు, చిత్తు, జ్ఞప్తి, జ్ఞానము, బోధము, చైతన్యము,

బ్రహ్మము, పక్షాంతరంబున సచ్చిదానందము, అఖండము, పరిపూర్ణము బయలు అను శబ్దంబులు, ఘట కుంభ కలశ శబ్దంబులరీతి యాత్మకు పర్యాయనామంబులై యొప్పుచుండును.

36. మాయానామములు.

అవిద్య, అవ్యక్తము, తమస్సు, సుషుప్తి, ప్రకృతి, పరాప్రకృతి, అపరాప్రకృతి, ప్రధానము, ఆనందము, అజ్ఞానము, ప్రళయము, క్షేత్రము క్షరము, అనాత్మ, దృశ్యము, అసత్తు, జడము, దుఃఖాత్మకము, పంచకోశాత్మకము, శరీరత్రయాత్మకము, సంసారము, మనస్సు, సంకల్పము, సద్వాసనామయము అను నివియన్నియు మాయానామము లని యెఱుంగదగినది.

37. అండాండాదివివరము.

అండాండ మనగా, భూచక్రము. పిండాండ మనగా, స్థావరజంగమాత్మకంబయిన ప్రపంచము. బ్రహ్మాండ మనగా, ఆకాశాదిపంచమహాభూతములు.

38. హంసస్వరూపము.

నాదబిందుకళాతీతమై సచ్చిదానందస్వరూపమై ప్రకాశించు పరమాత్ముడు హకార మనబడును.

దేహేంద్రియాది దృశ్యరూపిణియైన ప్రకృతి సకార మనబడును.

ఈపురుషప్రకృతులు గలసుటయే హకార సకార మధ్య నున్న బిందువు. గనుక, హంస యనబడును.

మరియు, హృదయమందువెళ్ళి ప్రాణుడు నాశికాద్వారముల నుంచి 12 అంగుళముల పరియంతము బయలువచ్చును. ఇది రేచక మన బడును. ఆవచ్చినకాలములో సగముకాలము అచ్చటనే నిలుచును. అది బహిఃకుంభక మనబడును. అదేరీతున లోపలికి 10 అంగుళములపర్యంతము బోవును. అది పూరక మనబడును. అందులో అర్ధకాలం బచ్చట నిలుచును. అది అంతరకుంభక మనంబడును. ఈ రేచక పూరక కుంభకంబులయందు హంసధ్యానంబుజేయు టెట్లనిన, పూరకమున హకారమును రేచకమున సకారంబును, కుంభకంబున బిందువును జేర్చి ధ్యానింపవలె నని యోగీశ్వరులచే జెప్పంబడు.

39. మరణసూచకలక్షణము.

సంవత్సరమాసపక్షముల మొదటిదినముల ప్రాతఃకాలమందు శ్వాస విచారణజేసి మరణకాలము దెలియవలయు. నదెట్లనిన, సంవత్సరమాస

పక్షాదిదినముల ప్రాతఃకాలమందు వారస్వరం బుండిన జయములాభం బులుం గలుగును. లేక, విపరీతంబయిన విపరీతఫలంబు గల్గునని తెలిసేది.

మరియు, సంవత్సరాదిదినమున వాదిస్వరము లేకున్న మూడుసం వత్సరములకు మరణమనియును, రెండుదినములు లేకున్న రెండుసంవత్సర ములకు మరణమనియును, మూడుదినములు లేకున్న వకసంవత్సరం బా యుష్య మనియును. మరియు, ఇడపింగళలో యేనాడియైనను వకరాత్రి పగలు తిరుగకయున్నట్లయితె మూడుసంవత్సరములు ఆయుష్య మనియు, పదిహేనుదినములు రాత్రింబగలు సూర్యనాడి తిరుగక యున్నట్లయితే రెండుసంవత్సరములుఆయుష్యమనియు, మూడురాత్రులు ప్రాణవాయువు ఏకనాసాపుటమందు ప్రవహింపుచుండిన సంవత్సర మాయుష్య మని యును, బహుకాలంబు రాత్రి చంద్రుడును, పగలు సూర్యుడును ప్రవ హించుచుండిన షణ్మాసంబు లాయుష్య మనియును స్వరజ్ఞానవేత్తలచే జప్పంబడును.

40. మరియొకవిధ మరణసూచకలక్షణము.

కంచుపాత్రయందు నీళ్లుబోసి ఆనీళ్లలో సూర్యుని జూడగా, నా సూర్యబింబము దక్షిణమున మొరికి గనుపించిన షణ్మాసంబు లాయుష్య మనియును, పశ్చిమంబున మొరికొగనుపించిన మూడుమాసంబులాయుష్య మనియును, ఉత్తరంబున మొరిక గనుపించిన రెండుమాసంబులాయుష్య మనియును, ఆసూర్యునిమధ్య తెలుప గనుపించిన దశదినంబు లాయుష్య మనియును, ఆసూర్యబింబము ధూమాకృతిగా నాకులంబై గనుపించిన ఆదినంబుననే మరణం బనియును, శోణవర్ణమై కనుపించిన ఘూమునకు మరణంబనియును, శోణవర్ణ మనగా, యర్రకలువవంటివర్ణము. నాసూర్య బింబము గాఢాంధకారమై కనుపించిన తక్షణమే మరణంబు గలుగు నని పండితులచే జప్పంబడును.

ఈవిచారమునకు ఫలం బేమనిన, ఈప్రకారము మరణకాలము దెలిసి ప్రాణములయం దాసక్తిమాని అభ్యాసమువలన నియమించిన ప్రాణవాయువును పరిపక్వకాలంబున బ్రహ్మరంధ్రద్వారమున పెకలించి బ్రహ్మమందు గలయవలయునని తెలియుటే యీవిచారమునకు ఫలము.

41. ఛాయాపురుషలక్షణము.

మనుష్యునియొక్క ఛాయ కంఠమందు దృష్టినిల్పి నిష్కళంక మైన

ఆకాశంబున జూడగా ఛాయాపురుషుడు గానుపించును, నాపురుషుడు కృశమై కానుపించినట్టయితె ధనహాని గలుగును. పీతవర్ణంబుగా నుండె నేని లాభప్రదం బగును. స్థూలముగా నుండెనేని ధనము గలుగును. నీల వర్ణముగా నుండెనేని మరణము గలుగును. మెరుపువర్ణము గలిగెనేని భూమికి ప్రభు వగును. శ్వేతవర్ణముగా నుండెనేని ఆయుర్వృద్ధియగును. ఛాయపురుషుడు శిరహీనముగా గనుపించెనేని పద్మాసనములకు మృతిం చును, ఆపురుషునిమధ్య రంధ్రముగా తెరపగనుపించెనేని భూమికి కరువు వచ్చును. తేజస్సుగా నుండెనేని ధరణియందు సుభిక్షముగలుగును. భుజ హీనముగా గనుపించెనేని తనయులకు మృతిగలుగును. లింగహీనముగా గనుపించెనేని భార్యమృతించు నని బుధవరులచే జప్పంబడు. మరియు, నీఛాయాపురుషుని విడువక దినదినాభ్యాసపూర్వకంబుగా జూచుచుండిన మిక్కిలి సన్నిహితమై పిదప త్రికాలజ్ఞానము తెలియజెప్పు నని కాలజ్ఞాను లచే జప్పంబడు.

42. యోగాభ్యాసనిషిద్ధకాలములు.

మలమూత్రములు విడుచునట్టి కాలమునను, భోజనానంతరకాలము నను యోగాభ్యాసము జేయగూడదని యోగులచే జప్పంబడు.

43. స్వరోదయులక్షణము.

సోమవారము, బుధవారము, శుక్రవారము, గురువారము యీ నాలుగువారములున్ను చంద్రనాడివారము లని చప్పబడును.

ఆదివారము, మంగళవారము, శనివారము యీమూడువారము లున్న సూర్యనాడివారములు లని చప్పబడును.

పక్షాంతరంబున శుక్లపక్షమందు వచ్చెడు గురువారము చంద్ర నాడి దనియును, కృష్ణపక్షమందు వచ్చెడు గురువారము సూర్యనాడి దనిన్ని కొందరు జెప్పుదురు.

ఈప్రకారంబు చంద్రునివారములయందు ప్రాతఃకాలము చంద్ర నాడియును, సూర్యునివారములయందు ప్రాతఃకాలమందు సూర్యనాడి యును ప్రవహించుచుండిన జయమును లాభమును సమస్తశుభములును గలుగును. విపరీతముగా నుండెనేని విపరీతఫలంబు గలుగును.

చంద్రునివారములందు సూర్యనాడియుండిన రిక్తమనియును, చంద్రునివారములయందు చంద్రనాడియుండిన పూర్ణమనియును, సూర్యుని వారములయందు చంద్రనాడి నడిచిన రిక్తమనియున్ను, సూర్యవారముల

యందు సూర్యనాడి నడిచిన పూర్ణమనియును, చంద్రసూర్యనాడుల పూర్ణమందు యేకార్యము ఆరంభించినను సిద్ధియగును.

మరియు, సమస్తశుభకార్యములును, చిరకార్యంబులును, చంద్రపూర్ణమందు సుతత్వంబున నారంభించిన చక్కగా ఫలించు ననియును, శీఘ్రకార్యంబులును, క్రూరకార్యంబులును, సూర్యనాడి పూర్ణమందు నారంభించిన ఫలించు ననియును జప్పబడును.

మరియు, శుక్లపక్షమందు చంద్రునివారములలో చంద్రనాడి నడిచిన విశేషఫలం బనియును, కృష్ణపక్షంబున సూర్యవారములయందు సూర్యనాడి నడిచిన సవిశేషఫలంబని చెప్పబడును.

మరియు, సూర్యచంద్రనాడులకు ప్రత్యేకంబు పంచఘటికాప్రమాణంబులై దివసంబున కరువదిఘడియలు సమాస్తంబగునటుల సూర్యుండు ఆరుపర్యాయంబులును, చంద్రు డారుపర్యాయంబులును దిరుగుచుండెదరు, తన్మధ్యంబున పంచతత్వంబులు ఉదయాదిక్రమంబుగా మొకట ఆకాశతత్వంబును, రెండవది వాయుతత్వంబును, తదుపరి అగ్నితత్వంబును, ఆవెనుక పృధివితత్వంబును, కడపట నుదకతత్వంబును, సూర్యచంద్రనాడులలో సమంబుగా చరియించుచుండు, తన్నాడీఘటిక పంచకంబు సంపూర్ణ మగునటుల ఘడియన్నర పృధివితత్వంబును, ఘడియంబాతిక నుదకతత్వంబును, ఘడియ వహ్నితత్వంబును, ముప్పాతిక వాయుతత్వంబును, అరఘడియ గగనతత్వంబును రేయింబగ లిచొప్పున చరియించుచుండును. ఈనియమంబు శుద్ధచిత్తు లయిన తత్వవేత్తలకుగాని ఇతరులకు వ్యత్యస్తంబుగా బ్రవర్తింపుచుండు నని యోగీంద్రులచే జప్పంబడు.

## 44. సంసారారణ్యస్వరూపము.

మూలప్రకృతియాలవాలంబును, సుఖదుఃఖంబులు, ఫలంబులు, త్రిగుణంబులు, మూలంబులు, ధర్మార్థకామమోక్షంబులు, రసంబులు, పంచేంద్రియంబు లూడలు, షడూర్ములు, స్వభావంబులు, సప్తధాతువు పొరలు, నష్టప్రకృతులు, విటపంబులు, నవరంధ్రంబులు, కోటరంబులు, దశవిధప్రాణంబులు, పత్రంబులు, శబ్దాదివిషయంబులు, పల్లవంబులు, రాగద్వేషంబులు, శాఖలు, నానావిధకర్మంబులు, పుష్పంబులు, జీవేశ్వరులుగా గలిగి మందిరారామక్షేత్ర పుత్రమిత్ర కళత్ర బంధు మధ్యస్థద్వేష్యజన తీక్ష్ణదుష్కంటక తరుగుల్మలతాసంకీర్ణంబును, గానూదిచోర

దున్సంచారంబును, జరాపిశాచసమన్వితంబును, రోగవ్యాఘ్రభయంకరంబును, దుఃఖదావానలసమావృతంబును, మృత్యుసింహభయగ్రస్తంబును, దైన్యసంకటపర్వంతంబును, దురితరాక్షసఘోరంబును, దృష్ణాభీకకాకోదరసమాకులంబును, హర్షమర్షఝంఝానిలదూషితంబును, స్వర్గనరకదుర్గతిరోహితాపవర్గసన్మార్గంబును నైన మహాదుఃఖారణ్యంబునం గాడుపడి పుణ్యాపాపవిధేయుండై జీవుండంతటతిరిగి చీకాకుపడి యచ్చోట విశ్రాంతిగానక బిళిపి ముందరగాంచి అనంతం బనియును, వెనుకజూచిన నాదిననియు గలయంగసుంగొని యసాధ్యంబనియునుం దెలసి మహాగాధదుఃఖభయశోకవ్యాకులచిత్తుండును, దాపత్రయాగ్నిత్యప్రదీప్తానలసంతప్తుండు నైయుండును.

ఇట్లుండు మనుష్యులకు బంధమోక్షణం బెట్లనిన, నంతట పూర్వాకృతవిశేషంబున నితాంతాగమశాస్త్రాయల నాశ్రయించి స్రక్చందనవనితాధనధాన్యపశుసుతాసనశయ్యానికేతనోద్యానప్రముఖవిషయసంపాదన సాధనంబు లయిన కృషివాణిజ్యసేవాయాచ్నాది లౌకికకర్మంబులు పరిహరించి సర్వాదిమత్యాంతపరలోకవిషయసుఖసాధనంబు లైన నిత్యనైమిత్తికాదికర్మంబులు ఫలకాంక్షచేతజేయక పరమేశ్వరార్పణంబుగానొనరించి యప్పరమేశ్వరానుగ్రహంబువలన పరిశుద్ధస్వాదయుండై యమానిత్వాదివింశతిగుణంబులు యెప్పుడుసంగ్రహించునో నప్పుడు ఆత్మబ్రహ్మైక్యసాక్షాత్కారవిచారాధికారి యగునని విజ్ఞానసంపన్ను లయిన యోగీంద్రులచే జప్పంబడును.

45. ప్రాయశ్చిత్తవిశేషములు.

బ్రహ్మహత్యాపాతకమునకు కర్మంబు దెలుపుచు కపాలంబున నన్నంబు భిక్షమెత్తి యాయన్నంబు వంటిపూట భుజింపుచు ఖట్వాంగచిహ్నము బ్రహ్మచర్యమును గలిగి స్తండిలశాయియై పండ్రెండుసంవత్సరములు వ్రతవృత్తినడిపిన బ్రహ్మహత్యాపాతకము నశించును. లేక, ఆరుసంవత్సరములకు కృచ్ఛ్రములుజేసిన బ్రహ్మహత్యాపాతకములు నశించును. కృచ్ఛ్ర మనగా, మూడుదినములు పగలు భోజనముచేసి మూడుదినములు రాత్రులయందే భోజనముచేసి మూడుదినములుఅడుగకవచ్చిన పదార్థములు భుజించి మూడుదినములు కేవల ముపవాస ముండిన నావ్రతము సాంతపనమనబడును, నిదియే కృచ్ఛ్రమనబడును. లేక, మూడు

సంవత్సరములు చాంద్రాయణముజేసిన బ్రహ్మహత్యాపాతకమునశించును. లేక, నొకసంవత్సరము నిష్ఠానిరతిమానసభోజియైనను, లేక, నొక యశ్వమేధయాగము జేసినను బ్రహ్మహత్యాపాతకము నశించును.

బ్రాహ్మణద్రవ్యాపహరణదోషమునకు.

లక్షగోవుల నైనా, నూరుగుఱ్ఱముల నైనా బ్రాహ్మణులకు దానమిచ్చినట్టయితె బ్రాహ్మణధనాపహరణదోషము బోవును.

కల్లుద్రావిన దోషమునకు.

కల్లుఅగ్నివర్ణముగా గాచిత్రాగిన కల్లుత్రాగినదోషమునశించును.

గురుతల్పకదోషమునకు.

అనలప్రదీప్తమై నాయసాంగనాంగంబు నాలింగనంబుజేసిన గురుపత్నీగమనదోషము నశించును. లేక, మేహనముగోసి కరమునధరియించి ఆకాశము జూచుచు జరిగి వచ్చిన గురుతల్పకదోషము నశించును. లేక, గురువునకై రణమున జచ్చిన గురుతల్పకదోషము పోవును.

అనృతదోషమునకు.

యెవనితో నబద్ధమాడునో నామనుజుని మరల సంతోషపెట్టిన అనృతము లాడినదోషము నశించును.

గురువును ధిక్కరించినద్రోహమునకు.

గురువునకు మాఱుబలికినదోషము మఱల నాగురువును శుశ్రూషాదులచే సంతోషింపజేసిన గురువునకు మాఱుబల్కినదోషము నశించును.

పరస్త్రీగమనదోషమునకు.

నొకసంవత్సరము మిక్కిలి నియతుడై కృచ్ఛ్రములు నాచరించిన పరదారాగమనదోషము నశించును.

వావిగానిస్త్రీతోగూడినదోషమునకు.

ఆరుమాసములు తడివస్త్రము గట్టుకొని భస్మశయనుడై నియమవ్రతుడైయుండిన వావిగానిస్త్రీతోగూడినదోషము నశించును.

పరపురుషసంగమదోషమునకు.

కంచుభస్మమునశుద్ధిఅయినట్లుగా పరపురుషసంగమము జేసినసతి రజస్వలయై శుద్ధిబొందును.

సమస్తదోషమునకు.

మితభోజియై విజనస్థలంబున సావిత్రీమంత్రజపంబుజేయుచునరహా

స్థితుడై రాత్రిగూర్చుండుచున్న సమస్తదోషములు నశించును.

ఈవిచారమునకు ఫలం బేమనిన, భగవన్నామస్మరణ జేసినను, లేక, ప్రాణాయామాదియోగములు జేసినను, లేక, నాత్మానాత్మవిచారణ గలిగియుండినను నతిసులభంబుగా సమస్తదోషంబులు నశించునని తెలియుటే ఫలము.

### 46. సంకల్పాదివర్జనక్రమము.

సంకల్పవర్జనంబున కామంబును, కామవర్జనంబున క్రోధంబును, నర్థానర్థదర్శనంబున లోభంబును, అద్వైతానుసంధానంబునభయంబును, ఆత్మానాత్మవివేకంబున శోకమోహంబులును, సాత్త్వికసేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛ లేమిహింసయు, హితాచరణంబున భూతంబయిన దుఃఖంబును, సమాధిబలంబున దైవికవ్యథయును, ప్రాణాయామాదికంబున మన్మథవ్యథయును, సాత్త్వికాహారంబుల నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబును, గురుభజనకుశలుండై శీలంబున జయింపవలయు.

సంకల్పాదులు వర్జించినందువలన, కామాదులు వర్జితంబులగునని తెలిసి తత్క్రమం బాచరించిన ననాయాసంబుగా పరతత్త్వసాక్షాత్కారం బగునని బుధులు వచింపుచుందురు.

### 47. యోగభ్రష్టునిలక్షణము.

నిశ్చలమైన మనస్సుతోనున్ను, భక్తితోనున్ను, సమాధిజసంస్కారజనిత చిత్తస్థైర్యలక్షణ మైన యోగబలముతోనున్ను కూడినవాడై భ్రూమధ్యమందు ప్రాణవాయువును లెస్సగా ప్రవేశింపజేసి పరమాత్మును యెవ్వడు స్మరింపుచుండునో నతడు యోగి యనంబడు. అట్టియోగి దైవికమువలన యోగసిద్ధినిబొందక చెడినవాడైనను, ఆయోగభ్రష్టునకు ఇహపరలోకములయందును నాశములేదు, అదియెట్లనిన, శుభమును జేసినవాడొకడును, కుచ్ఛితస్థానముకు బొందక పుణ్యము జేసినవారియొక్క లోకములనుబొంది అనేకసంవత్సరములు సుఖమనుభవించి తదుపరి సదాచారమత్తులైన శ్రీమంతులయొక్క గృహమందు బుట్టుచున్నాడు. అట్లుగా జేని నిశ్చయాత్మకబుద్ధిగలిగిన యోగులయొక్క వంశమందు బుట్టుచున్నాడు. గాన, ఇట్టిజన్మము మిక్కిలి దుర్లభ మైనది. ఆయోగికులమందు పూర్వదేహమందుబుట్టిన బుద్ధితో కూటమినిబొందుచున్నాడు. అపిమ్మట మరల

జ్ఞానసిద్ధినిమిత్తమై ప్రయత్నము చేయుచున్నాడు. పూర్వజన్మాభ్యాసము చేతనే ఆయోగభ్రష్టుడు అవశమనస్కుడయినను విషయములవలన నివర్తింపబడుచున్నాడు. యోగముయొక్క స్వరూపమును తెలియ నిచ్ఛయించినవాడును వేదోక్తకర్మానుష్ఠానఫలమును అతిక్రమించుచున్నాడు. జ్ఞాననిష్ఠుడు ప్రయత్నమువలన యత్నము జేయుచున్నవాడై పిమ్మట పరిశుద్ధము లయిన పాపములు గలవాడై అనేకజన్మసంస్కారమువలన సిద్ధుడయినవాడై ఆపిదప మోక్షగతిని బొందుచున్నాడు. ఇదిసిద్ధము.

## 48. ఆత్మస్థితప్రజ్ఞునిలక్షణము.

యెవడు ధర్మవిధిని సర్వకామంబులునువిడిచి ఆత్మావలోకనముచే సంతుష్టు డగుచునుండునో, నాత డాత్మస్థితప్రజ్ఞు డనంబడు. మరియు, కూర్మము సకలమైన అవయవములను లోపలికి ముడుచునో, ఆప్రకారము ఇంద్రియమనంబులను ఇంద్రియార్థములవలన మరలించునో, నతడు ఆత్మస్థితప్రజ్ఞు డనంబడును. మరియు, అఖిలవిషయానుభవములందును అపేక్షలేనివాడై శుభమునొంది సంతోషింపక నశుభంబునొంది దుఃఖంచకనే మహాత్ముడు మానసేంద్రియంబులను తనయాజ్ఞలో నిలుపుకొని పనులు జేయించునో నతం డాత్మస్థితప్రజ్ఞుం డనంబడు.

## 49. ఆత్మమనసాసంబంధలక్షణము.

ఆత్మస్వరూపమైయుండు సమాధియందు మనంబుగల దనిన, విరోధంబువచ్చు నదెట్లనిన, మనంబు గలిగియుండిన బుద్ధియును, దశేంద్రియంబులును, ప్రాణంబులైదునుజతపడి వశించునవియు నీస్థూలదేహంబునువిడిచియుండవు. గాన, నవియు నుండవలసెను. కారణదేహంబులేని కార్యంబులు లేవు. గాన, కారణదేహమునుండవలసెను. ఈమూడుదేహములనంటి ఆద్యంతములులేని సంసారం బంతయు నుండవలసి వచ్చును. అట్లుండిన సహజామనస్కరాజయోగసమాధి నిరంతరంబు సిద్ధింపదు. అట్లగుటం జేసి సమాధియందు మనంబులేదనిన, నిరంతరంబును సమాధియందు మనంబులయమైయుండి తాను పరమాత్మస్వరూపుడైయుండును గాని, ఇది యాత్మ ఇది యనాత్మ యనెడి యెరుకయును, పునరుత్థానంబును అనుసరించి బోధించునట్టి యాచార్యు లగు గలుగకుండును. గాన, బోధాచార్యులు లేక సాధించిన రాజయోగమునకును, తద్బోధతత్త్వమాఘులకును బాధకంబువచ్చు. ఇవ్విధంబుగాక, జ్ఞానవిజ్ఞానసంపన్న

లైన మహానుభావులు సమాధియందు కొంతతడవుమనోరహితులైయుండి కొండొకసేపునకుమేల్కాని మెలఁగుచు రనిన, పరమపదంబునుంబొందిన వారికి బునరావృత్తిప్రాప్తించు. నట్లయిన మోక్షంబున కనిత్యంబువచ్చు గాన, బహువికల్పసమన్వితం బయిన ఈసంశయంబు నిశ్శేషంబుగా నివర్తించు టెట్లనిన,

మనస్సు జడంబును, దృశ్యంబును, జననవినాశయుక్తంబును, సంశయస్వరూపంబై యుండునది మనంబు గాన, సచ్చిదానందస్వరూపంబును, స్వప్రకాశంబునై యుండునట్టి ఆత్మతో నేమాత్ర మైనను సంబంధము లేదు. నదెట్లనిన, సమాధియందు ఆశేషదృశ్యవృత్తి నిషేధం బొనరింపుచు నీవృత్తిసాక్షికూటస్థచైతన్య సామీప్యంబునకు జనుచుండ. నెప్పు డఖండసచ్చిదానందస్వరూపాత్మసాక్షాత్కారంబగు. నప్పుడు ప్రచండాతపమధ్యనిక్షిప్తకర్పూరదీపంబుభంగి పరిపూర్ణప్రత్యగభిన్నపరబ్రహ్మచైతన్యంబుతో నేకీభూతుండై యానందింపుచుండు. ఇట్లుండు నతండు తన్నుగా గనుంగొనుచు దనకు నభిముఖుండై యుండనింజేసి యమ్మనంబు జడంబు. గావున, నివాతదీపంబుభంగి గదలకయుండియు సంకల్పరూపంబుగాబరిణమింపమింజేసి లేనియట్లుండును.

ఈవిచారంబునకు ఫలం బేమనిన, ఈప్రకారం బాత్మమనస్సంబంధలక్షణం బెఱింగి దృఢనిశ్చయుండగుట యే సహజామనస్కరాజయోగసమాధియనియు, నిదియే జీవన్ముక్తి యని తెలియుట.

### 50. పరమాత్మస్వరూపనిర్ణయము.

1. సచ్చిదానందస్వరూపు డగు పరమాత్ముడు సర్వపరిపూర్ణుం డగుచు నుండిన అంతటను నహ మనవలయు. నట్లనకుండుటకు కారణ మేమనిన, సర్వజగత్పరిపూర్ణుం డగు సూర్యుండు జలము స్వచ్ఛద్రవ్యమగుటచే జలమందుమాత్రముప్రతిబింబించెను గాని అంతటను ప్రతిఫలించ లేదు గాన, అటువలెనే పరమాత్ముడు సర్వపరిపూర్ణుండై యుండినను యచ్చట స్వచ్ఛద్రవ్యమయిన బుద్ధియున్నదో, నచ్చట ప్రతిబింబించి యహ మనుచున్నది గాని, అంతట నహ మన నేరదు.

3. సచ్చిదానందస్వరూపుడగుపరమాత్ముడు పరమానందమయుం డనిన, పరమానందము సుషుప్తియందు గలిగియుండినమాత్రమున నే సుషుప్తిని పరమాత్మయనిచెప్పగూడదు, అదెట్లనిన, పరమానందస్వరూ

పిణి యగు సుషుప్తియందు జ్ఞానంబును నిత్యత్వంబును లేకుండుటవలన పరమాత్మయని చెప్పఁగూడదు. అజ్ఞానమనె చెప్పవలెను.

3. సచ్చిదానందస్వరూపుఁ డగు పరమాత్ముఁడు చిత్స్వరూపుఁడై యుండిన సుషుప్తిసమయంబున చిత్స్వరూపంబు దోపవలెను. నటులదోప దేమనిన, దోపదు. అదెట్లనిన, అగ్నిహోత్రుడున్ను సూర్యుడున్ను నిత్యప్రకాశులై యుండినను క్రమముగా ధూమముచేతనున్ను మేఘముచేత నున్ను గప్పబడిన ప్రకాశులై యెటులదోపరో, అటువలెనే పరమాత్ముఁడు సుషుప్తిచే గప్పబడి దోపబడఁడు.

4. సచ్చిదానందస్వరూపుఁ డయిన పరమాత్ముఁడు సావయవుఁ డని చెప్పఁదా మనిన, దృశ్యపదార్థమంతయు నశించునది. గాన, నిరవయవుఁ డనేచెప్పవలయు. నిరవయవుండై యుండిన శూన్యమనబడునుగదాయనిన యనబడదు. నదెట్లనిన, నిరవయవ మగు నాతపంబు ఉష్ణస్వరూపంబు గలిగియుండుటచేత నెటులశూన్యంబు గాకపోయెనదో, నటువలెనే పరమాత్ముఁడు నిరవయవుఁడై యుండినను చిత్త్వమనే ప్రకాశస్వరూపుఁడై యున్నాఁడు గాన, శూన్యమని చెప్పబడఁడు.

5. సచ్చిదానందస్వరూపుఁడైన పరమాత్ముఁడు కర్మతుం డనిన, పరమాత్ముఁడు సర్వావస్థలయందు నుండువాడు. గనుక, సుప్తమృతమూర్ఛితశరీరములయందును కర్మము జేయబడవలెను. అటులలేదు. గాన, పరమాత్మ కర్మతుండనిచెప్పఁగూడదు. నిష్కర్ముఁడనేచెప్పవలయు. నిష్కర్ముఁడని చెప్పినట్లయితే సమస్తకర్మంబులు దేనిచేత జేయంబడు నని శంఖ గలుగును. తత్పరిహారార్థము, అచేతనములైన శరీరేంద్రియ మనోబుద్ధ్యాదులకు కర్మ జేయుటయందు స్వాతంత్రము చాలదు. చాలినట్లయితె పరమాత్మునితో ప్రయోజనము లేకపోవును. లేక, పోయినబోనిమ్మనుటయుచితంబుగాదు. గాన, శరీరమానసేంద్రియబుద్ధ్యాదులకు స్వాతంత్రియము చాలదు. అట్లయిన కర్మ జేయుటకు గతియేమనిన, సూర్యోదయంబైయుండిన నాసూర్యతేజస్సు నాశ్రయించి సకలజనులును తమతమవిహితకర్మంబుల నెట్లు జేయుచున్నారో, నాసూర్యుం డస్తమించిన సకల కర్మంబుల నెట్లు చాలింపుచున్నారో, అటువలెనే ఆత్మప్రకాశము నాశ్రయించి మనోబుద్ధీంద్రియాదులు తమతమస్వభావకర్మంబులు యభిమానపూర్వకంబుగా జేయుచున్నవి. ఆయాత్మప్రకాశము లేకున్న మనోబుద్ధీంద్రియా

దులకు కర్మజేయుటయందు స్వాతంత్రము గలుగకుండును. అటుల గలుగకుండిన పరమాత్మునకేకదా స్వాతంత్రము గలిగియున్నది. అట్టికర్మస్వాతంత్రుడు నిష్కర్ముం డెట్లగు ననిన, స్వతంత్రుడైన సూర్యునియొక్క తేజస్సునాశ్రయించి సకలజనులును సమస్తకర్మంబులాచరించినప్పటికిని సూర్యుం డెటుల కర్మంబు జేసినవాడుగాడో, అటువలెనే పరమాత్ముడు కర్మజేసినవాడనబడక నిష్కర్ముడనే చెప్పబడును. ఈప్రకారము పరమాత్మస్వరూపంబు గురుముఖంబున నిస్సందేహంబుగా దెలిసికొని యేమహాత్ముండుండునో, నతడే సద్బ్రాహ్మణుం డతడే విద్వాంసుం డతడే దేవేంద్రుం డతడే బ్రహ్మ యతడే విష్ణుం డతడె రుద్రుం డతడెసచ్చిదానందస్వరూపుడైన పరమాత్ముం డని వేదాంతశాస్త్రసిద్ధాంతము, అట్టిమహానుభావుడు సర్వనిషిద్ధంబులుభక్షించినను, సకలదుష్కర్మంబులు జేసినను పాపం బణుమాత్రమైన నంటకుండు. నదెట్లనిన, అగ్నిహోత్రుడు సర్వనిషిద్ధంబులు భక్షించియు నెటులదోషిగాకున్నడో, నటువలెనే దోషిగాడని తెలియుటే విచారమునకు ఫలము.

## 51. వార్తికలక్షణము.

అరువదినాలుగువిద్యలకును అంతమైయుండునది వేదాంతము. అట్టి వేదాంతమునకంతమైయుండునది వార్తికము, ఆవార్తికము యెట్టిదనిన, కేవలగురుసాంప్రదాయ రహస్యమై నిర్వాసన మౌనస్వరూపమై యుండునది వేదాంతమధ్యారోపాపవాదమని తెలియునుగదా, ఆవార్తికము నిధిధ్యాస మేలాగనిన, బ్రహ్మమందు ప్రపంచముగల్పించి తిరుగా లేదనుట గదా అధ్యారోపాపవాదము, బ్రహ్మ మనగా, స్వయంప్రకాశస్వరూపము, ప్రపంచము తమోమయము, గాన, నట్లుకల్పించుట సూర్యునియందు చీకట్లకల్పించి తిరుగా లేదనుకూడునా, కాబట్టి, అధ్యారోపాపవాదములు చేయకూడదు. నిధిధ్యాసమే అనుభవముగా జప్పబడును, మలముపూసికొని కడిగివేయుటకన్న నదిముట్టకుండుట బాగన్నట్లు బ్రహ్మమందు ప్రపంచ మారోపించి లేదనుటకంటె కల్పింప కూరకుండుట మంచిదని వార్తికన్యాయము, మరిన్ని వేదాంతము, ప్రపంచము రజ్జుసర్పభ్రమవంటిదనిగదా సాధించెను, వార్తికం బది సమ్మతింపదు, అదెట్లనిన, దృష్టాంతమందు రజ్జువు బ్రహ్మ మాయెను, సర్పము ప్రపంచమాయెను, ఈపట్ల రజ్జుసర్పభ్రమలరెంటిని నెరిగెడివా రెవరు? అత డెటు

వంటివాడు. అత డెక్కడ నుండును. బ్రహ్మం బనియును, ప్రపంచం బనియును తెలియుటకు నెవ్వరుగలరు. ఆద్రుష్టాంతము దట్లనవచ్చునా, అనేవా కానిమ్ము. రజ్జుసర్పభ్రమలను సమ్మతించెదము. రజ్జువును నెరిగి భ్రమసెనా, యెరుగక భ్రమసెనా. యెరిగితే భ్రమయే లేదు. యెరుగక యుండిన సర్పమనియుండవలెగాని; భ్రమయని చప్పగూడదు. కాబట్టి, యెరిగినను భ్రమలేదు. యెరుగకున్నను భ్రమలేదు. ఇంతియేకాదు. ఇంక నొక్కరహస్యం బున్న దదెట్లనిన, రజ్జువు తనయందు తాను సర్పముగా భ్రమసెనో, అన్యులు భ్రమసిరోయనిన, అన్యులు భ్రమసిరనిగదా చెప్పవలెను. వేదాంతము, బ్రహ్మము తనయందు తాను భ్రమసె నని చెప్పుచున్నది. రజ్జువు, తాను సర్పమని భ్రమసె ననగూడదు. బ్రహ్మము తానె భ్రమసె ననుదృష్టాంతము పట్టనేకూడదు. ఈవరకు చెప్పినది ఏమాయె ననిన, భ్రమ యను శబ్దమే లేదన్నట్లాయెను, వార్త్తికము. సిష్ఠర్చమత్కారమును క్రమముగా జెప్పుచున్నారము. నిత్యనిరంతర నిష్ప్రపంచాద్వయ మార్తాండాఖండైకరసబ్రహ్మంబునందు కాలత్రయమందును, కాలత్రయముతోడ మాయాప్రపంచమను చీకట్లుకలుగజేయగూడదు. కలుగజేసి అదిలేనట్లుగా శ్రవణాదులు కూడదు, అమనస్కంబైన బ్రహ్మమును మననముచేసి యెరుంగుటెట్లు? తానైన బ్రహ్మమును నిధిధ్యాసించుటెట్లు? నిరంతరసమాధిసహజమై యుండగా, నొకప్పుడు సమాధినుండి యనుభవించుటెట్లు? అజ్ఞానముతోగూడా తత్కార్యజీవేశ్వరాదిప్రపంచంబు మిథ్యయనియు, ఆగామిసంచితంబులుమాత్రము పోయిన వనియు ప్రారబ్ధము, దేహావసానపర్యంత ముండునని చెప్పితే సహించుటెట్లు? లేనియాకాశ పుష్పము లేదనియును, లేనివంధ్యకుపుత్రుడు లేడనియును తెలియునట్లుగా శ్రవణ మనన నిధి ధ్యాసలు జేయవలయును. అనగా, సర్వాత్మనా ప్రపంచము పుట్టనేలేదని వార్త్తికాభిప్రాయము.

ఈవిచారమునకు ఫలంబేమనిన, మొదట వేదాంతంబు చక్కగా దెలసి తదుపరి వార్త్తికపద్ధతి యెరుంగవలయు. లేక, వార్త్తికంబె మొదలు నెఱింగినఅజ్ఞానియైచెడును. అదెట్లనిన, వార్త్తికము నిర్వాణసమానముద్రా నిష్టసదాస్వాభావికము. గాన, వేదాంతము ముందుగా నెరింగి పిమ్మట వార్త్తికపద్ధతి నెఱింగిన, నతిసులభంబుగా జీవన్ముక్తిఘటించునని తెలియుటే యీవిచారమునకు ఫలము.

## 52. ఏతగ్గ్రంథసర్వాత్మకఫలము.

ఈవేదాంతశాస్త్రమును పరులకు వంచించుటకై చదివిన నరక ప్రాప్తం బనియును, స్వానుభవముకై చదివిన మోక్షప్రాప్త మనియును, ప్రతిష్ఠకొరకు జదివిన యిహమందు ఐశ్వర్యాదిభోగములును, పరమందు స్వర్గాదిభోగములును, ప్రతిష్ఠసహితము గలుగు ననియును, ఈపుస్తకము వ్రాసినను చదివినను భక్తితో వినినను సచ్చిదానందస్వరూపుడైన శ్రీమన్నారాయణానుగ్రహమువలన ధన కనక వస్తు వాహన పుత్ర పౌత్రాభివృద్ధిగలిగి సుఖయింతురు.

గద్య.

ఇది శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ వర
ప్రసాదలబ్ధ కవితా విలాస సందడి నాగదాస ప్రణీతంబైన
సకల తత్త్వార్థ దర్పణ మను వేదాంతశాస్త్రంబు
నందు ఆత్మానాత్మవివేకాది ఏతత్ గ్రంథ
సర్వాత్మక ఫలమువరకు గల ఏబది
రెండు సంఖ్యలతో గూడిన
తృతీయనిరుక్తము
సంపూర్ణము.

శ్రీ ర స్తు.

అస్మద్గురుభ్యోన్నమః.

శ్రీమ న్నారాయణ సచ్చిదానంద పర బ్రహ్మణేనమః.

# సకలతత్వార్థదర్పణము.

## 1. ప్రణవార్థ విచారము.

"శ్రు॥ అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానంపంచదైవతం । ఓమిత్యేవంనజానాతిబ్రాహ్మణోనభవేత్సహి॥" అనియున్నది. గాన, ప్రణవమందు అకార ఉకార మకారార్థ మాత్రస్వరూపములగు అవిద్యావిద్యానంద తురీయ పాదాత్మకములయిన సమష్టివ్యష్టిస్థూలసూక్ష్మకారణమహాకారణములనెడి అష్టశరీరములయొక్క కార్యములగు జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయము లనెడు నాలు గవస్థలకు బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు నలుగురు నధిదేవత లయిరి. పంచదైవత మనుటవలన అయిదవవాడయిన సదాశివమూర్తికి స్థానములేకపోయెను. గనుక, మండూకాద్యుపనిషత్తులయందు పైనిజెప్పినఅవిద్యాదిపాదములనాలుగింటిని పదియారుభాగములు జేయుటకు హేతువులు గలిగియుండుటవల్ల లోకకలలు పదియైదింటిని మీరిన పదియారవకళల సదాశివమూర్తికి స్థానముగా నేర్పడుచున్నది. గాన, ప్రణవము పదియారుభాగములుగా భాగింపబడెను. వానికి వివరణము. జాగ్రత్తలో జాగ్రత్త 1, జాగ్రత్తలో స్వప్నము 2, జాగ్రత్తలో సుషుప్తి 3, జాగ్రత్తలో తురీయము 4, స్వప్నములో జాగ్రత్త 5, స్వప్నములో స్వప్నము 6, స్వప్నములో సుషుప్తి 7, స్వప్నములో తురీయము 8, సుషుప్తిలో జాగ్రత్త 9, సుషుప్తిలో స్వప్నము 10, సుషుప్తిలో సుషుప్తి 11, సుషుప్తిలోతురీయము 12, తురీయములోజాగ్రత్త 13, తురీయములో స్వప్నము 14, తురీయములో సుషుప్తి 15, తురీయములో తురీయము 16, మఱియు త్రిస్థానమనియుండుటవలన సమష్టివ్యష్టితదుభయచైతన్యైకమత్య బ్రహ్మవేత్తలని యర్థము. గనుక,

1. జీవస్థూలము, జీవజాగ్రత్తు, విశ్వుడు.
2. జీవసూక్ష్మము, జీవస్వప్నము, తైజసుడు.
3. జీవకారణము, జీవసుషుప్తి, ప్రాజ్ఞుడు.
4. జీవమహాకారణము, జీవతురీయము, కూటస్థుడు.

5. ఈశ్వరస్థూలము, ఈశ్వరజాగ్రత్తు, విరాట్టు.
6. ఈశ్వరసూక్ష్మము, ఈశ్వరస్వప్నము, హిరణ్యాగర్భుండు.
7. ఈశ్వరకారణము, ఈశ్వరసుషుప్తి, అవ్యాకృతుండు.
8. ఈశ్వరమహాకారణము, ఈశ్వరతురీయము, పరమాత్మ.

ఈయెనిమిదియు బ్రహ్మప్రణవాంగములు. ఈజీవేశ్వరులకు తత్వమస్యాదిమహావాక్యార్థమందు ఐక్యభావముగల బ్రహ్మవేత్తల కొకస్థానమేర్పడియుండుటవలన త్రిస్థాన మని చెప్పంబడెను. అదియెలాగనిన, జీవేశ్వరులు కించిజ్ఞత్వ సర్వజ్ఞత్వా ద్యభిమానములు గలవారు బ్రహ్మవేత్త నిరభిమాని ప్రారబ్ధక్షయపర్యంతము శరీరములు గలవు. అనంతరము శరీరములేదు. కాబట్టి, జీవేశ్వరస్థానములురెండు బ్రహ్మవేత్తస్థానము ఒకటి యునుగా స్థానములు మూడయ్యెను.

బ్రహ్మవేత్తస్థూలము, బ్రహ్మవేత్తజాగ్రత్తు, ఓత.
బ్రహ్మవేత్తసూక్ష్మము, బ్రహ్మవేత్తస్వప్నము, అనుజ్ఞాత.
బ్రహ్మవేత్తకారణము, బ్రహ్మవేత్తసుషుప్తి, అనుజ్ఞయికరసుడు.
బ్రహ్మవేత్తమహాకారణము, బ్రహ్మవేత్తతురీయము, అవికల్పుడు.

గాన, సమష్టిరూపు డైన యీశ్వరునకును, వ్యష్టిరూపు డైన జీవునకును, సమష్టివ్యష్టిచేత నైక్యమగు బ్రహ్మవేత్తకును, జాగ్రదావస్థయందు అకారమును అవిద్యాపాదమును స్థూలదేహమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు విరాట్టువైశ్వానరుండు వైరాజనుండు అని, జీవునకు విశ్వుండు వ్యావహారికుండు చిదాభాసుండు అని, బ్రహ్మవేత్తకు ఓతయని పేళ్ళగును.

జాగ్రత్తలోజాగ్రత్త—ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు,జాగ్రత్తలోజాగ్రత్త వచ్చునప్పుడు అకారములో అకారమును, అవిద్యాపాదములో అవిద్యా పాదమును, స్థూలదేహమునందు స్థూలదేహమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో విరాట్టు, జీవునకు విశ్వునిలో విశ్వుడు, బ్రహ్మవేత్తకు ఓతప్రోత అని నామములు కలుగును.

జాగ్రత్తలో స్వప్నము—వైమున్వరకును జాగ్రత్తలో స్వప్నము వచ్చునప్పుడు అకారములో ఉకారమును, అవిద్యాపాదములో విద్యా పాదమును, స్థూలశరీరమునందు సూక్ష్మశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో హిరణ్యాగర్భుండని, జీవునకు విశ్వునిలో

తైజసుండని, బ్రహ్మవేత్తకు ఓత్రను జ్ఞాతయని పేళ్ళగును.

జాగ్రత్తలో సుషుప్తి—పైముగ్గురికి జాగ్రత్తలో సుషుప్తి వచ్చునప్పుడు అకారములో మకారమును, అవిద్యాపాదములో ఆనందపాదమును, స్థూలశరీరమునందు కారణశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో అవ్యాకృతుడని, జీవునకు విశ్వునిలో ప్రాజ్ఞుండని, బ్రహ్మవేత్తకు ఓత్రనుజ్ఞయికరసుడని నామములు గలుగును.

జాగ్రత్తలో తురీయము—ఆముగ్గురికిని జాగ్రత్తలో తురీయము వచ్చునప్పుడు అకారములో అర్ధమాత్రయును, అవిద్యాపాదములో తురీయపాదమును, స్థూలశరీరమునందు మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో పరమాత్మయని, జీవునకు విశ్వునిలో కూటస్థుడని, బ్రహ్మవేత్తకు ఓత్రవికల్పుడని పేళ్ళగును.

స్వప్నము. సమష్టిరూపుడైన ఈశ్వరునకును, వ్యష్టిరూపుడైన జీవునకును, సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును, స్వప్నావస్థయందు ఉకారమును, విద్యాపాదమును, సూక్ష్మదేహమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భుడు సూత్రాత్మయని పేళ్లును, జీవునకు తైజసుడు స్వప్నకల్పితుడను పేళ్లును, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతయను పేరుగల్గును.

స్వప్నములో జాగ్రత—ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు స్వప్నములో జాగ్రతవచ్చినప్పుడు ఉకారములో అకారమును, విద్యాపాదములో అవిద్యాపాదమును, సూక్ష్మదేహమందు స్థూలదేహమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భునిలో విరాట్టనియును, జీవునకు తైజసునిలో విశ్వుడనియును, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాత్రోతయనియును పేళ్లుగలుగును.

స్వప్నములో స్వప్నము—మరియు నీముగ్గురకును స్వప్నములో స్వప్నము వచ్చినప్పుడు ఉకారములో ఉకారమును, విద్యాపాదములో విద్యాపాదమును, సూక్ష్మదేహమందు సూక్ష్మదేహమును తారతమ్యములు అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుడు, జీవునకు తైజసునిలో తైజసుడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాత్రానుజ్ఞాత అని పేళ్లుగల్గును.

స్వప్నములో సుషుప్తి—మఱియు నీచెప్పబడిన ముగ్గురికిని స్వప్నములో సుషుప్తివచ్చినపుడు ఉకారములో మకారమును, విద్యాపాదములో ఆనందపాదమును, సూక్ష్మదేహమందు కారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భునిలో అవ్యాకృతుడు, జీవునకు తైజ

సునిలో ప్రాజ్ఞుడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతానుజ్ఞైకరసుడని పేళ్లుగలుగును.

స్వప్నములో తురీయము—వెండియు పైజెప్పబడిన మువ్వురికిని స్వప్నములో తురీయము వచ్చినపుడు ఉకారములో అర్ధమాత్రయును, విద్యాపాదములో తురీయపాదమును, సూక్ష్మదేహమందు మహాకారణ శరీరమును తారతమ్యములు. అప్పుడు యీశ్వరునకు హిరణ్యగర్భునిలో పరమాత్మ, జీవునకు తైజసునిలో కూటస్థుడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతా వికల్పుడు అని పేళ్లు గలుగును.

సుషుప్తి. సమష్టిరూపుడైన ఈశ్వరునకును, వ్యష్టిరూపుడైన జీవునకును, సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకు సుషుప్త్యవస్థయందు మకారమును, ఆనందపాదమును, కారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతుడంతర్యామియను పేళ్లును, జీవునకు ప్రాజ్ఞుడు పారమార్థికుడను పేళ్లును, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసుడను పేరును గల్గును.

సుషుప్తిలో జాగ్రత—మఱి ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు సుషుప్తిలో జాగ్రత వచ్చినపుడు మకారములో అకారమును, ఆనందపాదములో అవిద్యాపాదమును, కారణశరీరములో స్థూలశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో విరాట్టనియు, జీవునకు ప్రాజ్ఞునిలో విశ్వుడనియు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసోత యనియును పేళ్లుగల్గును.

సుషుప్తిలో స్వప్నము—పైముగ్గురికిని సుషుప్తిలో స్వప్నము వచ్చినపుడు మకారములో ఉకారమును, ఆనందపాదములో విద్యాపాదమును, కారణశరీరములో సూక్ష్మశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో హిరణ్యగర్భుడు, జీవునకు ప్రాజ్ఞునిలో తైజసుడు, బ్రహ్మవేత్తలకు అనుజ్ఞైకరసానుజ్ఞాత అని నామములు గలుగును.

సుషుప్తిలో సుషుప్తి—మరియు నీమువ్వురికిని సుషుప్తిలో సుషుప్తి వచ్చినప్పుడు మకారములో మకారమును, ఆనందపాదములో ఆనందపాదమును, కారణశరీరములో కారణశరీరమును తారతమ్యములు. అప్పుడీశ్వరునకు అవ్యాకృతునిలో అవ్యాకృతుడు, జీవునకు ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసానుజ్ఞైకరసుడు అను పేళ్లు గలుగును.

సుషుప్తిలో తురీయము—మరియు పైజెప్పబడిన మువ్వురికిని సుషుప్తిలో తురీయము వచ్చినపుడు మకారములో అర్ధమాత్రయును, ఆనందపాదములో తురీయపాదమును, కారణశరీరములో మహాకారణశరీరమును

తారతమ్యములు. అప్పు డీశ్వరునకు అవ్యాకృతునిలో పరమాత్మ, జీవునకు ప్రాజ్ఞునిలో కూటస్థుడు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞయికరసావికల్పుడు అను నామములు గలుగును.

తురీయము. సమష్టిరూపుడగు నీశ్వరునకును, వ్యష్టిరూపుడగు జీవునకును, సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును తురీయావస్థ వచ్చునపుడు అర్ధమాత్రయును, తురీయపాదమును, మహాకారణశరీరమునుగలుగును. అప్పు డీశ్వరునకు పరమాత్మ యనియును, జీవునకు కూటస్థుడనియు బ్రహ్మవేత్తకు అవికల్పుడనియును పేళ్ళగును.

తురీయములో జాగ్రత—ఈముగ్గురకును తురీయమున జాగ్రత వచ్చునపుడు అర్ధమాత్రములో అకారమును, తురీయపాదమందు అవిద్యాపాదమును, మహాకారణశరీరమందు స్థూలశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు పరమాత్మలో విరాట్టనియు, జీవునకు కూటస్థునిలో విశ్వుడనియు, బ్రహ్మవేత్తకు అవికల్పోతయనియు పేళ్లు.

తురీయములో స్వప్నము—మరి యీముగ్గురకు తురీయములో స్వప్నము వచ్చునప్పుడు అర్ధమాత్రలో ఉకారము, తురీయపాదములో విద్యాపాదము, మహాకారణశరీరములో సూక్ష్మశరీరము తారతమ్యములు. అప్పు డీశ్వరునకు పరమాత్మలో హిరణ్యగర్భు డనియు, జీవునకు కూటస్థునిలో తైజసుడనియును, బ్రహ్మవేత్తకు అవికల్పానుజ్ఞాతయనియును పేళ్లు గలుగును,

తురీయములో సుషుప్తి—పై ముగ్గురికిని తురీయములో సుషుప్తి వచ్చునప్పుడు అర్ధమాత్రలో మకారమును, తురీయపాదములో ఆనందపాదమును, మహాకారణశరీరములో కారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు పరమాత్మలో అవ్యాకృతుడు, జీవునకు కూటస్థునిలో ప్రాజ్ఞుడు, బ్రహ్మవేత్తకు అవికల్పానుజ్ఞయికరసుడు అను నామములుగల్గును.

తురీయములోతురీయము—మరియు నీముగ్గురికిని తురీయములో తురీయము వచ్చునపుడు అర్ధమాత్రలో అర్ధమాత్రయును, తురీయపాదములోతురీయపాదమును, మహాకారణశరీరములో మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు పరమాత్మలో పరమాత్మ, జీవునకు కూటస్థునిలో కూటస్థుడు, బ్రహ్మవేత్తకు అవికల్పావికల్పుడను నామములు గలుగును.

ఇట్లేర్పడిన పదియారవస్థలయందును సమష్టిరూపులైన యీశ్వరులకు సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వాది మహాగుణములును, వ్యష్టిరూపులైన ఆజీవులకు అహంకర్త అహంభోక్త అహంసుఖి అహందుఃఖి అహంపాపి అహందరిద్ర అనునివి మొదలగు స్వల్పగుణములును, బ్రహ్మవేత్త అసర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది గుణములయందు నిరభిమానము గలిగి యదృచ్ఛాలాభసంతుష్టియు పరబ్రహ్మనిష్ఠయు మహాకర్తృత్వము మహాభోగము మహాత్యాగము మొదలగు సుగుణములును గలవారై వెలుంగుదురు. మరియు కార్యమునుబట్టి కారణమును గ్రహింపవలయును. గావున, కార్యములైన జాగ్రతాద్యవస్థలనుబట్టి కారణములైన అకారాది వర్ణమయములును అవిద్యాది పాదమయములును, సమష్టిమయ వ్యష్టిమయ ఏతదుభయైక్య స్వరూపములగు స్థూలాది దేహములును, తద్దేహాంతరవర్తులైన యీశ్వర జీవబ్రహ్మవేత్తలకు గలిగెడు విరాడ్విశ్వోత్రాదీ నామధేయములును, వివరముగా నెరుగుటకై జాగ్రత్స్వప్నసుషుప్తితురీయమిశ్రము లనెడు నవస్థలకు ఉదాహరణములు యీక్రింద వ్రాయబడుచున్నవి.

1. జాగ్రతలో జాగ్రత — గురుసన్నిధానమున శాస్త్రశ్రవణము చేయునప్పుడు అడుగదగిన విషయముల నడిగి తెలిసికొని మనసున మఱపు లేకయుండుట.

2. జాగ్రతలో స్వప్నము — గురువునొద్ద శాస్త్రవిషయములను వినునపుడు పరాకుపడుటచేత ఆవిషయములు జ్ఞాపకముండియు నుండక యుండుట,

3. జాగ్రతలోసుషుప్తి — గురువునొద్ద సద్విషయములనువినవలయునని ప్రారంభించి వినునప్పుడు హెచ్చరికలేమిచే అవి యేవియు బొత్తిగా జ్ఞాపకములేకపోవుట,

4. జాగ్రతలో తురీయము — గురువునొద్ద శాస్త్రశ్రవణము చేయుటచే వస్తుతత్త్వజ్ఞానముగలిగి ఆవస్తువును చింతించుట.

5. స్వప్నములో జాగ్రత — కలగని లేచి తానుకలలో గన్నదాని నెల్ల తప్పక చెప్పుట,

6. స్వప్నములో స్వప్నము — కలగని లేచి అందలివిషయమును మరచియు మరవకయుండుట.

7. స్వప్నములో సుషుప్తి—కలగనిమేలుకొని ఆకలయందు తాను కన్నదంతయు మరచుట.

8. స్వప్నములో తురీయము—కలలో తాను కొండమీదను, యేనుగమీదను నెక్కినట్లును, లక్ష్మీదేవి తన్ను వరించి పొందినట్లును గని లేచి దానిఫలమును విచారించి తనకు రాజ్యాధిపత్యము వచ్చుననియు సంపదగలుగుననియును నెంచక నిదంతయు మనోవ్యాపారముగాని వేరు కాదని నిశ్చయించి బ్రహ్మనిష్ఠవలన చలింపకుండుట.

9. సుషుప్తిలో జాగ్రత—సుఖముగా నిద్రించి లేచి ఆనిద్రాసుఖ మిట్టిదని తెలిసి చెప్పుట.

10. సుషుప్తిలో స్వప్నము—సుఖముగా నిద్రించియు దానివలని సుఖ మెట్టిదో అది తోచియు తోచకయుండుట.

11. సుషుప్తిలో సుషుప్తి—నిదురించి లేచినపిమ్మట దానిసుఖమిట్టి దని తెలియకుండుట.

12. సుషుప్తిలో తురీయము—సుఖముగా నిద్రించియు, ఈనిద్రావస్థ అజ్ఞానవిషయముగాని ప్రజ్ఞానఘనప్రత్యగాత్మనైన నాకువిషయము గాదని తెలియుట.

13. తురీయములో జాగ్రత — బ్రహ్మనిష్ఠయం దుండు నప్పుడు జాగ్రతయందలి వ్యాపారము లైన ఆకలిందప్పులు తోచి ప్రపంచవృత్తి గలుగుట.

14. తురీయములో స్వప్నము—ఆబ్రహ్మనిష్ఠయం దుండునప్పుడు ఆకలిదప్పులుతోచి ప్రపంచవృత్తి కలిగి కలుగకయుండుట.

15. తురీయములో సుషుప్తి—బ్రహ్మనిష్ఠయందు వికల్పమేమియు లేకయుండుట.

16. తురీయములో తురీయము — జాగ్రత్స్వప్నసుషుప్తులవలన గలిగెడిది.

ఈపదియాఱుభేదములును లేక అఖండపరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మము తానేకాని తనకంటె వేరుగాదు, అనెడు వృత్తిభేదమును లేక పరబ్రహ్మమగు తానుతానైయుండుట ఇదే అవికల్పాదివికల్పము.

1. జాగ్రత—మనస్సు దశేంద్రియములతో గూడిన శబ్దాదివిషయములయందు అనుభవము గలిగియుండు జాగ్రదవస్థ.

2. స్వప్నము— జాగ్రత క్రమక్రమముగా క్షీణించి గాఢనిద్రను బొందక ఆజాగ్రతయందలివిషయముల యనుభవముగలిగియుండుటయే.

3. సుషుప్తి— మానసాదిసర్వేంద్రియవ్యాపారశూన్యమైననిద్రావస్థ.

4. తురీయము— చేయుచుగలడనెడి ఆస్తికబుద్ధిగలిగి ప్రమాణముల చేత అసత్తుచిత్తు అను భేదములుగల లౌకికకర్మద్వైతాద్వైతముల కల్పనల విమర్శించి వస్తుజ్ఞానముగలిగియుండుటే తురీయము. ఈనాలుగవస్థలు నొక్కొక్కటి నాలుగేసిభాగములుగ భాగించబడి పదియారవస్థలయ్యెను.

ఈయవస్థలు పదియారింటియందు తమోగుణప్రధానులగువారు తరుపాషాణజలచరక్రిమికీటపక్షిమృగాదులై మూఢవృత్తిగలవారై యుందురు. రజోగుణప్రధానులగువారు ఘోరవృత్తిగలిగి మానుషులై కర్మభక్తిజ్ఞానములలో నొక్కటియైనలేక కుటుంబపోషణాసక్తిగల్గి మనుష్యస్వభావము గలవారై నాస్తికలౌకికు లయియుందురు.

సత్వగుణప్రధానులగువారు శాంతవృత్తిగలిగి బుద్ధిమంతులై పుణ్యకర్మాసక్తియు దేవతాంతరభక్తియు పుణ్యలోకాసురక్తియుగలిగి దేవతాస్వభావముగలవారై యుందురు. గుణసామ్యావస్థగల వివేకులు శుద్ధసత్వసంపన్నులయిన గురూపాసకులై యుందురు. కేవలబ్రహ్మవేత్తలు జాగ్రత మొదలగు పదియారవస్థలు గల ప్రకృతి నతిక్రమించి అవికల్పా వికల్ప పరబ్రహ్మనిష్ఠగలవారై యుందురు. మరి యీపదియారుకళలు త్రిగుణవిభాగములచేత నొకటితో నొకటి కలుసుకొనికూడి యనేకభేదములై పంచదశకలాత్మకమూలాతూలప్రకృతిరూపములై లోకవ్యాపకములై యుండును. పదియారవకళ కేవలసత్తామాత్రమై మూలప్రకృతి కాశ్రయమై స్వయంప్రకాశమానమై యుండును. గనుకనే, "శ్రు॥ అనుభూతింవినా మూఢోవృథా బ్రహ్మణిమోదతే। ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్॥" అని మహావాక్యరత్నావళియందు జెప్పబడియున్నది. కాబట్టి ప్రణవార్థానుభవముగలిగి పదియారవకళయగు తురీయాతీతస్వరూపుడై యానందించువాడే బ్రహ్మవేత్త. ఈవిషయములు బ్రహ్మజ్ఞానవచక్రమున జూడగా కరతలామలకమువలె తెలియును

2. సకలమతస్వరూపనిర్ణయము.

వేదబాహ్యులై దేహమే పరమాత్మ మరణమే మోక్షము అనెడు చార్వాకులును, ఇంద్రియములే పరమాత్మ మరణమే మోక్షము అను

చార్వాకైక దేశికులును, ప్రాణమే పరమాత్మ దానినాశమే మోక్షము అనెడి సౌగతులును, దేహేంద్రియ ప్రాణముల సంకోచవికాసావస్థలు గలవాడే ఆత్మ. నిత్యము పరమాణురూపమునయిన ఆలోకి కాకాశమధ్యమందు క్రమక్రమముగా సంచరించుటే మోక్షము అనెడి జైనులును, బుద్ధియే బ్రహ్మము, సుఖదుఃఖాదిద్వంద్వముల నంటని శుద్ధబుద్ధి గలిగి యుండుటే మోక్షము అనెడు బౌద్ధులును, శూన్యమే ఆత్మ దానియందు గలయుటే మోక్షము అనెడి అద్వైతులును, నీటియందు బుగ్గలుకనుపడినయట్లు శూన్యమందు బహురూపముల తోచునదే యాత్మ. ఆరూపములు వీడి శూన్యమందు గలయుటే మోక్ష మనెడి క్షపణులును, ఆనందమే ఆత్మ. ఆకాశగమనదూరదృష్టి దూరశ్రవణాదిసిద్ధులు గలిగియుండుటే మోక్ష మనెడు రుద్రకాళభైరవయామళులును, ఆనందమే ఆత్మ. ఆనందోద్బోధకములైన మధుమాంససంగమాదులవలన గలుగు ఆనందప్రాప్తియే మోక్ష మనెడు శాక్తేయులును, నాడీమధ్యమున అణుపరమాణుస్వరూపమున వెలుగుచు యిరువదియారవతత్వరూపుడై పరమవ్యూహము, విభవము అర్చ అంతర్యామి అనురూపముల మెఱయు వాసుదేవుడే ఆత్మ. వానియందుస్వరూపహానిలేక కైంకర్యపరుడై యుండుటే మోక్ష మనెడి పాంచరాత్రులును, ఇందు పర మనగా, పరమపదము. వ్యూహము లనగా, వాసుదేవసంకర్షణప్రద్యుమ్నఅనిరుద్ధవ్యూహములు. అందువాసుదేవవ్యూహముపరమపదము, సంకర్షణవ్యూహము పాతాళము. ప్రద్యుమ్నానిరుద్ధవ్యూహములు క్షీరాబ్ధిమేరువులు, విభవ మనగా, రామకృష్ణాద్యవతారములు, అర్చ యనగా, వేంకటాచలము, శ్రీరంగము, కాంచి, మేలుకోట లోనగు స్థలవిగ్రహారాధనములు. అంతర్యామియన జీవుడే దేహముగలవాసుదేవుడని యెఱుగవలయును, దేహ పుత్ర మిత్ర కళత్ర పశుభృత్యాదులే ఆత్మ. ఇహపరములలో వారికి ఆధివ్యాధులులేక వారితోగూడి సుఖముగా నుండుటే మోక్ష మనెడి లౌకికులును, స్వతస్సిద్ధముగా ప్రమాణమైతుడే ఆత్మ. స్వర్గవైకుంఠకైలాససత్యలోకాదులసాలోక్యాదిపదప్రాప్తియే మోక్ష మనెడు పూర్వమీమాంసకు లయిన భాట్టప్రాభాకరులును, మింటివలె మితములేక శిలవలె జడరూపుడై మనోబుద్ధిధర్మములుగలవాడే ఆత్మ. శరీరేంద్రియాదికము లనెడు నిరువదియొకవిధములైన దుఃఖములులేక రాత్రివలెనుండుటే మోక్షమనెడు నైయాయికవైశేషికులును, మింటివలె దేసి

నంటక జ్ఞానస్వరూపమున వెలుగువాడే ఆత్మ. ప్రకృతిపురుషవివేకముచేత అజ్ఞాననాశమగుటే మోక్షమనెడు సాంఖ్యులును, వస్త్వంతరసంబంధము లేక విజ్ఞానస్వరూపమున మెఱయువాడే ఆత్మ. యోగాభ్యాసబలమున మనోలయముగలిగి అజ్ఞానమునశించుటే మోక్షమనెడు పాతంజలులును, నిత్యవ్యాపకరూపుడే ఆత్మ. ఆయాత్మ సర్వజ్ఞుడు సర్వపరిపూర్ణుడు అని తాను కించిజ్ఞుడనితలచి ఆయాత్మయందు జ్ఞప్తిగలిగియుండుటే మోక్షమనెడు పాశుపతులును, కర్తృత్వాద్యభిమానరూపసంసారమునకు వేరైనవాడే ఆత్మ. దానిని విడిచి భగవంతునియందు జ్ఞప్తి గలిగియుండుటయే మోక్షమను కాపాలికమహావ్రతులును, నిత్యవ్యాపకజ్ఞానక్రియాస్వరూప పరమశివుడే ఆత్మ. షడధ్వాతీత పరశివ సమానత్వమే మోక్షమనెడు మాంత్రికశైవవీరశైవులును గణపతియే కర్త. సూర్యుడే పరుడు, ఆగణపతి సూర్యసాలోక్యాదిపదవులజెందుటే మోక్షము గాణాపత్యసౌరులును, సర్వోత్తముడు సమానరహితుడైన సర్వేశ్వరుడే పరమాత్మ. వానినుపాసించి యిహమందలి రూపములవంటిరూపములతోడనే వానిలోకమందు వసించుటేమోక్షము అను ద్వైతులును, ప్రాణులు పుట్టుట గిట్టుట స్వభావమేకాని, పుట్టింప గిట్టింప కర్త యొకడు లేడను స్వభావవాదులును, మరియు తక్కినపరిణామవాదులలోనగువారును క్రమక్రమంబుగా భూమి నాక్రమించినఁ జూచి త్రిలోకశంకరుండగు శంకరుండు భూలోకంబున శంకరాచార్యుండై విష్ణువహ్నివరుణవాయుస్వరూపులగు పద్మపాదహస్తామలకతోటకవార్త్తికులనెడు నలువురుశిష్యులతోడ ఆవిర్భవించి పైజెప్పిన చార్వాకాది దుష్టమతముల ఖండించి పరమమోక్షప్రదంబులగు ఉపనిషద్భాష్యగీతాభాష్యసూత్రభాష్యములనెడు ప్రస్థానత్రయమును ఉత్తమాధికారుల నిమిత్తము నిర్మించి ఆప్రస్థానత్రయము జూడ సమర్థత లేనివారికి అద్వైతమకరందము ఆత్మబోధప్రకాశిక దృగ్దృశ్యవివేకము మొదలగు వేదాంతగ్రంథములు గల్పించెను. గాన, సర్వమతంబులవిడిచి వేదాంతవిచారంబుజేయుటే ముఖ్యమని తలంచుటయే యీతత్ఫలము.

### 3. షడామ్నాయముల వివరము.

పూర్వామ్నాయ వివరణము — పూర్వామ్నాయగురుమండల దేవతలగు స్వగురుపరమగురుపరమేష్ఠిగురుమంత్రదేవతలును, మహాగణపతి కామగిరి పూర్ణగిరి జాలంధరపీఠమంత్రదేవతలును, పూర్వామ్నాయ

దేవతలగు శుద్ధవిద్య బాలద్వాదశార్ధలఘు వేణుశుకరాజశారికసంగీతల నెడి సప్తశ్యామలలు మొదలైన యిరువదినాలుగు వేల దేవతలును, ఉపదేవతలగు గాయత్రి గాణాపత్యము, కార్తికేయము, మృత్యుంజయము, నీలకంఠము, త్ర్యంబకము, జాతవేదము, ప్రత్యంగిరస్సు మొదలగు మంత్రదేవతలును, త్రైలోక్యమోహనచక్రావరణదేవతలును ఇవి మొదలగు రెండు కోట్లమంత్రదేవతలు పరమశివుని తత్పురుషముఖమువల్ల బుట్టి కామగిరి పీఠమున నివసించి వైదికాగమప్రసిద్ధములై ఆరాధించువారికి సాలోక్య పదవి మొదలగువాని నిచ్చుచుండును.

దక్షిణామ్నాయవివరణము — దక్షిణామ్నాయగురుమండల దేవతలైన అష్టభైరవులును, దశవిధంబులగు సిద్ధసంఘ దేవతలును విరించి ఛత్రస్కందము లనెడు వటుకత్రయ దేవతలును, ప్రకాశవిమర్శము లనెడి పదద్వంద్వమంత్ర దేవతలును, ఆమ్నాయ దేవత లగు సౌభాగ్యవిద్యాపంచదశాక్షరి బ్రహ్మాస్త్ర దేవత యగు బగళాముఖి వారాహి సప్తకము వటుకనాథుడు తిరస్కరణి మొదలగు ముప్పదివేలమంత్ర దేవతలును, ఉపదేవతలగు అఘోరము శరభము ఖడ్గము రావణము వీరభద్రము రౌద్రము శాస్తము పాశుపతము దక్షిణామూర్తి మొదలగు కోటిమంత్రదేవతలును, సర్వాశాపరిపూరక చక్రావరణదేవతలును, పరమశివుని అఘోరముఖమునబుట్టి పూర్ణగిరిపీఠమున వసించి శైవాగమప్రసిద్ధములై ఉపాసించువారికి సామీప్యపదవి లోనగువాని నిచ్చుచుండును.

పశ్చిమామ్నాయవివరణము — పశ్చిమామ్నాయగురుమండల దేవతలగు నవవిధదూతీమంత్ర దేవతలును, సోమసూర్యాగ్నిమండలదేవతలును, ఆమ్నాయ దేవతలగు లోపాముద్రమహాదేవిభువనేశ్వరిఅన్నపూర్ణ కామకళ మొదలగు మూడు వేలమంత్ర దేవతలును, ఉపదేవతలగు సుదర్శనము గరుడము కార్తవీర్యము నృసింహము అచ్యుతము అనంతము గోవిందము శ్రీరామషడక్షరీ షోడశాక్షరీ గోపాలమంత్రాష్టకము సౌరమతసిద్ధాంతమంత్ర దేవతలు; ధన్వంతరి యింద్రజాల మహేంద్రజాలాది విద్యామంత్ర దేవతలు, ఇంద్రాదిదశదిక్పాలకమంత్ర దేవతలు, నారాయణాష్టాక్షరి వాసుదేవద్వాదశాక్షరి మొదలగు కోటిమంత్ర దేవతలును, సర్వసంక్షోభణ సర్వసౌభాగ్యదాయక చక్రావరణదేవతలును, పరమశివుని సద్యోజాతముఖమున బుట్టి వైష్ణవాగమ ప్రసిద్ధములై జాలంధరపీఠ

మున నివసించి ఉపాసన చేయువారికి సారూప్యపదవి లోనగువాని నిచ్చు చుండును.

ఉత్తరామ్నాయవివరణము—ఉత్తరామ్నాయగురుమండలదేవత లగు వీరబాహువు వీరమార్తాండుడు వీరకేసరి లోనగు తొంబదియారు వేలనలువదెనమంత్రము వీరమంత్రదేవతలును, బ్రహ్మవిష్ణురుద్ర ఈశ్వరసదా శివు లనెడి పంచవీరావళీమంత్రదేవతలును, ఆమ్నాయదేవత లగు మా ర్యాంబమహార్థఅశ్వారూఢమిశ్రాంబవరాదేవివాగ్వాదిని మొదలగు రెండు వేల ఆమ్నాయమంత్రదేవతలును, ఉపదేవతలగు సర్వసంక్షోభిణీ సర్వ విద్రావణి సర్వాకర్షిణి సర్వవశీకారిణి సర్వోన్మాదిని సర్వమహాంకుశి సర్వఖేచరి సర్వబీజ సర్వత్రిఖండ అను నవముద్రాదేవతలును, మూడు వేలసిద్ధదేవతలును, దుర్గకాళిరహస్యచండినకులిమహాబగళాముఖి రేణుక లక్ష్మివాగ్వాదినిస్వయంవరబ్రాహ్మీమాహేశ్వరికౌమారివైష్ణవివారాహి ఐంద్రినారసింహ మొదలగు రెండుకోట్లమంత్రదేవతలును, పరమశివుని వామదేవముఖమువల్లబుట్టి ఒడ్యాణపీఠమున నివసించి శాక్తాగమప్రసిద్ధ ములైన ఆరాధించువారికి సాయుజ్యపదవి మొదలగువానినిచ్చుచుండును.

ఊర్ధ్వామ్నాయవివరణము—గురుమండలదేవతలైన అనులోమ విలోమవర్ణరూపమైన అకారాదిక్షకారాంతమగు మాలినీమంత్రదేవతయు మంత్రరాజమగు నృసింహమును, ఆమ్నాయదేవత లగు కామేశ్వర్యాది షోడశనిత్యమంత్రదేవతలును, పరాశాంభవి పర అఘోరపరాపర మహా షోడశ ఆపదోద్ధారణము మొదలగు సహస్రమంత్రదేవతలును, ఉపదేవత లగు జ్వాలామాలిని ధూమావతి ప్రతిక్రియామాలిని పరమంత్రభక్షిణి మొదలగు అర్ధకోటిమంత్రదేవతలును, సర్వసిద్ధిప్రదాయక సర్వైశ్వర్య ప్రదాయక చక్రావరణదేవతలును, పరమశివుని యీశానముఖమువలన బుట్టి శాంభవీపీఠమున నివసించి పరమేశ్వరాగమప్రసిద్ధములై ఉపాసించు వారికి సార్‌ష్టిపదవిలోనగువాని నిచ్చుచుండును.

అనుత్తరామ్నాయవివరణము....పరబ్రహ్మస్వరూపములైన ప్రాసాద మంత్రదేవతలును, దహరకము ఉద్గీథము హంసము మహావాక్యములు పంచాక్షరి జన్మతారకమగు మహాతారకము మహాపాదుక రక్తశుక్లమిశ్ర చరణములు పంచపంచశలుమూలవిద్య షడ్విధములైన ఆధారాదివిద్యలు కాళవిద్య మొదలగు నర్ధకోటిమంత్రదేవతలును, సర్వరోగహరసర్వసిద్ధి

ప్రదాయక సర్వానందమయ చక్రావరణ దేవతలును, పరమశివుని గుప్త ముఖమునబుట్టి తుర్యపీఠమున వసించి ఉపాసించువారికి స్వాత్మానందము నిచ్చుచు పరమమోక్షపదవి గలిగించుచుండును. ఇట్లని ఆమ్నాయసార సంగ్రహమునందు ఇది పార్వతీదేవికి పరమేశ్వరుడు ఉపదేశించెను.

## 4. అర్చిరాదిధూమాదిమార్గములనిర్ణయము.

"శ్లో॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం॥" అను గీతా వచనప్రకారమున తేజస్సు పగలు, శుక్లపక్షమున ఉత్తరాయణము దేవ యానము, ఇడానాడి తేజోమార్గము. ఈమార్గమునబోవువారు యోగా భ్యాసముచేత వైరాగ్యోపశాంతవృత్తులు గలవారై బాహ్యసన్యాసము గలిగిగాని మనస్సన్యాసము గలిగిగాని పైజెప్పినక్రమముగా సూర్యలోక మునుపొంది అచ్చట మన్వంతరమువరకు నుండి పిమ్మట బ్రహ్మలోకము జేరి అచ్చట వేదాంతవిచారణచేత 'బ్రహ్మణాసహముచ్యంతే'అనుశ్రుతి ప్రమాణమునుబట్టి ముక్తులగుచున్నారు, అట్లు ముక్తులు కానివారు బ్రహ్మ యుండువరకు నచ్చటనేయుండి వెనుక తాము ఉపాసించిన దేవతాంతర లోకములయందు సాలోక్యాదిపదవులబొందుదురు, వివేకవృత్తిలేనందున వీరు బహుకాలమునకు ముక్తులగుదురు. మరివారు అగ్ని మొదలగు పద వులలో దేనినుండిజారినను అచ్చటచ్చటికి దిగువపదవులయందు బడుచు తిరుగాపుణ్యకర్మఫలములచేత పైకిబోవుచునుందురు ఇదిఅర్చిరాదిమార్గం.

ధూమాదిమార్గము—'శ్లో॥ ధూమోరాత్రిస్తథాకృష్ణషణ్మాసా దక్షిణాయనం' అను గీతావచనప్రకారమున, 'శ్లో॥ అగ్నిహోత్రంతపస్స త్యంవేదానాంచానుపాలనం। ఆతిథ్యంవైశ్వదేవంచ యిష్టమిత్యభిధీయతే। వాపీకూపతటాకాదిదేవతాయతనానిచ। అన్నప్రదానమారామాః పూర్త మిత్యభిధీయతే॥' అను ప్రమాణమున ఇష్టాపూర్తకర్మములు జేయువారు, పొగ రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము పితృయానము పింగళానాడి ఈమార్గమునబోయి చంద్రలోకంబుచేరి అచ్చట పుణ్యఫలముల ననుభ వించుచు అవిక్షీణింప అచ్చోటనుండి మేఘమందుబడి జలమై ఆజలరూప మున భూమియందలి ఓషధులలో జేరి అన్నమై జన్మానుగుణ్యమగు పురుష జంతుగర్భమందు జేరి శుక్లంబై అన్యలవనితాగర్భంబునకు జేరి నవమా సంబులు గడచినతోడనే పుడమియందుదయించి పెరిగి పుణ్యపాపమిశ్ర కర్మములు జేసి ఆత్మజ్ఞానము గలుగుదాక లోకాంతరంబుల బొందుచు

మరలిపుట్టుచు గిట్టుచుందురు. ఇది ధూమాదిమార్గము.

ముక్తిమార్గము— అపరోక్షబ్రహ్మజ్ఞానము గలవారు బ్రహ్మార్పణ బుద్ధిచేత బహుజన్మములయందు చేసిన యాగయోగతపోనిష్ఠలవలని పుణ్య పుంజంబువలన మంజులంబగు చిత్తశుద్ధిగలిగి సాధనచతుష్టయసంపన్నులై వేదాంతశ్రవణమనననిదిధ్యాసలు చేసి ధూమాద్యర్చిరాదిమార్గముల నిరాకరించి వివేకవృత్తిచేత జీవన్ముక్తులై 'శ్లో॥ నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః' అను గీతావచనప్రకారముగా విదేహకైవల్యము నొందుదురు. పుణ్యలోకప్రాప్తికై పైజెప్పిన ధూమాద్యర్చిరాదిమార్గములగాని వీనిని మీరిన జ్ఞానమార్గమునగాని పోనివారు అంధకారబంధురంబగు నరకమందు వసింతురు.

5. మరియొకవిధ షట్చక్రనిర్ణయము.

కొందరు జ్ఞానులు ఆధారకమలంబునకు నాసికకు చేరిక గావున, నాసికకు విషయంబులగు సుగంధ దుర్గంధ సుగంధమిశ్రదుర్గంధ దుర్గంధమిశ్ర సుగంధంబులు నాలుగే ఆధారకమలంబునకు నాలుగుదళంబు లనియు, స్వాధిష్ఠానకమలంబునకు లోచనంబునకు మాడిక గావున, లోచనంబునకు విషయంబు లగు తెలుపు నలుపు పసుపు ఆకుపచ్చ మెరుపు మిశ్రము లావు సన్నము పొట్టి పొడుగు అనెడి దశవిధరూపంబులే దశదళంబు లనియు, మణిపూరకకమలంబునకు నాలుకకు పొందిక గావున, నాలుకకువిషయములైన వగరు తీపు ఉప్పు కారము చేదు పులుసు అనెడి షడ్రసంబులే షడ్దళంబు లనియు, అనాహతకమలంబునకు శరీరచర్మంబునకు సంబంధంబు గావున, చర్మంబునకు విషయంబులైన శీత ఉష్ణ శీతమిశ్రోష్ణ ఉష్ణమిశ్రశీత మృదుకఠినస్పర్శంబులు లాగున అల్పాధికంబులచేత పండ్రెండగును. ఆపండ్రెండువిధంబులైన స్పర్శంబులే అనాహతకమలంబునకు పండ్రెండుదళంబు లనియు, విశుద్ధకమలంబునకు కలయిక గనుక, ఆ కర్ణంబునకు విషయంబులైన అకారాదిషోడశస్వరరూపశబ్దంబులే షోడశదళంబు లనియు, ఆజ్ఞేయకమలము మనస్సునకు నెలవు గనుక, మనస్సునకు విషయంబులగు సంకల్పవికల్పములే ఆజ్ఞేయచక్రంబునకు రెండుదళంబు లనియు పలుకుదురు.

మరి కుండలీశక్తిరూపమైన బిందుతత్వము జగద్వ్యాపారవృత్తి గలిగినప్పుడు నిలువ నాధారమైనందున మూలాధారమనియు, ప్రభావముచూప తనచేత అధిష్ఠింపబడుటవలన స్వాధిష్ఠానమనియు, నాధకుడు

తన్ను నారాధించు సమయంబున మణిమయంబులై ప్రోగుచుండును. అందెలు, కడియములు, కిరీటము, భుజకీర్తులు మొదలగు నగలచేత తన శరీరము నిండించెడి స్థాన మగుటవలన మణిపూరక మనియు, సాధకుడు పూజాకాలమందు విఘ్నకారులగు దుష్టభూతభేతాళరాక్షసాదులపోక కు మంగళవాద్యములు చేయుట ప్రసిద్ధము. గనుక, సాధకునకు సహాయ్యముగా కొట్టకనే చిణిచిణిచిణి ఘంట శంఖ వీణ తాళ వేణు భేరిమృదంగ మేఘధ్వనులు గలుగుచుండుటవలన అనాహత మనియు, సాధకుడు శుద్ధ స్ఫటికాకృతిగా తన్ను ధ్యానించుచో టగుటచే విశుద్ధమనియు, తన ఆజ్ఞ చెల్లించుస్థలమగుటవలన ఆజ్ఞాచక్రమనియు షట్చక్రములకు పేళ్లుగలిగెను.

## 6. హంసచక్రస్వరూపనిర్ణయము.

మరియామూలాధారంబునకు రెండంగుళంబులమీదను స్వాధిష్ఠానంబునకు రెండంగుళంబుల దిగువను కుక్కుటాండంబువలె నాడీచక్రముండును. దానియందు డెబ్బదిరెండువేలనాడులుపుట్టి కొన్నిమీదుగను, కొన్నిక్రిందుగను, కొన్నిప్రక్కలను, భూమియందలి నదులవలె శరీరంబున వ్యాపించుకొనియుండును. వానిలో పదినాడులు ముఖ్యంబులు. అందు కుహూసినీవాలిరక్తాహ్వయంబులనెడి మూడునాడులుక్రిందుగపారి కుహూనాడిమలంబును శినీవాలినాడిమూత్రమును రక్తాహ్వయనాడి శుక్లశోణితంబులను విసర్జనము సేయుచుండును. పూషా అలంపూషా అను రెండు నాడులు కర్ణములయందు జేరి వర్ణధ్వని స్వరమిశ్రరూపంబులైన శబ్దంబుల వినజేయుచుండును. గాంధారిహస్తిజిహ్వా అను నాడులుకన్నులలోవ్యాపించి దశవిధరూపగ్రహణంబు చేయించుచుండును. మరి బ్రహ్మనాడికి కుడి యెడమపార్శ్వములయందుండెడి ఇడాపింగళ లను నాడులు హృదయము దాకవచ్చి ఆహృదయమందలి ప్రాణవాయువుతోడ భ్రూమధ్యమందు జేరి గంగ యమున అను పేళ్లు గలవి యగును. అందు సూర్యుడనెడి పేరు గల ఇడానాడి కుడినాసికయందు జేరి తపినీ తాపిని ధూమ్రా మరీచి జ్వాలిని రుచి సుషుమ్నా భోగద విశ్వాబోధిని ధారిణి క్షమ అనెడి పం ద్రెండుపేళ్లుగల పండ్రెండంగుళములవరకు ప్రాణవాయువును వెలుపల తిరుగజేసి వానిలో నాలుగంగుళములు క్షీణింపజేసి యెనిమిదంగుళములదాక ప్రాణవాయువును మరల లోపలి కిడ్చుకొనును. చంద్రుడను పేరు గల పింగళనాడి యెడమనాసికములో జేరి ప్రాణవాయువును అమృత

మానదపూషతుష్టిపుష్టిరతిధృతిశశినిచంద్రికకాంతిజ్యోత్స్నశ్రీప్రీతిఅంగద పూర్ణపూర్ణామృతలను పదియారు పేళ్లుగల పదియారంగుళంబులపొడవున వెలుపలవ్యాపింపజేసి యెనిమి దంగుళంబులు క్షీణింపజేసి యెనిమి దంగుళంబులదాక ప్రాణవాయువును లోపలికి తీసుకొనును. మరిసూర్య చంద్రసంజ్ఞలు గల ఇడాపింగళానాడులు రెండును ఒకదినమున యిరువది యొక్కవేలఆరునూరునూరులు ఉచ్ఛ్వాసనిశ్వాసరూపంబులచేత మారి మారి పలుమారు తిరుగుచుండును, నాడీచక్రమందు బుట్టిన శుక్లనాడి సుషుమ్న కుండలీశక్తి నాగకన్యక బ్రహ్మనాడి అను పేళ్లుగలదియై వక్షస్థలంబుదాక వచ్చి నాడీచక్రంబు నుండి తనతోడ వచ్చిన నూరునాడుల నక్కడవిడిచి తాను నాలుకకొననుజేరి సరస్వతి యను పేరువడసి కొండ నాలుక దవుడలు మొదలు తెలవండ్లు పెదవులు నాసిక మిశ్రములుఅను నెనిమిదిస్థలములయందు ఏబదియొక్కఅక్షరములను పలికించుచు అచ్చట నణగి అంతర్గమనంబున పశ్చిమమార్గంబుగా భ్రూమధ్యంబునకుదిగి ముందటిఇడాపింగళలలో సంగమమగును. అదిత్రివేణీసంగమము, త్రికూటము, శృంగాటము, చతుష్పథము అను పేళ్లు గల దగును. ఇదే ఆజ్ఞాచక్రము. ఈఆజ్ఞాచక్రంబునకు మనోరూపంబుగ చిచ్ఛక్తి సహస్రారంబు నుండి దిగి వచ్చి అచ్చట వసించి ఇంద్రియములను సర్వవిషయములయందు ప్రవర్తింపజేయును. జగత్సృష్టిసంహారతిరోధానానుగ్రహములనెడి వ్యాపారములను చేయు పంచకర్తల కాజ్ఞాపించుటవలన ఆజ్ఞాచక్ర మనిపేరు, దీనిమీద చిచ్ఛక్తికి ఒకఅంగుళమువరకు శక్తి యని, దానిపై మూడంగుళములవరకు వ్యాపిని యని, ఆవల నాలుగంగుళములదాక సమన యని, ఆమీద నాలుగంగుళములవరకు ఉన్మనియని పేళ్లుగలుగును. ఈపండ్రెండంగుళములమీద బ్రహ్మరంధ్రము. ఇదే ద్వాదశాంతము. దీనియందు వేయిదళములుగల సహస్రారచక్రముగలదు. అది నూటఇరువదైదుచిన్న రేకులుగల యెనిమిదిపెద్ద రేకులు గలిగియుండును. ఇదే అష్టదళపద్మము, దీనిమధ్యమందు శివబీజమైన హకారమును, శక్తిబీజమైన సకారమును ఈ రెంటినడుమ త్రాసుముంటివలె శివశక్తులకు ఐక్యస్థానమై శివకళ యగు జ్ఞానము హెచ్చినప్పుడు హకారముప్రక్కను, శక్తికళయగు ప్రపంచ జ్ఞానముహెచ్చినప్పుడు సకారముప్రక్కను వాలుచు బిందురూపమైన బుద్ధితత్త్వము వెలుగుచుండును, ఇదే మూలాక్షరము. దీనిదెలిసి లక్ష్యముం

చినవారే పరమహంసలు, అవధూతలు, జీవన్ముక్తులు. మరి ఈహకార బిందు సకారములే పతిపాశపశువులు, నాదబిందుకళలు, సోమసూర్యాగ్ని మండలములు, పురుషపుత్రస్త్రీప్రవాహములు, శుక్లమిశ్రరక్తపాదక లని చెప్పబడును. మరి ఈహకారబిందుసకారములు తమ్మునమ్మినవారిసంసార బంధంబు హరించునవి గావున హంస యనబడును. మఱి హకారము సోమము, సకారము అగ్ని, బిందువే మోక్షపదము. వీని యైక్యమే అగ్నీషోమీయయజ్ఞము. ఇదే కర్మకాండవిదులు చేయు బహిర్యజ్ఞము. మరి తత్పదమే హకారము, త్వంపదమే సకారము. వీనియైక్యమైనఅసిపదమే బిందువు గావున, జ్ఞానులకు ఇదియే జీవేశ్వరైక్యరూపమగు యోగయజ్ఞము. మరి ఈహంసయే గురుపాదుక. గావున, అజపాగాయత్రీమంత్రజపము సహస్రము సమర్పింపబడును. మరి ఇదే జ్ఞానాజ్ఞానమిళిత మైన ప్రపంచమందు నీళ్ళనెడి అజ్ఞానమును విడిచి పాలనెడి జ్ఞానమును వహించు. గావున, హంసపక్షి యనబడును. మరి ఈహంస అష్టదళపద్మ మందలి తూర్పుదెసపైవాలిన పుణ్యకర్మమును చేయవలె ననుతలంపును, ఆగ్నేయదళమందువాలిన సోమరితనము ఆలస్యములోనైన వృత్తులును, దక్షిణపు దళమందుఒరిగిన క్రూరపుపనులు గావింపవలయు నను సంకల్పములును, నైరృతిదళమందు చేరిన పాపకార్యములు సలుపవలె నను బుద్ధులును, పశ్చిమదళమందునిలిచిన ఆడుట, పాడుట, లేక వీనిచూచుట మొదలగునవి చేయవలె ననెడి యెన్నికలును, వాయువ్యదళమందుచేరిన నడుచుట, పరుగెత్తుట, దుముకుట మొదలగునవి చేయవలయు నను కోరికలును, ఉత్తరపుదళమందు వాలిన పదార్థముల ననుభవింపవలయు నననవి లోనగు నభిలాషలును, ఈశాన్యదళమందు చేరిన దానములు, త్యాగములు మొదలగునవి చేయవలె నను యిచ్ఛలును, కమలమధ్యమందు చేరిన వైరాగ్యము,ఉపశాంతి,దమము మొదలగు సాత్త్వికవృత్తులును, కేసరములందు ప్రవేశించిన జాగ్రతయు, దుద్దునందు జేరిన స్వప్నంబును, పద్మనాళమునదిగిన నిద్రయునుగలుగును. మరియు నీపద్మమును విడుచుటయే తురీయము. ఇట్లని హంసోపనిషత్తునందు గలదు.

7. ఆచార్యుడు శిష్యునిచూచు తలచు స్పృశించువిధము.

పదినెలలు మోసి కని పెంచి వాత్సల్యము గలిగియుండు తల్లితో సాటియైన గురువు శిష్యుని తనచేరువను కూర్చుండబెట్టుకొని తాబేటివలె

తలచి అనగా తాబేలు ఒకచోట గ్రుడ్లుబెట్టి మరియొకచోటనుండి ఆగ్రుడ్లను తలచునపుడు అవియెల్ల పిల్లలై మరి అప్పుడప్పుడు పిల్లలను తలచుట వలన వానికి ఆకలిదప్పులు లేక పెరుగుట స్వభావము గాన, ఆతాబేలు వలె గురుడు శిష్యునకు విషయసుఖములను, మమతాహంకారములను ప్రబలజేసెడి ఆగామికర్మములుతొలగి సద్గుణములు ప్రబలి బ్రహ్మజ్ఞానము వర్ధిల్లి మోక్షసుఖము లభించుగాకయని అంతరత్రిపుటిరూపమైన అంతఃకరణమందు తలచెననిభావము.

చేపవలె కటాక్షవీక్షణముచేత వీక్షించి అనగా మత్స్యములు గ్రుడ్లుబెట్టి తరిమెరిగి వానికై తిరిగి చూచునప్పుడు అవియెల్ల పిల్లలై ఉల్లసిల్లుట ప్రసిద్ధము. గనుక, అనాదిగా వెంటనంటియున్న సంచితకర్మసంబంధములై కాయికవిషయములైన ప్రాకృతదుష్టలక్షణములునశించి బ్రహ్మానందసంపదలంద హేతువులగు అప్రాకృతభాగ్యలక్షణములు గలవానిగా మధ్యత్రిపుటిరూపమైన కడగంటిచూపుచేత జూచుననిభావము.

పక్షివలె హస్తముచేత మస్తకము గప్పి అనగా పక్షి గ్రుడ్లుబెట్టి వానిని తనరెక్కలచేత పొదుగగా అవి పిల్లలై స్తన్యపానము, స్నానము మొదలగునవిగల నరశిశువులవలె వృద్ధిబొందుటసహజము గనుక, ఇతడు ప్రారబ్ధరూపముగా ప్రాప్తించిన అనుభవ మంతయు నశించి స్వస్వరూపజ్ఞానవంతు డగుటకు నిత్యానందస్వరూపమై పరిపూర్ణముగా వ్యాపించుటకు బాహ్యత్రిపుటిరూప మైన పద్మచక్రశంఖవజ్రహలాదిరేఖలు గల తన అభయహస్తమును అతనిమస్తకమందుజేర్చి సకలావయవములను తడవెననిభావము, ఇట్లని కైవల్యనవనీతము. ౭. భ్రమరకీటకన్యాయలక్షణము.

శిష్యునకు కుమ్మరపురుగు పోలికెను, గురువునకు తుమ్మెదపోలికను చెప్పుటచేత తన్ను మఱవజేయు ప్రకృతి భ్రమరూప మైన అంతరబాహ్యదృశ్యస్వరూపసంసార మనెడు బురదలో జిక్కి తిక్కగొని జనన మరణ ప్రవాహములోబడి ఆధివ్యాధులచేత బాధనొందుచు ఉండువా డగుటచేత శిష్యునకు కుమ్మరపురుగు సాదృశ్యమును చిదాకాశ మనెడు ఆకాశగమనమును, వినసొంపగు సచ్ఛాస్త్రప్రసంగ మనెడు గానమును, పుష్పరసపాన మనెడు స్వానుభవానందరసపానమును గలవా డగుటచేత సత్యజ్ఞానానందస్వరూపు డైన ఆచార్యునకు తుమ్మెదపోలికెయును చెప్పబడెను.
ఇట్లని కైవల్యనవనీతము.

## 9. జీవేశ్వరజగదుత్పత్తిచక్రము.

ముక్కోణ మండలి వర్తులాకృతి పరబ్రహ్మము.

ముక్కోణము మూలప్రకృతి. — సత్వగుణము. రజోగుణము, తమోగుణము.

వర్తులాకృతి. — ఆకాశము.

షట్కోణాకృతి. — వాయువు.

త్రికోణాకృతి. — అగ్ని.

అర్థచంద్రాకృతి. — జలము.

చతురశ్రాకృతి. — భూమి.

## 10. జీవేశ్వరజగదుత్పత్తిచక్రవిషయము.

మొదట సజాతీయ, విజాతీయ, స్వగతభేదశూన్యమగు నిర్గుణపర

బ్రహ్మము గలదు. దానియందు చంద్రునియందలి చంద్రికవలె యెడబాటులేక యెల్లప్పుడు కూడియుండి ఆపరబ్రహ్మమునందు వ్యాపించి పరబ్రహ్మశక్తి ఒక్కటి ప్రకాశించుచుండును. అదే మూలప్రకృతి మహాత్రిపురసుందరి. ఆమూలప్రకృతి అమలసత్వప్రధాన మలినసత్వప్రధాన అనెడు రెండురూపములు గలది. వీనిలో అమలసత్వప్రధాన బ్రహ్మజ్ఞానమును, మలినసత్వప్రధాన లోకవ్యవహారజ్ఞానమును కలిగించును. ఈ రెంటిలో మలినసత్వప్రధాన సత్వగుణము, రజోగుణము, తమోగుణము అనెడు మూడుగుణములు గలవి.

వీనిలో సత్వగుణము తెలుపురంగును,ఉత్తమమును,మాయ యను పేరును కలదియగును. దీనియందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయె ఈశ్వరుడు. ఆయీశ్వరునకు యీమాయయే కారణశరీరమును, సుషుప్త్యవస్థయును, ఆనందమయకోశమును అగును. ఈమాయోపాధినిపొందిన ఈశ్వరునకు అవ్యాకృతుడని, అంతర్యామి యని పేరు. ఈయీశ్వరుని రాజసాహంకారమే బ్రహ్మయును, సాత్వికాహంకారమే విష్ణువును, తామసాహంకారమే రుద్రుడును, త్రిగుణసామ్యమే ఈశ్వరుడును, శుద్ధసాత్వికాహంకారమే సదాశివుడును అగును.

రజోగుణము ఎఱ్ఱనిరంగును, మధ్యమమును, అవిద్యయను పేరును కల దగును. దీనియందు ప్రతిఫలించిన పరబ్రహ్మచ్ఛాయ ఈఅవిద్యచేత ఖండఖండములై కంసలవానిమైనపువుండలోని బంగారపుపొడివలె నానావిధజీవులును అగును. ఈజీవులకు నీయవిద్యయే కారణశరీరమును,సుషుప్త్యవస్థయును అగును. ఈఅవిద్యోపాధిగలజీవునకు ప్రాజ్ఞుడని పర[illegible]ుడని పేరు

త్రిగుణములలో దేనియందును పరబ్రహ్మము ప్రతిఫలించినప్పుడు నిమిత్తకారణ మగును. ఈజీవేశ్వరులకు భోగసాధనములైన స్థూలసూక్ష్మశరీరములను కల్పింపదలచి పరమాత్మ తమోగుణమును వీక్షించెను.

తమోగుణము నల్లనిరంగును, అధమమును, ఆవరణశక్తియును అగును. దీనియందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయ విక్షేపశక్తి అగును. ఈ విక్షేపశక్తివలన శబ్దగుణము గల ఆకాశము ఉదయించెను. ఇది పరాశక్తియును, అనుగ్రహకృత్యమును, ఈశానముఖమును, శాంత్యతీతకలయును యకారమును, గుండ్రనిరూపమును, పసుపురంగును కలది. దీనికి అధిదేవత సదాశివుడు. దీనివలన గలగలశబ్దము. అనుష్ణాశీతస్పర్శము అనెడు

రెండుగుణములుగల వాయువు ఉదయించెను.

ఈవాయువు ఆదిశక్తియును, తిరోధానకృత్యమును, తత్పురుష ముఖమును, శాంతికళయును, వాకారమును, షట్కోణాకృతియును, రూపరహితస్పర్శగుణమును, ఆకుపచ్చరంగునుగలది. దీనికధిదేవత ఈశ్వరుడు. దీనివలన జగజగయనుశబ్దము, ఉష్ణస్పర్శము, ఎఱ్ఱనిరూప మనెడు మూడుగుణములుగల అగ్ని జనించెను.

ఈఅగ్ని క్రియశక్తియును, సంహారకృత్యమును, అఘోరవముఖమును, విద్యాకలయును, శికారమును, ముమ్మూలరూపమునుగలది, దీనివలన బుడబుడశబ్దమును, శీతస్పర్శమును, శ్వేతరూపమును, మధురరసమును అనెడు నాలుగుగుణములుగల జలము బుట్టెను.

ఈజలము జ్ఞానశక్తియును, స్థితికృత్యమును, వామదేవముఖమును, ప్రతిష్ఠాకలయును, మవర్ణము, అర్ధచంద్రాకారమునుగలది. దీనికధిదేవత విష్ణువు. దీనివల్ల కటకటశబ్దమును, కఠినస్పర్శమును, రక్తరూపమును, ఉప్పు మొదలగు రసములును, గంధగుణమును అను అయిదుగుణములు గల పృధివి బుట్టెను.

ఈపృధివి ఇచ్ఛాశక్తియును, సృష్టికృత్యమును, సద్యోజాతముఖమును, నివృత్తికళయును, నకారమును, చతురశ్రమైన రూపమును, వేడి చల్లన గానట్టి స్పర్శమును, చిత్రవర్ణమును గలది, దీని కధిదేవత బ్రహ్మ.

ఈప్రకారముగాకలిగిన పంచభూతములయందును తొలుత చెప్పిన మలినసత్వప్రధానయగు మూలప్రకృతియొక్క మూడుగుణములతో చేరి సత్వసూక్ష్మ రజసూక్ష్మ తమస్థూలభూతము లని మూడువిధము లగును. వీనిలో సత్వరజసూక్ష్మపంచభూతములు అపంచీకృతములై సూక్ష్మశరీరమునకు కారణము లగును. తమస్థూలభూతములు పంచీకృతములై స్థూలశరీరమునకు కారణము లగును.

## 11. అండపిండాదినిర్ణయము.

పంచీకృతము లయిన తామసస్థూలభూతము లైదును భాగింపగా అయిదైదులు యిరువదియైదుతత్వములను ఈతత్వములు ఒక్కటిగగూడి అండములును, పిండములును, భూతములును, భువనములును, భోగ్యములును అయ్యెను. అందు,

అండము లనగా, బ్రహ్మాండ విష్ణ్వాండ రుద్రాండ మహేశ్వరాండ సదాశివాండ విరాట్పురుషాండములు, అత్తికాయవలెనుండునది బ్రహ్మాం

డము, అత్తికాయలు అనేకములు గల అత్తిచెట్టువలె నుండునది విష్ణ్వాండము అత్తిచెట్లు అనేకములుగలఅత్తితోటవలెవుండునది రుద్రాండము, అట్టితోటలు అనేకములు గల గ్రామమువలె నుండునది మహేశ్వరాండము. అట్టిగ్రామములు అనేకములు గల దేశమువలె ఉండునది సదాశివాండము. అట్టిదేశములు అనేకములు గల ప్రపంచమువలె ఉండునది విరాట్స్వరూపాండము దీనినే మాయాండ మందురు.

పిండము లనగా, అత్తికాయలోనుండెడు పురుగులును, విత్తులును వలెనే బ్రహ్మాండములోనుండెడి చేతనాచేతనరూపములైన సమస్తప్రాణుల శరీరములు.—భూతము లనగా, అండపిండభువనములకు స్థానము లైన ఆకాశాదిమహాభూతములు.—భువనములనగా, పదునాలుగులోకములు లేక భువనార్థ్వ మందలి యిన్నూటయిరువదినాలుగు భువనములు.—భోగ్యము లనగా, సకలశరీరధారులకును భోగార్హములైన అన్నాదిసమస్త భోగ్యద్రవ్యము లీసర్వమును పంచీకరణమేఅగును. ఇట్లని కైవల్యనవనీతం.

12. పంచభూత తత్వస్తబకములు.

ఆకాశతత్వస్తబకము—జ్ఞాత కూటస్థుడనెడు అధిదేవతచేత ప్రేరేపింపబడి సమానవాయువుతో గూడి శ్రోత్రేంద్రియద్వారముచేత చతుర్విధశబ్దములనుగ్రహించి వాక్కుచేత పలియించుచుండును.

వాయుతత్వస్తబకము—ఈజ్ఞాత మనోరూపుడైనచంద్రాధిదేవతా ప్రేరకత్వముచేత వ్యానవాయువుతోగూడి త్వగింద్రియద్వారమువలన పంచవిధస్పర్శలను గ్రహించి పాణీంద్రియముచేత స్పృశించుచుండును.

అగ్నితత్వస్తబకము—ఈజ్ఞాత బుద్ధిరూపుడై బృహస్పతి దేవతా ప్రేరకత్వమువలనఉదానవాయువుతోగూడి చక్షురింద్రియద్వారమువలన దశవిధరూపములనుగ్రహించి పాదేంద్రియముచేత నడుచుచుండును.

జలతత్వస్తబకము—ఈజ్ఞాత చిత్తస్వరూపుడై క్షేత్రజ్ఞాధిదేవతా ప్రేరకత్వముచేత ప్రాణవాయువుతోగూడి జిహ్వేంద్రియద్వారమువలన సప్తవిధరసములనుగ్రహించి గుహ్యేంద్రియముచేతఆనందించుచుండును.

పృథివీతత్వస్తబకము—ఈజ్ఞాత అహంకారస్వరూపుడై రుద్రాధిదేవతాప్రేరకత్వమువలన అపానముతోగూడి ఘ్రాణేంద్రియద్వారముచేత త్రివిధగంధములనుగ్రహించి పాయ్వింద్రియముచేత మలమూత్రశుక్లశోణితములను విసర్జించుచుండును.

## 13. జీవేశ్వరస్థూలదేహపంచీకరణచక్రము.

| ఆకాశము, | వాయువు. | అగ్ని. | జలము, | పృథివి. | పంచీకృత తామసస్థూల భూతము, | |
|---|---|---|---|---|---|---|
| జ్ఞాత, జ్ఞేతము, కూటస్థుడు. | మనస్సు, సంకల్పవికల్పము, చంద్రుడు, | బుద్ధి, నిశ్చయము, బృహస్పతి, | చిత్తము, చలనము, జీవుడు, | అహంకారము అభిమానము, రుద్రుడు. | ఆకాశపంచకం, విషయములు, అధిదేవతలు. | అంతఃకరణములు, అంతరేంద్రియములు. |
| సమానవాయువు, వచనాదికం, జయుడు. | వ్యానవాయువు పంచిపెట్టుట విశ్వయోని. | ఉదానవాయువు మ్రింగుట మొదలగునవి, అజుడు | ప్రాణవాయువు, లోవెలిదిరుగుట విశిష్టుడు. | అపానము, మలమూత్రశుక్లములవాడ, విశ్వకర్త | వాయుపంచకం విషయములు. అధిదేవతలు, | |
| శ్రోత్రేంద్రియం చతుర్విధశబ్దము దిక్కులు. | త్వగింద్రియము, పంచవిధస్పర్శం వాయువు, | చక్షురింద్రియం దశవిధరూపము సూర్యుడు, | జిహ్వేంద్రియం సప్తవిధరసము. వరుణుడు. | ఘ్రాణేంద్రియం, త్రివిధగంధము. అశ్వినులు. | అగ్నిపంచకము విషయములు, అధిదేవతలు, | జ్ఞానేంద్రియములు, మధ్యేంద్రియములు, |
| శబ్దతన్మాత్రము, ఏకదేశశబ్దము, సదాశివుడు, | స్పర్శతన్మాత్రము ఏకదేశస్పర్శం. మహేశ్వరుడు, | రూపతన్మాత్రము ఏకదేశరూపము రుద్రుడు, | రసతన్మాత్రము, ఏకదేశరసము, విష్ణువు, | గంధతన్మాత్రము ఏకదేశగంధము బ్రహ్మ. | జలపంచకము, విషయములు. అధిదేవతలు, | పంచతన్మాత్రలు |
| వాగింద్రియము త్రివిధవచనము అగ్ని. | పాణింద్రియము దానప్రతిగ్రహములు, ఇంద్రుడు | పాదేంద్రియము రాకపోకలు, ఉపేంద్రుడు, | గుహ్యేంద్రియము, సంయోగానందము బ్రహ్మ. | పాయ్వింద్రియము, మలవిసర్జనము, మృత్యువు, | పృథివిపంచకం విషయములు, అధిదేవతలు, | కర్మేంద్రియములు, బాహ్యేంద్రియములు. |

## 14, పంచవింశతితత్త్వముల అధ్యాత్మిక అధిభౌతిక అధిదైవత వివరణచక్రము.

| అధ్యాత్మికము. | అధిభౌతికము. | అధిదైవతము. |
|---|---|---|
| జ్ఞాత | జ్ఞేయము | కూటస్థుడు. |
| మనస్సు | సంకల్పవికల్పములు | చంద్రుడు. |
| బుద్ధి | నిశ్చయము | బృహస్పతి. |
| చిత్తము | చంచలము | క్షేత్రజ్ఞుడు. |
| అహంకారము | అభిమానము | రుద్రుడు. |
| సమానవాయువు | పచనము | జయుడు. |
| వ్యానవాయువు | భిన్నఅన్నరసమును అన్ని నరములకు పంచిపెట్టుట. | విశ్వయోని. |
| ఉదానవాయువు | ఇష్టపదార్థభక్షణము. | అజుడు |
| ప్రాణవాయువు | ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత సంచరించుట. | విశిష్టుడు. |
| అపానము | వెలుపలికి వెళ్ళత్రోయుట | విశ్వకర్త. |
| శ్రోత్రము | చతుర్విధశబ్దగ్రహణము | దిక్స్వరూపము. |
| త్వక్కు | పంచవిధస్పర్శగ్రహణము | వాయువు. |
| చక్షు | దశవిధరూపగ్రహణము | సూర్యుడు. |
| జిహ్వ | సప్తవిధరసగ్రహణము | వరుణుడు. |
| ఘ్రాణము | త్రివిధగంధముల గ్రహించుట | అశ్వినులు. |
| శబ్దము | ఏకదేశశబ్దగ్రహణము | సదాశివుడు. |
| స్పర్శము | ఏకదేశస్పర్శగ్రహణము | ఈశ్వరుడు. |
| రూపము | ఏకదేశరూపగ్రహణము | రుద్రుడు. |
| రసతన్మాత్రము | ఏకదేశరసగ్రహణము | విష్ణువు. |
| గంధతన్మాత్రము. | ఏకదేశగంధగ్రహణము | బ్రహ్మ. |
| వాక్కు | పుణ్యపాపమిశ్రసంభాషణము | అగ్ని. |
| పాణి | దానప్రతిగ్రహములు | ఇంద్రుడు. |
| పాదము | గమనాగమనములు | ఉపేంద్రుడు. |
| గుహ్యము | సంయోగానందము | బ్రహ్మ. |
| పాయువు | విసర్జనము | మృత్యువు. |

'శ్రు॥ ఏదేవాదివ్యేకాదశస్థాః॥' అను శ్రుతిప్రమాణముచేత ఈ యాధిభౌతికములే భూలోకము, తామససృష్టి ఆసురీసంపద, భూః అను వ్యాహృతి గాయత్రియందలి ప్రథమపాదము.

ఈఅధ్యాత్మికములే భువర్లోకము, రాజససృష్టి మానుషీసంపద, భువః అను వ్యాహృతి గాయత్రీద్వితీయపాదము.

ఈఅధిదైవతములే సువర్లోకము, సాత్వికసృష్టి, దైవీసంపద, సువః అను వ్యాహృతి గాయత్రీతృతీయపాదము.

ఇప్పుడు చెప్పినవితప్ప మిగిలిన నఖశిఖపర్యంతమైన శరీర మందలి సకలావయవములయొక్కయు, మనోవృత్తులగు కామము మొదలగు దుర్వృత్తులసువృత్తులయొక్కయు, అధిభౌతిక అధ్యాత్మిక అధిదైవతములను తెలిసి ఈదేహమును సకలదేవతామయమని యెఱిగి సర్వదేవతామయుడును, విలక్షణుడును అయిన కూటస్థబ్రహ్మము తానని దృఢస్థిరతగలిగి యానందించువాడే బ్రహ్మవేత్త. ఈగుట్టును పట్టుదలగా విచారించక అధిభౌతిక అధ్యాత్మిక అధిదైవతముల తాపత్రయములచే కొట్టువడి మట్టుమీరిన జన్మపరంపరలలో తట్టుపడువాడేమూఢుడు. ఇదే వేదాంతశాస్త్రసిద్ధాంతము. ఇదే జీవేశ్వరజగత్సృష్టిక్రమము.

## 15. పంచభూత పంచీకరణ తత్త్వలయము.

### అందు, పృథివీభూత పంచీకరణ తత్త్వలయము.

పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము, ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి వాగింద్రియ మాయెను. ఇది ఆఆకాశమును విడిచి తన అర్ధభాగమందు చేరుసేని వాగింద్రియము లయించును.

పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము, వాయువు నందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి హస్తేంద్రియ మయ్యెను. ఇది ఆవాయువును విడిచి తన అర్ధభాగమందు కూడెనేని హస్తేంద్రియము లయించును.

పృథివి యందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము, అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి పాదేంద్రియ మాయెను. ఇది ఆఅగ్నిని విడిచి తన అర్ధభాగమందు కలిసెనేని పాదేంద్రియము పోవును.

పృథివి యందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగము, జల మందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగముతో చేరి గుహ్యేంద్రియ మాయెను. ఇది ఈజలమును విడిచి తన అర్థమందు కూడెనేని గుహ్యేంద్రియము లయించును.

పృథివియందలి సమష్టిభాగమైన అర్థభాగము పాయ్వింద్రియ మాయెను. దీనియందు తన వ్యష్టిభాగమైన అర్థభాగమున మరల కలిసెనేని పాయ్వింద్రియముపోయి పృథివీభూత మగును.

జలభూత పంచీకరణ తత్వలయము.

జలమందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము ఆకాశమందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి శబ్దతన్మాత్రమాయెను. ఇది ఈఆకాశమునువిడిచి తన అర్థభాగమందు చేరినేని శబ్దతన్మాత్రము లయించును.

జలమందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగము, వాయువందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగముతోచేరి స్పర్శతన్మాత్ర మయ్యెను. ఇది ఈవాయువునువిడిచి తన అర్థభాగమందు కలిసెనేని స్పర్శతన్మాత్రము లయించును.

జలమందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగము, అగ్నియందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగముతోచేరి రూపతన్మాత్ర మాయెను. ఇది ఈఅగ్నినివిడిచి తన అర్థ భాగమందు కూడెనేని రూపతన్మాత్రము లయించును.

జలమందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగము, పృథివియందలి అర్థభాగముయొక్క నాలుగుభాగములలో ఒక భాగముతోచేరి గంధతన్మాత్రమయ్యెను. ఇది ఈపృథివినివిడిచి తన అర్థ భాగమందు చేరినేని గంధతన్మాత్రము లయించును.

జల మందలి అర్థభాగ మైన అర్థభాగము రసతన్మాత్ర మాయెను. దీనియందలి తన వ్యష్టిభాగ మైన అర్థభాగము తిరుగా చేరినేని రసతన్మాత్రముపోయి జలభూత మగును.

ఈప్రకారమే తక్కిన అగ్ని వాయు ఆకాశపంచీకరణ తత్వలయ మని యెఱింగేది.

ఈపృథివియును, జలమును, అగ్నియును, వాయువును, ఆకాశ

మును పంచీకృతములైన తామసస్థూలములై మొదటిరీతిని నిలుచును.

## 16. సూక్ష్మశరీరతత్త్వలయము.

స్థూలశరీరము కర్మజ మగుటవలన కర్మము క్షీణించెనేని స్థూల దేహమును క్షీణించును. సూక్ష్మదేహము సహజమగుటవలన శత్రులచేత నఱకబడక నీళ్ళచేతనానక నిప్పుచేతకాలక గాలిచేతశోషింపబడక వృత్తి ప్రళయ నిత్యప్రళయ దేహప్రళయ మనుప్రళయ బ్రహ్మప్రళయ విష్ణుప్ర ళయ రుద్రప్రళయ ఈశ్వరప్రళయ సదాశివప్రళయ విరాట్పురుషప్రళయ ములయందును చెడక విదేహముక్తిపరియంతము ఉండును. ఇది చెడిన గాని ముక్తి కలుగదు, ముక్తికోరినవాడు దీనిని ముందుగా చెఱుపగోరక కారణశరీరమును చెఱుపవలయును. అది భ్రాంతిజమగుటవలన అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముచేత భ్రాంతిని నశింపజేసెనేని భ్రాంతివలన గలిగిన కారణశరీరమును నశించును. మఱి యీసూక్ష్మదేహము పైన జెప్పిన ప్రళయములయందు నశింపక కారణశరీరమందుచేరి కారణశరీర భ్రమ నివారించుదాక కాలకర్మవశములచేత మాటిమాటికి పుణ్య పాప మిశ్రకర్మ లభ్యములగు దేవపశుపక్షి క్రిమి జలచరస్థావరమానుష స్థూల శరీరములతో కూడుచు వీడుచు ఉండును. కారణశరీరభ్రమ నివారించు వేళ కారణశరీరము నశింపగానే కారణశరీరమందును నిల్వచోటులేక స్థూలశరీరమందును నిల్వతావులేక కాష్ఠరహిత మగు వహ్నిచందమున లయించును. అప్పుడాశరీరతత్త్వములు సమష్టివ్యష్టిభేదములతోడ క్షీణించి సత్త్వరజోభూతతన్మాత్రములై యుండును.

## 17. భూతలయము.

మలినసత్త్వప్రధానమగుప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణములు మూడును పంచభూతములతో కూడుటవలన సాత్త్వికపంచభూతము లని రాజసపంచభూతములని తామసపంచభూతములని మూడువిధములగును. ఆమలినసత్త్వప్రధానప్రకృతి బ్రహ్మవిచారణయందు అంతర్ముఖము గల దగును. అప్పుడు గుణవిజృంభణము అణగును. అందున పంచభూతములు త్రిగుణములతోడి కలయికమూని తోలుత గలిగినవి కలిగిన తీరుననే సూ క్ష్మాతిసూక్ష్మభూతములైనిలుచును.

## 18. సూక్ష్మాతిసూక్ష్మ పంచభూతలయము.

ప్రళయకాలములయందును, బ్రహ్మనిష్ఠయందును, పంచభూత

ములు లయించును. ప్రళయకాలభూత లయమువలన జన్మములకు కారణములయిన ఆగామి సంచిత ప్రారబ్ధకర్మములు లయింపక ప్రళయాంతములయందు మరల జన్మముల గలుగజేయును. బ్రహ్మవిచారమువలన పంచభూతములును, జన్మకారణము లయిన త్రివిధకర్మములును లయించుటవలన ముక్తు లగుదురు.

ప్రళయకాలసముద్రమందు మట్టిపెల్లకలిసి తనరూపము చెడినట్లు నూఱంతలు హెచ్చుగాగల జలమందు ఒకభాగమైన భూమి చేరి భూమియను పేరుపోయి జలభూతము నిలుచును.

కాలిన ఇనుపముక్కమీద నీటిచినుకుబడి నసించినట్లు నూఱుపాళ్లు హెచ్చుగాగల అగ్నియందు ఒక్కభాగ మైన జలము చేరి నశించి అగ్నిభూతము నిలుచును.

మహావాయువుచేత దీపము చల్లారినట్లు నూరంతలు హెచ్చుగాగల వాయువునందు ఒకపాలైన అగ్నిచేరి లయించి వాయుభూతము నిలుచును.

ముక్కులోనిగాలి వెలుపలికివచ్చి తెలియనట్లు నూఱుమడుగులు హెచ్చుగాగల ఆకాశమందు ఒకభాగమైన వాయువుచేరి వాయు వనెడు పేరుచెడి ఆకాశభూతము నిలుచును.

కాఱుచీకటియందు మిన్ను మన్ను కన్నులకు తెలియనట్లు నూరు అంశములు హెచ్చుగాగల విక్షేపశక్తియందు ఒకపాలైన ఆకాశము లయించి విక్షేపశక్తి నిలుచును.

## 19. ప్రకృతిలయము.

చిదాభాసరూపమైన మలినసత్త్వప్రధాన ప్రకృతిగుణములగు సత్త్వరజస్తమస్సులు మాయ అవిద్య ఆవరణశక్తులనెడు పేళ్లుగలవై వెలయును. పరబ్రహ్మఛాయ మాయ అవిద్య ఆవరణశక్తులయందు ప్రతిబింబించుటచేత ఈశ్వరుడును, జీవసమూహమును, వీరికి భోగసాధనములను కలుగజేయుటకు కారణమైన విక్షేపశక్తియును తోచెను. ఇట్టిమలినసత్త్వప్రధాన ప్రకృతి అచిత్తగుటవలన విచారదృష్టియందు మిథ్యాభూతమై తనకుజనకస్థానమైన చిత్ప్రకృతియందు తనత్రిగుణములతోడ కలయుగా, అపుడు ఈశ్వరజీవవిక్షేపములు మూడును క్షీణించి అమలసత్త్వప్రధానయగు చిత్ప్రకృతి నిలుచును. అది సద్రూపుడును, అన్నచ్ఛబ్ద ఆత్మాకాశబ్ద లక్ష్యార్థ

వాచ్యుడును, స్వజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుడును, స్త్రీపున్నపుంసకలింగరహితుడును, సర్వకార్యకారణవిలక్షణుడును, కేవలనిర్గుణుడును అగు పరమాత్మయందు లయించును. ప్రకాశోష్ణశక్తులును, అగ్నియును ఒక్కటేఅయినట్లు, ఈచిత్ప్రకృతియును, చిద్రూపపరబ్రహ్మమును, ఒక్కటేయని తలచనివానికి 'శ్రు॥ ద్వైతంసంసారమిత్యాహురద్వైతం పరమార్థతః' అను శ్రుతిప్రమాణమునకు విరోధము గల ద్వైతసిద్ధి గలుగక అద్వైతమే ప్రాప్తించును. కాబట్టి: 'శ్రు॥ ఏకమేవాద్వితీయంబ్రహ్మ' అను శ్రుత్యర్థమునెరిగి చిద్రూపిణియగు ప్రకృతియును, అస్మచ్ఛబ్దవాచ్యుడైన సద్రూపపరబ్రహ్మమును ఒక్కటే యనియును, ఆపరబ్రహ్మమే తాననియును తలచి అష్టవిధానందములలో శ్రేష్ఠమయిన ముఖ్యానందమును పొందువాడే ముక్తుడని వేదాంతసిద్ధాంతము.

## 20. దశవిధప్రళయవివరణము.

వృత్తిప్రళయము — ప్రాణుల పుణ్యాపాప మిశ్రకర్మ ఫలప్రాప్తి పరబ్రహ్మస్వరూప మయిన నిరాకార చిదాకాశమందు అణగియుండి జీవుల అదృష్టానుసారముగ కాలకర్మానుగుణ్యముచేత సముద్రమున అలలు, బుగ్గలు, తుంపురులును పుట్టుచు అణగుచు ఉండునట్లు చిదాకాశమున ప్రాప్తాప్రాప్తముగ వృత్తులుపుట్టుచు గిట్టుచు నుండును. అపుట్టిగిట్టెడి ఏమిలేని వట్టిబట్టబయలే వృత్తిప్రళయము.

అవస్థాప్రళయము — ఆవృత్తియే బలిసి అనేకవ్యవహారములను చేయుటకు జీవుల కాలకర్మవశముల జాగ్రత్స్వప్నావస్థలు గల స్థూలసూక్ష్మశరీరములనుపొంది వెలుపలికి వచ్చి వ్యాపించుచు లోపించుచు వుండును. ఆలోపించిన ఎడమేనిద్ర, ఆనిద్రయే నిత్యప్రళయము.

శరీరప్రళయము — పిమ్మట ఆవృత్తులేప్రబలి జాగ్రదాద్యవస్థలతో గూడి నిమేషము, కాష్ఠ, కల, క్షణము, ముహూర్తము, అహోరాత్రము అనునవి గలిగినది దినము అట్టిదినము పక్ష, మాసము, ఋతువు, అయనము అనువానితో గూడినది సంవత్సరము. అట్టిసంవత్సరము లమితిప్రకారముజీవించి మృతినొందుటే శరీరప్రళయము.

మనుప్రళయము — శుక్లకృష్ణపక్షములే అహోరాత్రముగా గల పితృదేవతులయొక్క ఒకదినము మనుష్యుల కొకమాసము, అట్టిమాసములు పండ్రెండయ్యేనేని మనుష్యుల కొకసంవత్సరము, అదే దేవతల

కొకదిన మగును, అట్టిదినములు మున్నూటరువదీ యయ్యేనేని దేవతలకు సంవత్సరమగును. అవి పండ్రెండువేలు గడచెనేని పదిహేడులక్షల యిరువదియెనిమిదివేలసంవత్సరములు గల కృతయుగంబును, పండ్రెండులక్షల తొంబదియారువేలసంవత్సరములు గల త్రేతాయుగంబును, యెనిమిది లక్షల అరువదినాలుగువేలసంవత్సరములు గల ద్వాపరయుగంబును, నాలుగులక్షల ముప్పదిరెండువేలసంవత్సరములుగల కలియుగంబును గడచును. ఈనాలుగుయుగంబులనుగూడిన దేకమహాయుగము. అవి డెబ్బది యొక్కటయ్యేనేని ఒకమనువుచచ్చును. ఇదే మనుప్రళయము.

బ్రహ్మప్రళయము — అట్టిమన్వంతరములు పదునాలుగుగడచెనేని చతుర్ముఖబ్రహ్మ కొకపగలగును. ఆపగటిలో స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస రైవత చాక్షుష వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణి ఇంద్రసావర్ణి అనెడు పదునాల్గు మనువులున్ లయించుదురు. ఇకనంత కాలముకడచెనేని బ్రహ్మకు రాత్రియగును. ఇందులో పగలు ఉదయకల్పమని, రాత్రి క్షయకల్పమని చెప్పబడును. ఇట్టిదినములు మున్నూటరువదియయ్యేనేని బ్రహ్మకొకసంవత్సరమగును. అట్టిసంవత్సరములు నూరుకడచెనేని బ్రహ్మప్రళయమగును.

విష్ణుప్రళయము — బ్రహ్మజీవితకాలము విష్ణువున కొకమాసము. అట్టిమాసములు పండ్రెండు కూడిన దొకసంవత్సరము. అట్టిసంవత్సరములు నూరుకడచెనేని విష్ణువు మరణించును. ఈవిష్ణుప్రళయములోపల బ్రహ్మ లనేకు లగుదురు.

రుద్రప్రళయము — విష్ణువుయొక్కజీవితకాలము రుద్రమూర్తి కొకదిన మగును, అట్టిదినములు మున్నూటరువదికూడిన దొకసంవత్సరము. అట్టిసంవత్సరములు నూరైన రుద్రుడు మృతినొందును. ఆరుద్రునిజీవితకాలములోపల ననేకవిష్ణువులు పుట్టి గిట్టుదురు. ఇదే రుద్రప్రళయము.

మహేశ్వరప్రళయము — రుద్రమూర్తి ఆయుష్యమంతయు మహేశ్వరున కొకజాము. అట్టిజాములు యెనిమిది కలది దినము. అట్టిదినములు ముప్పదికలది ఒకనెల. అట్టినెలలు పండ్రెండైన సంవత్సరము. అట్టిసంవత్సరములు నూరైన మహేశ్వరుడు లయించును. ఆమహేశ్వరుని జీవితకాలములోపల రుద్రు లనేకులు పుట్టి గిట్టుదురు.

సదాశివప్రళయము — మహేశ్వరుని ఆయుస్సంతయు సదాశివునికి

రెండుగడియలకాలము. దీనినేముహూర్తమందురు అట్టిముహూర్తములు ముప్పదికలది దినము. అట్టిదినములు మున్నూటరువదికలదిసంవత్సరము. అట్టిసంవత్సరములు నూరయ్యేనేని సదాశివుడు లయించును. అతనాయుస్సులోగా అనేకమహేశ్వరులుపుట్టి గిట్టుదురు. ఇదే సదాశివప్రళయము

విరాట్పురుషప్రళయము — సదాశివుని ఆయుఃప్రమాణమంతయు విరాట్పురుషున కొక్కక్షణ మగును. అట్టిక్షణములు మున్నూటరువది గలది ఓకదినము. అట్టిదినములు మున్నూటరువదిగలది ఒకసంవత్సరము. అట్టిసంవత్సరములు నూరయ్యేనేని మాయాప్రతిబింబేశ్వరుడయిన విరాట్పురుషుడు నశించును. అతనిజీవితకాలములోపల అనేకసదాశివులు ఉదయించి లయింతురు. ఇదే విరాట్పురుషప్రళయము. ఇట్టిప్రళయములు చిదచిత్స్వరూపిణి యగు మూలప్రకృతియందు కలుగుచు మెలుగుచు నుండును. బ్రహ్మనిష్ఠగల మహాపురుషుడు ప్రకృతిని లయింపజేసి పరబ్రహ్మమై వెలుగును. ఇట్లని కైవల్యనవనీతము. //

## 31. పంచకర్తలు.

| | | | | |
|---|---|---|---|---|
| బ్రహ్మ | విష్ణు | రుద్రుడు | మహేశ్వరుడు | సదాశివుడు |
| సరస్వతి | లక్ష్మి | పార్వతీ | ఉన్మనీ | మనోన్మనిపత్నులు |

## 32. అయిదువిధములయిన తెలివిగల ప్రాణులనిర్ణయము.

రాళ్లు కొండలు ఒక తెలివిలేనివి అని గ్రహించవలెను.

ఒక తెలివిగల ప్రాణులు చెట్లు చేమలు మొదలగు రసమును దెలియునట్టి వక తెలివిగల ప్రాణులు.

రెండు తెలువులుగలవి చిప్పలు, శంఖములు, మత్స్యములు మొదలగు జలచరములు నడయాడగలిగిన రెండు తెలువులుగల ప్రాణులు.

మూడు తెలువులుగలవి చెదలు, చీమలు మొదలగు ప్రాకెడిజంతువులు గంధమును దెలియునట్టి మూడు తెలువులుగల ప్రాణులు.

నాలుగు తెలువులుగలవి పశువులు, పక్షులు, భ్రమరములు మొదలగునవి రూపమును దెలియునట్టి నాలుగు తెలువులుగల జీవములును.

అయిదు తెలువులు గలవి మనుష్యులు మొదలగువారు శబ్దస్పర్శ రూపరసగంధముల నెరిగిన ఐదు తెలువులుగల ప్రాణులు.

పైగాని ఒక తెలివిగల ప్రాణులతప్ప తక్కినప్రాణులను హింస సేయరాదనిభావము. ఇట్లు త్రివర్గప్రదీపికయందు,

## 23. పంచభూతబీజవివరణచక్రము.

| బీజభూతనామములు. | వాయుబీజాక్షరములు. | అగ్నిబీజాక్షరములు. | భూబీజాక్షరములు. | జలబీజాక్షరములు | ఆకాశబీజాక్షరములు. |
|---|---|---|---|---|---|
| బీజసంఖ్య. | ఈ 10 | ఈ 10 | ఈ 10 | ఈ 10 | ఈ 10 |
| పాదులు. | ష | స | హ | ళ | అః |
| యాదులు. | య | ర | ల | వ | శ |
| పవర్గు. | ప | ఫ | బ | భ | మ |
| తవర్గు. | త | థ | ద | ధ | న |
| టవర్గు. | ట | ఠ | డ | ఢ | ణ |
| చవర్గు. | చ | ఛ | జ | ఝ | ఞ |
| కవర్గు. | క | ఖ | గ | ఘ | ఙ |
| గురులఘుమేళనంబులు | ఎ | ఐ | ఒ | ఔ | అం |
| దీర్ఘస్వరములు | ఆ | ఈ | ఊ | ౠ | ౡ |
| లఘుస్వరములు | అ | ఇ | ఉ | ఋ | ఌ |

ఇట్లు అప్పకవీయమందు.

వీనిలో అకారాదిషోడశస్వరములును, జీవాక్షరములును, యకారాదిదశాక్షరములును, ప్రాణమాత్ర్కాబీజాక్షరములును కూటచేత వీనిని త్రోయగా, తక్కిన యిరువదియైదువర్ణములును ఇరువదియైదుతత్వములని సకల సమయవాదులును నిర్ణయించియుండుటచేత వీనికి పంచభూతబీజ ప్రకారముగా పంచీకరణము వ్రాయబడుచున్నది.

ఆకాశబీజపంచీకరణము.

మకారము, జ్ఞాతచేతనుడు
నకారము, మనస్సు
ణకారము, బుద్ధి
ఙకారము, చిత్తము
ఞకారము, అహంకారము

వాయుబీజపంచీకరణము.

పకారము, సమానవాయువు
తకారము, వ్యానవాయువు
టకారము, ఉదానవాయువు
చకారము, ప్రాణవాయువు
కకారము, అపానవాయువు

అగ్నిబీజపంచీకరణము.

ఫకారము, శ్రోత్రము
థకారము, త్వక్కు
ఠకారము, చక్షువు
ఛకారము, జిహ్వ
ఖకారము, ఘ్రాణము

జలబీజపంచీకరణము.

భకారము, శబ్దము
ధకారము, స్పర్శము
ఢకారము, రూపము
ఝకారము, రసము
ఘకారము, గంధము

పృథివిబీజపంచీకరణము.

బకారము, వాక్కు
దకారము, హస్తము
డకారము, పాదము
జకారము, గుహ్యము
గకారము, పాయువు

ఇట్లని కైవల్యనవనీతమందు

## ౩౪. ఆవరణవిక్షేపశక్తులతారతమ్యములు.

దూష్యమైన తమోగుణమువలన బుట్టిన ఆవరణవిక్షేపశక్తులలో విక్షేపశక్తివలన మనస్సంకల్పరూపమైన ప్రపంచవిభాగ మంతయును కలిగెను. ఆవరణశక్తి ఉపమానరహితమైన పరమాత్మను ప్రత్యగాత్మ యగు తన్నుగా శ్రుతియుక్త్యనుభవములచేత తెలిసికొనిన బ్రహ్మజ్ఞానులను తప్ప బ్రహ్మము లేనే లేదు ఉండెనేని యేలకనబడ దనివాదించు బౌద్ధచార్వాక క్షపణ లోకాయతిక లౌకికశూన్యవాదులు మొదలయిన మూఢజనుల తెలివిని అపహరించి వారిజననమరణాది దుఃఖములకు మూలమగును.

ఇదియే ఆవరణశక్తి.

మరియు, నీఆవరణశక్తి అద్వితీయమగు పరబ్రహ్మమును తప్ప బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులను విరాట్పురుషుని స్థావరజంగమరూపము లైన సర్వప్రాణులను వీరలఅంతర్బహిర్ద్రవ్యనామరూపములను పదునాల్గు లోకములను రెప్పపాటుమొదలు బ్రహ్మాదిప్రళయములపర్యంతమైనకల్పితకాల మును నిమేషాదివిభాగములులేని అఖండాకారకాలమును ఆకాశాదిపంచ భూతములను తూర్పు మొదలగు పదిదిక్కులను, ముప్పదిమూడుకోట్ల దేవ తలును, వీరిస్వభావగుణములను వివేకములను ప్రకాశింపనీయక పుట్టుట గిట్టుట మొదలగునవి కార్యములను కలుగజేయుటకు శూన్యరూపము గల దై వెలుగును.

విక్షేపశక్తి జగద్రూపముగాపరిణమించునది గావున, దుఃఖమును కలుగజేయునది యగుటచేత చెడ్డదనేపక్షమున ఆవిక్షేపశక్తివలన బుట్టిన స్థూలసూక్ష్మదేహములతోడను, అంతరేంద్రియ జ్ఞానేంద్రియ కర్మేంద్రి యములతోడనుకూడి సకల పుణ్యకర్మములనుచేసి చిత్తశుద్ధిగలిగి సాధన చతుష్టయసంపన్నుడై సద్గురువులసన్నిధియందుచేరి వేదాంతశాస్త్రశ్రవణ మననని దిధ్యాసములను జేసి బ్రహ్మజ్ఞానమును సంపాదించి ముక్తిని పొంద వలెను. గనుక, సకలజీవులకును పట్టపగలు మనోహరమైన రాత్రి కానట్లు బ్రహ్మజ్ఞానమును ప్రబలించి ముక్తినిలభింపజేయుటకు సాధనమైన విక్షేప శక్తి దొడ్డదై బ్రహ్మజ్ఞాననాశనకారణమైన ఆవరణశక్తి చెడ్డదేనగుననితా.

వృత్తిప్రళయము మొదలు ప్రకృతిప్రళయమువరకు గల సకల ప్రళ యములయందు పదునాలుగులోకములును, లోకాధిపతులును, లోకస్థు లయిన సమస్తప్రాణులునుగిట్టి అజ్ఞానరూపముగలదై సకలజీవులవిజ్ఞానము అపహరించుచున్నట్టి ఆవరణశక్తిమహిమవలన మరలబుట్టుచున్నారుగాని, వారిలో ఒక్కప్రాణియైన ముక్తినిపొందినట్లు కనబడలేదు గనుక, విక్షేప శక్తికంటె ఆవరణశక్తి మిక్కిలి చెడ్డదని తాత్పర్యము.

మరియు, విక్షేపశక్తి ఆవరణశక్తిని ఖండించి వెనుక ఆవిక్షేపశక్తి యును నశించునదెట్లనిన, పండితులు శుద్ధమాయయైన విక్షేపశక్తిచేత అశుద్ధమాయయైన ఆవరణశక్తిని ఖండింతురు. పిమ్మట కట్టె శ్మశానమం దలి పీనుగును గాల్చి వెనుక తానును కాలినతీరున విక్షేపశక్తి ఆవరణశక్తి తోడనే నశించును. ఇట్లని కైవల్యనవనీతమందు.

అజ్ఞానము ఆవరణము, విక్షేపము మొదలగు సప్తావస్థలలక్షణము ఈగ్రంథములో సప్తసంఖ్యాప్రకరణమందు వ్రాయబడియున్నది.

### ౨౫. త్రిపుటులవివరము.

| అంతరేంద్రియములు. | వానివృత్తులు. |
|---|---|
| జ్ఞాతృ | - తెలుసుకొనునది, తెలివి, తెలియబడునది. |
| మనస్సు | - సంకల్పించునది, సంకల్పము, సంకల్పింపబడునది. |
| బుద్ధి | - నిశ్చయించునది, నిశ్చయము, నిశ్చయింపబడునది. |
| చిత్తము | - చలించునది, చంచలము, చంచలింపబడునది. |
| అహంకారము | - అభిమానించునది, అభిమానము, అభిమానింపబడునది. |
| **మధ్యేంద్రియములు.** | **వృత్తులు.** |
| శ్రోత్రము | - వినునది, వినికిడి, వినబడునది. |
| త్వక్కు | - స్పృశించునది, స్పర్శము, స్పృశింపబడునది. |
| చక్షువు | - చూచునది, చూపు, చూడబడునది. |
| జిహ్వ | - రసములనెరుగునది, రసము, రసముకలది, |
| ఘ్రాణము | - వాసనచూచునది, వాసన, వాసనకలది. |
| **బాహ్యేంద్రియములు.** | **వృత్తులు.** |
| వాక్కు | - పలుకునది, పలుకు, పలుకబడినది. |
| పాణి | - ఇచ్చునది, ఈవి, ఈయబడినది. |
| పాదము | - నడుచునది, నడక, నడువబడినది. |
| పాయువు | - విడుచునది, విడుపు, విడువబడినది. |
| గుహ్యము | - ఆనందించునది, ఆనందము, ఆనందింపచేయునది. |

ఈవృత్తు లన్నియును సత్వరజస్తమస్సు లనెడు గుణభేదములచేత ఆనందములైయుండును. ఆత్రిగుణములు గలది. మలినసత్వప్రకృతి. ఆ ప్రకృతియొక్క చేరికకలది మనస్సు. కాబట్టి, పైజెప్పబడిన వృత్తు లెల్లను మనస్సున బుట్టుచు పెరుగుచు గిట్టుచునుండును. త్రిపుటియనగా, మూడు వృత్తులు గలది.

### 2౬. అరువదినాలుగువిద్యలవివరణము.

ఇతిహాసములు-పూర్వపుకథలు.

ఆగమములు-ఇవి కామికాది ఇరువదియెనిమిది శైవాగమములు.

కావ్యములు-మాఘము, నైషధము, రఘువంశము మొదలగునవి.

అలంకారము-ఉపమ, ఉత్ప్రేక్ష, ఉల్లేఖ మొదలగు శతాలంకారములు.
నాటకములు-ఆటపాటలతో చేరిన శాకుంతలము మొదలగునవి.
సంగీతము-శృతి, స్వర, లయ, జ్ఞానము.
కవిత్వము-ఇరువదియారు భేదములుగల ఛందోభేదములు.
కళాశాస్త్రము-పద్మిని, హస్తిని, శంఖిని, చిత్తిని మొదలగు స్త్రీల కళల గ్రహించుట.
ద్యూతము-చదరంగము మొదలగు జూదముల నాడుట.
సర్వభాషాజ్ఞానము-ఏబదియారు దేశముల భాషలు వ్రాయుట, చదువుట, సంభాషించుట.
చిత్రలేఖనము-చిత్రముల లిఖించుట.
వాచకము-అడ్డములేక పాంచాలశాకాటములుగా జదువుట.
అవధానము-బుద్ధినిల్కడ, అది అష్టావధాన,శతావధానము మొదలగునవి చేయుట.
స్వరశాస్త్రము-ఇడాపింగళనాడులయందు సూర్య చంద్ర స్వరకాలతత్త్వములగ్రహించుట.
శకునశాస్త్రము-పాలగరుడ వాయస గౌతమివలన శకునముల చూచుట.
సాముద్రికము-హస్తపాదాది రేఖలపరీక్ష.
రత్నశాస్త్రము-నవరత్నముల పరీక్షించుట.
గజతురగరథగతికౌశలము-వానిలక్షణములను, ఆరోహణావరోహణగమనాదులను గ్రహించుట.
గరడి-సాము, మల్లవిద్య మొదలగునవి తెలుపుట.
పాకశాస్త్రము-పచనకర్మ తెలుపుట.
భూరుహదోహదము-వృక్షములతన్ని కౌగలించి ఉమిశిపుష్పింపఫలింపను ఆరోహణావరోహణములు మొదలగునవి చేయుట.
గంధవాదము-దూరముగా నుండెడి నరమృగాదులను వాసనచే నిదియదియని తెలిసికొనుట.
ధాతువాదము-స్వర్ణాదిసకలవస్తువుల నెరుంగుట.
ఖనివాదము-రత్నము, ధనము మొదలగునవియుండెడిచోటుల నెరుగుట.
రసవాదము-మూలికలచే వెండి, బంగారము మొదలగునవి చేయుట.
జాలవిద్య-వలనొడ్డి మృగ పక్షి జలచరముల బట్టుట.
అగ్నిస్తంభనము-అగ్నిని కట్టుట.
ఖడ్గస్తంభనము-ఎత్తినఆయుధములను నిల్చునటుల జేయుట.
జలస్తంభనము-నీటినిగట్టుట
వాయుస్తంభనము-వాయువునిల్పుట.
వాక్స్తంభనము-మాటలాడకుండునటుల జేయుట.

వయస్తంభనము-యువ్వనము జారిపోకుండునటుల జేయుట.
మోహనము-భ్రమపఱచుట.
వశ్యము-స్త్రీపురుషరాజదుష్టమృగాదుల వశపరచుకొనుట.
ఆకర్షణము-దేవభూతనరధనాదివస్తువుల రప్పించుకొనుట.
విద్వేషణము-విరోధములు కలుగజేయుట.
ఉచ్చాటనము-వెళ్ళిపోవునటుల జేయుట.
మారణము-చంపుట.
కాలవంచనము-కాలమును మోసపుచ్చుట.
మాలినిశాస్త్రము-ఓడలను నడిపించుట.
పాదుకాసిద్ధి-క్షణమాత్రములో దూరదేశమునకు పోవుట, వచ్చుట.
మృత్సిద్ధి-మంటిని గ్రహించి భూమిలోనుండెడిశల్యాదులను గ్రహించుట.
ఘుటికాసిద్ధి-రసఘుటిక గ్రహించి ఆకాశగమనము మొదలుగా అనేకక్రియల జేయుట.
ఇంద్రజాలము-టక్కుడమరకము, హస్తలాఘవము, గజకర్ణము, గోకర్ణము మొదలగు జాలముల జూపుట.
మహేంద్రజాలము-యెవ్వరికిని తెలియ నలవిగాని హాశ్చర్యకరములయిన క్రియల జూపుట.
అంజనసిద్ధి-కాటుకలచే దేవభూతపిశాచుల చోరధనాదుల కనిపెట్టుట.
నరదృష్టి-మానుషజ్ఞానముచేత జూచెడి వశకర్మ.
వంచించుట-దొంగతనము మొదలైన పనులచేత ఇతరుల మోసపుచ్చుట.
స్వరవంచనము-ఇతరులు పాడెడి స్వరముల మోసపుచ్చుట.
మణిసిద్ధి-మణియను పేరుగల ఒకమాత్రచేత విషజంతువులు మొదలగు వానినికట్టుట.
మంత్రసిద్ధి-సప్తకోటిమహామంత్రముల వశపరచుకొనుట.
ఔషధసిద్ధి-వైద్యశాస్త్రముచేత ఔషధముల గ్రహించుట.
అణిమాదిసిద్ధి-అణిమామహిమా మొదలగు అష్టైశ్వర్యముల పొందుట.
ఉదకర్మము-ఈపేరుగల ఒకవిద్య.
వేత్ర-బెత్తము, లోహ-పంచలోహములు, అశ్మ-రాళ్లు, మృత్-మన్ను, దారు-కొయ్య, వేణు-వెదురు, తంతు-నూలు, సూచి-సూదల పని వీనిచే నయ్యెడి పనుల గ్రహించుట.
అదృశ్యకరణి-అనేకులలో తాను అగుపడకుండుట.
దూరదృష్టి-దూరముగా నుండెడివానిసంగతి తెలుసుకొనుట.

దూరశ్రవణము-దూరముగా నుండెడివారిమాటలను వినుట.
మృగయారతి-వేటయందలి ఆసక్తి.
వాణిజ్యము-వర్తకము.
పశుపాలనము-పశువుల పాలించుట.
కృషి-వ్యవసాయము.
ఆహవకర్మ-యుద్ధముచేయుట.
మృగపక్షియుద్ధకౌశలము - లావుక, కుక్కుట, మేషాదియుద్ధముల చమత్కరించుట.

## 27. అష్టప్రమాణముల వివరణము.

ప్రత్యక్షోభయసంశయంబులు పదార్థజ్ఞానమానంబులై ప్రత్యగ్వస్తువు దెల్పలేవు అగుటచేత ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము అనునవి అష్టప్రమాణములు. సచ్చిదానందనిత్యనిర్మలము లనెడి పంచలక్షణములే స్వరూపముగ గలిగి అనృతజడదుఃఖానిత్యమలినము లనెడి పంచలక్షణ స్వరూపముగా తోచబడెడు ప్రకృతిని మీరివెలుగునది పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమునందు కాలత్రయ మనునది లేకనేయున్నట్లుగా అజ్ఞానులకు తోచబడెడి ప్రకృతివలన గలిగినది ప్రపంచము. ఆప్రపంచము రూపనామములు గలది. అందు దశవిధరూపములను గ్రహించునది నేత్రము, అక్షరగుణకము, ధ్వనిగుణకము, స్వరగుణకము, మిశ్రగుణకము అనెడు నాలుగువిధములైన శబ్దములను గ్రహించునది శ్రోత్రము. కాబట్టి, యీ రూపనామములను తెలియజేయునవి. ప్రత్యక్షము, ఉపమానము, అనుమానము అనెడి ప్రమాణములు. అందు ఇంద్రియములకును ఇంద్రియ విషయములైన శబ్దస్పర్శాదులకును చేరిక గలుగుట ప్రత్యక్షప్రమాణము. అది ఘటప్రత్యక్షము, ఘటత్వప్రత్యక్షము, ఘటరూపప్రత్యక్షము, ఘటరూపత్వప్రత్యక్షము అని నాలుగువిధములు. అందు ఘటమునకును, నేత్రమునకును చేరిక గలుగుట ఘటప్రత్యక్షము. ఇది సంయోగమనబడును. పూర్వము ఘటజాతిని జూచి యుండుటచేత ఇది ఘటమని యెరుగుట ఘటత్వప్రత్యక్షము. ఇది సమవేత మనబడును. కంబుగ్రీవాది మత్త్వము ఘటరూపప్రత్యక్షము అనగా ఘటముశంఖము మొదలగువానివంటిమెడ గలిగియుండు ఘటరూపప్రత్యక్షమనిభావము. ఇదియును సంయోగ మనబడును. పూర్వము ఘటరూపజాతిని చూచియున్నందున ఇదియును ఘట

రూపముగా నెఱుగుట ఘటరూపత్వప్రత్యక్షము. ఇది సమవేతము. ఈ ప్రమాణము ఇంద్రియజన్యమగుటచేత అతీంద్రియమైన పరబ్రహ్మమును చూపనేరదు. ఇది దేహాత్మవాదులైన జైన, బౌద్ధ, చార్వాక, క్షపణ, సౌగత, అర్హత, మాయావాది, ద్వైత, మూర్త్యంతర, మతాంతర, దేవతాంతర, నైయాయిక, వైశేషిక మతస్థులకు ముఖ్యము.

అనుమానప్రమాణమనగా, యుక్తిచేత సాధింపబడునది. ఆయుక్తి ప్రతిజ్ఞ, పక్షము, సాధ్యము, హేతువు, దృష్టాంతము అనెడు పంచావయవవాక్యములతో గూడినది. అందు, 'పర్వతోవహ్నిమాన్' అనగా, పర్వతము నిప్పుగలది అనునది ప్రతిజ్ఞ, ఆయగ్నియుండుటకు స్థానమైనందున పర్వతము, పక్షము దానియందు సాధింపబడునట్టి అగ్ని సాధ్యము, ఆసాధ్యమునకు పర్వతముమీదనుండెడి పొగ కారణమగుటచేత పొగ హేతువు వంటయింటిమీది పొగనుచూచి అక్కడినుండి నిప్పు తెచ్చుట వలన వంటయిల్లు దృష్టాంతము.

ఈప్రకారము ద్రాష్టాంతమైన పరబ్రహ్మమును తెలిసికొనుటకు పంచావయవవాక్యములును, వానియర్థములును, పరబ్రహ్మమునకు ముందే యుండవలశివచ్చును. ఈపరమాత్మ నిరాధారుడును, నిరవయవుడును, నిష్క్రియుడును, నిరంజనుడును, జగత్కారణుడును, అనాదియునుఅగుట వలన ఈప్రమాణముచేత పరబ్రహ్మము సాధింపశక్యముగాదు. ఉపమాన ప్రమాణము, ఇంద్రియములకును, ఇంద్రియవిషయములైన శబ్దస్పర్శాదులకును చేరికగల ప్రత్యక్షప్రమాణముతోడను, యుక్తిసాధ్యమైన అనుమాన ప్రమాణముతోడను కూడినది. గనుక, ఉభయాత్మక మనబడును. లేక, 'గోసదృశోగవయమృగః' ఆవువలె నుండునది గవయమృగము, అనగా, ఒకడు విని వాడడవికిబోయి దానినిజూచి ఇది గోవువలె నున్నది గనుక, గవయమృగ మని యెరిగినట్లు ఉపమానోపమేయాత్మక మగుటచేత ఈ ప్రమాణము ఉభయాత్మక మనబడెను, మరియును, ఇది గుణోపమ, కర్మోపమ, ప్రయోజనోపమ అని తొలుతమూడువిధములు. మరియు నివిధోహీనోపమ, సమానోపమ, గుప్తోపమ, ప్రకటోపమ, విరోధోపమ, నిజోపమ, సంశయోపమ అని బహుభేదములచేత అలంకారశాస్త్రమందు చెప్పబడియున్నవి. పగడమువంటిది పెదవియనుట. గుణోపమ మీనము వంటిది నేత్రమనుట. కర్మోపమ మేఘమువంటిది హస్తముఅనుట. ప్రయో

జనోపమ యిట్లన్నియు నూహ్యములు. మరియు, 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ నేహనానాస్తికించన సాక్షీచేతా కేవలోనిర్గుణస్స్యాత్' అను శ్రుతులనుబట్టి సర్వము పరమాత్మే యగుటవలన ఉపమానమునకు త్రికాలములయందును బోల్పదగిన వస్తువు వేరొక్కటి లేకపోవుటచేతను, నిరుపముడగుటచేతను ఈప్రమాణము ఆయనను జెప్ప జొప్పడదు. మరి యీమూడుప్రమాణములును వేదాంతములయందు ముఖ్యములు గావు. శబ్దప్రమాణ ప్రత్యక్షోపమానా నామనుమానప్రమాణములు నాలుగునై యాయిక వైశేషికుల మతమందు గలవు. శబ్దప్రమాణమునకే ఆగమ ప్రమాణమని పేరు. ఆగమము లనగా, వేదశిరస్సులైన యుపనిషత్తులు అవి వేయున్నినూటయెనిబది. వానిలో నిప్పుడు నిల్చియున్నవి నూటయెనిమిది. వానిలో ముఖ్యములుపది. అవిగాక దశోపనిషత్తు లనబడును అన్ని యుపనిషత్తుల అభిప్రాయమును దశోపనిషత్తునందు చెప్పబడును. కాబట్టి దీనికే శ్రీశంకర భగవత్పాదులవారు భాష్యము చేసిరి. అట్టి యుపనిషద్వాక్యములుఅవాంతరవాక్యములని మహావాక్యములని రెండువిధములు. అందు గుణవాక్యములు, క్రియావాక్యములు, జాతివాక్యములు, విధివాక్యములు, నిషేధవాక్యములు అని అవాంతరవాక్యములు అయిదువిధములు. మహావాక్యములనగా, జీవేశ్వరులయందు వాచ్యార్థములనువదలి లక్ష్యార్థమును చూపి ఐకమత్యమును నిర్ధారణచేయు తత్వమస్యాదిమహావాక్యములు, వీనిని మహావాక్యరత్నావళియందు తెలియ నగును. ఈ వాక్యాదులచేత పరబ్రహ్మము ప్రతిపాదింపబడును. కాబట్టి, యీఆగమ ప్రమాణము బ్రహ్మవేత్తలకు ముఖ్యమగును. ఇదియును శాఖాచంద్రవతుగాను, కాకవత్ గృహమిత్యాదున్యాయముగాను బ్రహ్మమును జూపి దిగువపడును గనుక, పరావాణికిఁ వ్యత్యస్తం బగునని చెప్పబడినది.

అర్థాపత్తియనునది శ్రుతార్థాపత్తి, దృష్టార్థాపత్తియని ద్వివిధము. వీనిలో శ్రుతార్థాపత్తి యనగా, దేవదత్తుడనువాడు గృహములో నున్నాడని యొకడు చెప్పగా విని అచ్చటికిబోయి విచారించినంతట వాడచ్చట లేడని ఆయింటిలోనివారు చెప్పినందున ఇప్పు డక్కడ లేకుండినను మరి యొక సమయములో చూడవచ్చు నని నిశ్చయించుకొనుట. ఇందువలన ద్రాష్టాంతమందు బ్రహ్మజ్ఞానము ఇప్పుడు ప్రాప్తించకపోయినను సత్కర్మానుష్ఠానమువలన క్రమక్రమమున బొంద నగు నని తెలిసికొనుట,

దృష్టార్థాపత్తి యనగా, ఒకడు పగలు భోజనము చేయక సదోపాసి నని చెప్పుకొనినను, వానిని చూచినప్పుడు వానిశరీరపీనత్వమును చూచి రాత్రి కాలములయందు నెవ్వ రెరుంగకుండా భుజించువా డని తెలిసికొనుట. ద్రాష్టాంతమందు వ్యోమాదిప్రపంచమును చూచి దీనిని నిర్మించినవాడు ఒక డుండునని గ్రహించి ఆయనను ఉద్దేశించి సత్కార్మముల చేయుట. అనుపలబ్ధి యనగా, అభావము. అది ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము, అత్యంతాభావము అని నాలుగువిధములు. ఘటోత్పత్తికి ముందు ఉండిన ఘటాభావము, ప్రాగభావము. దీని కీలక్షణము. ఉత్పత్తిలేక నే నాశముకలది. యెట్లనగా, ఘటోత్పత్తికిపూర్వము యంత కాలమునుండి యాఘటాభావము గలిగియున్నదో, దానికి ప్రతియోగి యైన ఘటము పుట్టినపుడు ఆయభావము నాశమగుట. దీనికి ద్రాష్టాంత మందు జ్ఞానోత్పత్తికి ముందుండిన జ్ఞానాభావమనియెరుంగునది. ప్రధ్వంసాభావమనగా, ఘటము పుట్టి యాఘటముపగిలినప్పుడుకలిగిన అభావము దీనికిలక్షణము. ఉత్పత్తికలిగి నాశములేనిది. ఇది ద్రాష్టాంతమందు బ్రహ్మ జ్ఞానము జెడినప్పుడు పుట్టువు నాశము లేనిది. అన్యోన్యాభావ మనగా, చీకటియందు ప్రకాశము ప్రకాశమందు చీకటి లేనట్లు దీనికి లక్షణము. అప్పుడప్పుడే ఉత్పత్తినాశములు కలుగుటలు. ఇదిద్రాష్టాంతమందు జ్ఞానాజ్ఞానములవలె వకటిగలిగినప్పుడు మరియొకటినశించువిధమున జొప్పడును. అత్యంతాభావమనగా, ఎప్పుడును ఘటోత్పత్తిలేకుండుట దీనికిలక్షణము. ఉత్పత్తినాశములు రెండును లేకపోవుట. దీనిచే ద్రాష్టాంతమున పరబ్రహ్మ మందు అజ్ఞాన మెప్పుడు లేనందున ఉత్పత్తినాశములు లేవని యెరుగుట. సంభవమనగా, నూరులలో పదులున్నట్లు కలలోనూరులున్నట్లు లక్షలో వేలున్నట్లుగా తెలియతగ్గది. ద్రాష్టాంతమున పరబ్రహ్మమందు జగత్తు కలదుగాతోచుట. ఐతిహ్యమనగా, వకచెట్టునందు బ్రహ్మరక్షస్సుయున్న దని యొకడు యెప్పుడో చెప్పగా, ఆమాట నానాట నందరువీని అచ్చోటికి విచ్చేసినప్పుడు ఆమాటను జ్ఞప్తికి తెచ్చుకొని భీతిజెందుట. మరియు, నొకమనుజుడు యొకవృక్షముమీద గుడ్డపేలికలచించి పారవేశి పోయిన దానిని చూచినవా రందరు కారణముచు విచారించక ఆప్రకారమే జరుపుట. దీనివల్ల ద్రాష్టాంతమందు వస్తుయాదార్థ్యమును తెలుపుట కనేక శాస్త్రములు ఉండగా, వానిని పరిశీలింపక గుడ్డెద్దు చేనిలో పడినట్టును

వకగొఱ్ఱె పల్లములో దుమికిన దానిని వెంబడించిన తక్కినగొఱ్ఱెలన్నియు పడుకొని భ్రమచేత తిరుగుచుండుటయని తెలిసికొనదగ్గది. పైజెప్పిన అష్ట ప్రమాణములలో అర్థాపత్తి మొదలుకొని ఐతిహ్యమువరకుగల నాలుగు ప్రమాణములు వేదాంతమునకు సామీప్యముగా నున్నను, అనుమాన ములో నంతర్భూతములు. ఈయెనిమిదిప్రమాణములు పౌరాణికులకును మొదటిఆఱుప్రమాణములు పూర్వమీమాంసకులకును ప్రత్యక్షప్రమా ణము, నాస్తికులకును ఆగమప్రమాణము, ఆస్తికులైన బ్రహ్మవేత్తలకును ముఖ్యము లనిభావము.

28. పరాపశ్యంతి మధ్యమ వైఖరీవాక్కుల వివరణము.

'శ్లో॥ పరావృక్షేషుసంజాతా పశ్యంతిభుజగేషుచ । మధ్యమావై పశుశ్చైవవైఖరీవర్ణరూపిణీ॥' అను శ్లోకప్రమాణము చొప్పున పరావా క్కనగా, చిగుళ్లు ఆకులు పూవులు పిందెలు కాయలు పండ్లు మొదలగు వానిని పుట్టించుటకు తాను కారణమైయుండియు, దానిని చెట్టుయెరుగని రీతిని బ్రహ్మాకారితవృత్తిరూపిణియై సర్వజగత్కారణమై యుండియు అట్లు గుట తెలియనట్టి బ్రహ్మప్రణవ మందలి అర్థమాత్ర తురీయపాదాత్మిక ప్రకృతి యనబడును.

పశ్యంతివాక్కనగా, పాముల వినికికి చూపునకు కన్నే హేతువైన విధమున సమస్తవస్తుగ్రాహకయోగ్యమై మహత్తత్వసంజ్ఞ గల ఆబ్రహ్మ ప్రణవమందలి మకార అర్థానందపాదాత్మక ప్రథమస్ఫురణ యనబడును. మధ్యమవాక్కనగా, అకార మకారములతో గూడిన పురుష ప్రకృతా త్మకమగు అమ్మాయను శబ్దమునుపలికెడి పశువులు దానియర్థమును తెలిసి కొననివిధమున బ్రహ్మప్రణవమందలి ఉకారవిద్యాపాదాత్మక మహదహం కారరూపవృత్తి యనబడును. అనగా, మాటలువినబడినను వానియర్థము తెలియనిదశ. వైఖరీవాక్కనగా, బ్రహ్మప్రణవ మందలి అకారాదివిద్యా పాదరూపమై ఏబదిఅక్షరములచేత తానుపలికెడు సమస్తశబ్దములును వానియొక్క అర్థములను చక్కగ తెలియునట్లు బహిర్ముఖమగువృత్తియన బడును. ఇందులకు దృష్టాంతము, యొక కార్యమును చేయుటకై సంకల్పించుటకు పూర్వమందుగలవాక్కు పరావాక్కనియు, సంకల్పము పశ్యంతివాక్కనియు, ఆసంకల్పించినకార్యము వెలుపలవచ్చుట వైఖరీ వాక్కనియు, ఆకార్యము వెలుపలవచ్చుటకు ముందున్నయూహ మధ్యమ

వాక్కనియు చెప్పబడును. ఎట్లనగా, తనయొక్క ప్రారబ్ధము ఈశ్వరాధిష్ఠితమై అదృష్టమను పేరుచేనుండి అంతఃకరణమందు పడి బృహద్బ్రహ్మాకారమగునది పరావాక్కనబడును. అనగా, విత్తనముభూమిలోబడి వానిమును పటిరూపు మాపుకొని మొలక వెలుపలికిరాక ఉబికి వుండునట్టి స్థితి ఆవిత్తునుండి మొలక వెలుపలికివచ్చినట్లు ఆపరావాక్కునుండి ఒకతలంపు పుట్టుటపశ్యంతి. ఆవెలుపల కనబడిన మొలక పెరుగుటవలె ఆతలంపులను ఆలోచనకు తెచ్చుకొనుట మధ్యమ యనబడును. ఆపెరిగిన చెట్టు, ఆకులు, కొమ్మలు, రెమ్మలు, ఊడలు మొదలగువానితో బరిపూర్ణమైనట్లు ఆతలంపులు బహిర్వ్యాపారమునందు వ్యాపించి ప్రవర్తించుట వైఖరి యనబడును. ఇట్లని కైవల్యనవనీతమందు.

29. చతుర్విధసన్యాసములు.

కుటీచకమను సన్యాసము, బహూదక మను సన్యాసము, హంస సన్యాసము, పరమహంససన్యాసము యీనాలుగువిధము లగు సన్యాసములకును వైరాగ్యమే ప్రయోజనమూను గాని, పైనధరించిన కాషాయ దండముఖభేదములచేత మోక్షముచు కలుగదని తాత్పర్యము.

సన్యాసులకు కారణమైన త్రివిధవైరాగ్యలక్షణము.

మందవిరాగము గలవాడని, తీవ్రవిరాగముగలవాడని, మిక్కిలి తీవ్రవిరాగము గలవా డని అనునట్లుగాను సన్యాసులు మూడువిధముల నుందురు. ఆముగ్గురియందు మందసన్యాసి సమస్తగృహరూప మయిన కుటుంబ మందలి యుపద్రవములకు నోర్వలేకుండుటచేత సన్యసించును. దారేషణ, పుత్రేషణ, ధనేషణములయొక్క సముదాయమును విడిచినను తీవ్రుడను పేరు గల సన్యాసి యగును. కర్మకాండమందు జెప్పబడిన కార్యములయొక్క సమూహమును వృద్ధిపొందగను అబద్ధ మని విడిచిన సుతీవ్రతరుడను పేరుగల సన్యాసి యగునని తాత్పర్యము.

మందవిరాగముగలవానియొక్క ప్రయోజనమును, తీవ్రవిరాగము నందలి ద్వివిధభేదములను జెప్పబడుచున్నవి.

తీవ్రతర మను పేరుగల సన్యాసమందు కుటీచకసన్యాస మని, బహూదకసన్యాసమని రెండువిధములగును. ఆరెంటిలో సన్యాసులకు నిర్ణయించిన విశ్వేశ్వరస్మృతియందు చెప్పినచొప్పున భూసంచారముచేయుటకు సామర్థ్యము లేకుండుటచేతను గ్రామమందునగాని, పట్టణమందున

గాని, నదీతీరమందునగాని మఠము గట్టుకొని ఉదరపోషణముగా భోజనము చేసుకుంటూ కాషాయదండకమండలాదివేషములు వేసుకొని ఉండుట చేత కుటీచకసన్యాస మగును. గంగా, గోదావరి, కృష్ణా, కావేరి మొదలగు పుణ్యతీర్థములయందు స్నానము చేసుకొనుచు అయోధ్య, కాశి, కాంచి మొదలగు పుణ్యపట్టణములనర్శించుటకు భూమియందు నడుచుటకు శక్తుడై పెద్దలచేత నిర్ణయింపబడిన వాక్యలచొప్పునప్రకాశించగాను బహూదకసన్యాసమని తాత్పర్యము.

అనగా, వార్ధికమందు తన సంసారము పూజింపవలయునను తలంపుచేత తనయావద్దాస్తిని దారాపుత్రాదులకొప్పగించి విధిప్రకారము సన్యసించి నివాసయోగ్య మగు నొకపెద్దఅగ్రహారములో జేరి అందొకమఠమును ఏర్పరచుకొని దినదిన మొక్కొక్కయింటిలో భిక్షను గ్రహించుచు సుఖముగా నుండుటకు టీచక మనబడును. ఇందువలన భుక్తిసుఖమే కాని ముక్తిలేదు బహూదక మనగా, భుజించినచోట నిద్రించక నిద్రించిన చోట భుజింపక గ్రామమున నొకదినమును పట్టణమున మూడుగాత్రులు పుణ్యనదీక్షేత్రములయందు ఐదు లేక ఆరుదినములకు యెక్కువగాకుండా నివసించుచు అచ్చటచ్చటనుండేటి గృహస్థులయిండ్లయందు భుజించుచు సంచారముచేయుట ఇందువలన తీర్థయాత్రాదులఫలమే కాని ముక్తిలేదని.

తీవ్రతరవిరాగసన్యాసులభేదములును ప్రయోజనములను జెప్పబడుచున్నవి.

మందము, తీవ్రము, తీవ్రతరములను, త్రివిధవైరాగ్యములలో తీవ్రతరమైన వైరాగ్యమందు సన్యాసులు, హంసను, పరమహంసను అనునట్లుగాను బ్రహ్మవేత్తలైన పండితులచే చెప్పబడునవి, అహంసన్యాసి అర్చిరాదిమార్గములచేత సూర్యలోకమును బొంది తద్వారా బ్రహ్మలోకము జేరి అచ్చట బ్రహ్మవిచారణజేసి 'బ్రహ్మణాసహముచ్యంతే' అనుప్రమాణమురీతిని బ్రహ్మతోగూడాముక్తుడగును, అహంసునికంటె వేరైన పరమహంససన్యాసి జ్ఞానభూమి లేడింటిలో మొదటి రెండు మూడు భూముల లోనే యుండినపక్షమందు ముక్తి అప్పుడగును. ఆపరమహంససన్యాసి రెండువిధములయిన నామములచేత ప్రకాశించును, వాని వృత్తాంతమును తెలియజెప్పెదను.

హంససన్యాసికంటే వేరైన పరమహంససన్యాసి వివేకవృత్తిని గురించి జ్ఞానభూమికలలోక్రిందిమూడుభూములనుగాని, లేక రెండుభూము

లనుగాని యెక్కుట. అట్టివాడు పైపైభూమికలను సాధించుటకులోగా మృతిజెందినట్లైన స్వర్గలోకాదులనుజేరి అచ్చటచ్చట బ్రహ్మవిష్ణురుద్రాదులచే పూజితుడై మరల మర్త్యలోకమున నుత్తమగృహమున బుట్టి పైభూములనుసాధించి ముక్తిజెందును. ఆపరమహంసుడు బ్రహ్మజ్ఞానము తెలియవలెననుఇచ్ఛగలవాడును, తెలిసిపూర్ణుడైనవాడునుఅని రెండువిధములు.

అట్లుతెలిసి పూర్ణుడైనజ్ఞాని ఈజన్మమునందే ముక్తుడై ప్రారబ్ధావసానమందు విదేహముక్తుడగును. ముందుచెప్పబడిన జిజ్ఞాసి జ్ఞానప్రయత్నమువలన జ్ఞానభూమికలలో నొకటి రెండు మూడుభూములలో జేరినవాడై ఆజన్మమందుగాని, ఇతరజన్మమందుగాని నేడుభూములనుసాధించ గలవాడగును. ఇట్లని కైవల్యనవనీతమందు.

30. అప్రాకృతచతుర్విధశుశ్రూషలు.

ఆత్మ, అంగ, స్థాన, భావ శుశ్రూషలచేత తనువును, మనమును, ధనమును గురువున కర్పించి, 'శ్లో॥ గురుపాదోదకంపీత్వా గురోరుచ్ఛిష్టభోజనం। గురుమూర్తేస్సదాధ్యానం గురుమంత్రంసదాజపేత్ ॥' అనుశ్లోకప్రమాణము చొప్పున గురుధ్యానము చేయుచు పరమానందంబు చెందియుండుట మహదిచ్ఛయనంబడును. చతుర్విధశుశ్రూషలు, పరబ్రహ్మపరమందు ప్రణవ మందలి అ-ఉ-మ లకు లక్ష్యార్థ మగు ద్రష్టృస్థానమును యెరుకమరపులులేనియునికిలో విచారణచేయుట స్థానశుశ్రూష, సూర్యచంద్రబ్రహ్మవిష్ణురుద్రాదులే కన్నులు మొదలగుఅవయవములనివిమర్శించి యెరుగుటఅంగశుశ్రూష, పరబ్రహ్మముతానని భావించుటభావశుశ్రూష, ఆత్మకాత్మ నేప్రియమైనట్లు కూటస్థాభిన్నపరబ్రహ్మమైన తనయందు తాను తప్పకయుండుట యాత్మశుశ్రూషయనిభావము. ఇట్లు కైవల్యనవనీతము.

31. అహంకారత్రయవివరణము.

అహంకారము మూడుతెరగులుగానున్నది. వానిలో రెండువిధములను శ్రేష్ఠాహంకారములనియును, మరియొకటి త్యాజ్యమనియుజెప్పబడును. ఈమూడింటకు గోచరం బగు నీజగ మంతయును పరమాత్మయును నేనేననియు, నాకంటే వేరుగానుండునట్టి పదార్థము అణుమాత్రమైనను లేదనియు తలంచెడి తెలివి నేదిగలదో, అదియే మిక్కిలి ఉత్కృష్టమైన మొదటిఅహంకారమని వచింపబడును. ఇది కేవలము మోక్షమునకే గాని, బంధమునకుగాదు. గనుక, ఇది జీవన్ముక్తిని జెందినవానియందు బొంది

యుండును. ఈకనబడుచుండెడి సర్వప్రపంచమునకు వ్యతిరిక్తుండను నేనని యు, వాలాగ్రమునందు పొడగన్న అతిసూక్ష్మమైన తత్త్వము నేననియు భావించెడి తెలివి యైనది రెండవఅహంకార మనబడును. ఇది మిక్కిలి మంగళకరమగుటచేతను, బంధనివృత్తికరమగుటచేతను జీవన్ముక్తునియందే కలిగియుండును, కరచరణాదులతోఁ గూడిన దేహమే నేననియెంచెడితెలివి యేదిగలదో అదియే మూడవఅహంకారము. ఇది మిగుల తుచ్ఛమైనది యు, సౌఖ్యహీనమైనదియును బంధమగు సంసారవృక్షమునకు మూలమైనదగుట వలన దానిని విసర్జింపవలయును. ఇట్టి దేహపరిమితిగల తుచ్ఛాహంకార మును వదలిపెట్టినయెడల ముక్తిప్రదమగు తక్కిన రెండుఅహంకారములను మనుజుండు పొందును. కాబట్టి, దుఃఖహేతువగు తృతీయాహంకారమును విడిచిపెట్టి మోక్షకారణము లగు కడమ రెండహంకారములను పొంద వలయు. మరియు నీకడపటి రెండుఅహంకారములనుగూడ త్యజించినవా డెవఁడో అతఁడే తుర్యాతీత మనెడి కడపటిభూమిని యెక్కి తీరినవాఁ డని భావము. వాలాగ్రమునందు అనఁగా 'నీవారశూకవత్తన్వీపీతాభాస్వత్యణూపమా' అను శ్రుతిప్రమాణము ననుసరించి వాలాగ్రమనఁగా, నివ్వరివడ్లు యొక్కకొన. కాబట్టి, ఆనివ్వరివడ్లయొక్క అగ్రమువలె అతిసూక్ష్మ మైనవస్తువును అహంశబ్దవాచ్యమైన పరబ్రహ్మమునకు సామ్యముగా జెప్ప బడినది. ఇట్లని కైవల్యనవనీతమందు.

33. ఏకోత్తరశతసంఖ్యాకానంద నిర్ణయము.

తనయొక్క ఆసనమునకు ప్రతోయకాలసముద్రమందు సార్వభౌము డైన చక్రవర్తియొక్కయు, మనుష్యలోకమందు శ్రేష్ఠుడైన మనుష్యగం ధర్వునియొక్కయు, దేవగంధర్వునియొక్కయు, ద్వివిధము లైన పితృదేవ తలయొక్కయు, అనఁగా ఆజానజాన దేవతలయొక్కయు, అగ్నిష్వాత్తాది దేవతలయొక్కయు, కర్మదేవతలయొక్కయు, దేవతలయొక్కయు, ఇంద్రుని యొక్కయు, బృహస్పతియొక్కయు, చతుర్ముఖునియొక్కయు, విరాట్పురు షుఁడయిన తటస్థేశ్వరునియొక్కయు, హిరణ్యగర్భునియొక్కయు, 11 ఆనందములు, నురుగులు, నీటిచినుకులు, నీటిబుగ్గలు. అలలు మొదలయిన భేదములుగాను పుట్టుచు వృద్ధిబొందుచు అణగుచుండును.

పదునొకండు ఆనందములు తైత్తిరీయోపనిషత్తునందు జెప్పబడి యున్నవి. ఆనందములు పదునొకండని వేదమందుచెప్పియుండగ పంద్రెం

దని యేలచెప్పబడె ననగా, తైత్తిరీయోపనిషత్తునందు విరాట్‌హిరణ్య గర్భులనిద్దర నొక్కనిగానే చెప్పబడెను. మనుష్యానందము మొదలుకొని హిరణ్యగర్భానందము వరకుగల ఆనందములన్నియు జ్ఞానియొక్క ఆనంద బిందువులే వాటి దేహములుగా భావింపవలయును. ఈపదునొకండు కామ్యానందములు పదునొకండు తెరంగులుగా నున్నవి. వానిలో రూప లావణ్యములు గలిగి యౌవనోజ్జ్వలుడున్నై భూగోళమంతయును ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించి భోగించునది మనుష్యానందము. ఈకల్పమందు పుణ్యకర్మఫలమువలన గంధర్వలోకమునుపొందిన మనుష్యగంధర్వునియొక్క ఆనందము. మనుష్యానందముకంటె నూఱుమడుంగు లధికము. పూర్వకల్పమునందార్జించినపుణ్యముచేత గంధర్వపదప్రాప్తినిజెందిన దేవగంధర్వునియొక్క ఆనందము. మనుష్యగంధర్వుని ఆనందమునకంటె నూరుపాళ్లధికము. పితృలోకమును పొందినవాని ఆనందము. దేవగంధర్వుని ఆనందమునకంటే నూరింతలు యెక్కుడు. కల్పాదియందు పితృదేవతగాబుట్టిన అజానుజాన దేవానందము, అంతకంటె నూరుభాగములు అధికము, పౌండరీక, గరుడ యనఅశ్వమేధాదియాగములు చేసి ఉన్నతపదవిని జెందినవాడు కర్మదేవతఇట్టివానిఆనందము. ఆజానుజాన దేవానందము కంటె నూరుపాళ్లు అధికము. కర్మదేవతానందముకంటె దేవతానందము నూరింతలుయెక్కుడు. అంతకంటే నూరింతలుఅధికము దేవేంద్రునిఆనందము. ఆఇంద్రానందముకంటె నూరింతలు అధికము. బృహస్పతియొక్క ఆనందము, ఆబృహస్పతియొక్కఆనందముకంటెనూరుపాళ్ళధికము. ప్రజాపతియొక్కఆనందము. అంతకంటెనూరింతలధికము విరాట్పురుషుని ఆనందము. ఇంతమట్టునకు చెప్పిన పదునొకండు ఆనందములు మనోవాక్కుల కందినవి. అవాఙ్మానసగోచరంబైనది బ్రహ్మానందము. అట్టి ఆనందసాగరమందు మగ్నుడైన బ్రహ్మజ్ఞాని రాగాదివిషయములతో సంబంధించియుండును పైజెప్పిన యేకాదశానందములను శునకముక్కక్కిన అసనమువలె భావించి వానియందు యిచ్ఛలేక ఆభోగములన్నిటిని ఇంద్రజాలములుగా నెంచుటవలనను, వానినన్నింటికి అన్నిభోగస్వరూపములుగానుండి భోగించువాడు తానేగదాయను అనుసంధానము చేతను వానినెల్లను అనుభవించువారలవలె సకలభోగములనుపొందినవాడనిభావము కావున్ను, అపరోక్షజ్ఞానము చేత బ్రహ్మమునుపొంది ప్రపంచజ్ఞప్తివిడిచినవాడు పరబ్రహ్మమేయగును.

అట్టివానిని తామరాకుపైనీళ్ళవలెఆగామికర్మముఅంటనందుచేత నిష్టయందుంచినతూలముకీలిని సంచితకర్మము దగ్ధమైపోవుచున్నదని ఎరుగవలెను.

33. ద్వివిధమనోలయ నిరూపణము.

భూమియందు మనోనాశము స్వరూపమని అరూపమని రెండువిధములు. అందు స్వరూపమనోనాశము జీవన్ముక్తులయందును, అరూపమనోనాశము విదేహముక్తులయందును ఒప్పునని పెద్దలు చెప్పుదురు. ఆత్రిగుణరహితమైన సామాన్యావస్థయే ఆజీవన్ముక్తులయందలి మనోలయమై స్వరూపమను పేరుగలది. సూక్ష్మశరీరనాశమందు అశుద్ధసత్త్వమునశించి రూపము లేనిదై కనబడునని తాత్పర్యము.

మరియు, సస్వరూపమనోనాశ మనగా, రూపము చెడక నాశము జెందుట. అగ్నిదగ్ధమైన బట్టమువలె చూచుటకు రూపము చెడనిదిగా కనబడుచుండినను ఉపయోగమునకురాదు గనుక, ఆతీరుననే త్రిగుణరహితమైన మనస్సుతోగూడిన బ్రహ్మవేత్తలు లోకవ్యవహారములో నున్నను, స్వరూపమనోనాశమును పొందుదురు. అరూపమనోనాశ మనగా, చూపునకు రూపముకలదిగాతోచిన స్వరూపముకనబడకపోవుట. ముందు చెప్పిన తీరున కాలినబట్టమువలె రూపముకలదిగా కనబడినను, గాలికొట్టునపుడు యెగిరిపోయి ఆరూపమునసహా కనబడక పోయినవిధమున బ్రహ్మవేత్తలు ప్రారబ్ధకర్మమైన స్థూలశరీరముతో గూడియుండునపుడు భ్రాంతిజమయిన కారణశరీరమును జ్ఞానాగ్నిచేతదగ్ధముచేసినందున ప్రారబ్ధక్షయకాలమందు స్థూలశరీరము శ్మశానాగ్నిచే కాల్చబడగా సూక్ష్మశరీరమునకు ప్రవేశింప చోటులేక కట్టెలేనినిప్పు క్షీణించి భస్మమైనలాగున పరబ్రహ్మయందు అరూపలయమై లీనమగుచున్నారు. దీనికే లింగభంగమనిపేరు. ఈలింగ శరీరము అను సూక్ష్మశరీరము, స్థూలకారణశరీరములకు నడుమ సంచరించునది. యెట్లనగా, స్థూలదేహము నాశనము కాగానే అందుండి కారణ దేహములో దాగుచున్నది. మరల ప్రారబ్ధమును అనుభవించుకాలము సంప్రాప్తమయ్యెనేని ఈశ్వరుని నియమముచొప్పున స్థూలశరీరములో ప్రవేశింపజేయబడి కర్మానుసారిణిగా సుఖదుఃఖముల ననుభవించుచుండును. కాబట్టి, యీలింగశరీరమునకు దాగ చోటులేకుండునటుల బ్రహ్మవిచారముచేసి కారణశరీరమును నశింపజేసికొనినవాడు స్థూలశరీరము చెడగానే '(శ్లో|| భిద్యతేహృదయగ్రంథిశ్ఛిద్యంతేసర్వసంశయాః। క్షీయం

తేచాస్యకర్మాణితస్మిన్ దృష్టే పరావరే॥’ అను శ్రుతిప్రమాణము ననుస రించి హృదయగ్రంథియైన లింగశరీరమునశించగానే సకలసంశయములు నివారణమై బ్రహ్మసందర్శనమై ‘బ్రహ్మవేదబ్రహ్మైవభవతి’ బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మే అగునను శ్రుతిప్రమాణముచొప్పున బ్రహ్మలో ఐక్య మగుచున్నాడు. ఇట్లని విచారించి శరీరత్రయవిలక్షణుండైన ప్రత్యగాత్మ తానని తెలిసికొనినవాడు ముక్తుండని వేదాంతసిద్ధాంతము.

గద్య.

ఇది శ్రీమన్నారాయణ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మ వర ప్రసాదలబ్ధ కవితా విలాస సందడి నాగదాస ప్రణీతంబైన సకలతత్వార్థదర్పణము సంపూర్ణము.

ఏతత్సర్వంబును శ్రీలక్ష్మీనారాయణార్పణమస్తు.

కరకృతమపరాధం క్షంతుమర్హంతు సంతః.



చెన్నపురి: బరూరు. త్యాగరాయశాస్త్రులు అండ్ సన్‌వారి స్వకీయ గీర్వాణభాషారత్నాకరముద్రాక్షరశాలయందు ముద్రితము—1925.

# వేదాంతగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| వేదాంతపంచదశి, విద్యారణ్యస్వామి విరచితము. మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి విరచిత తెనుగుటీకాతాత్పర్యసహితము. | 5 | 0 |
| జ్ఞానవాసిష్ఠము, వచనకావ్యము. శ్రీవాల్మీకిమహర్షి విరచితము. మతిమంతులారా! 'జ్ఞానేనహీనః పశుభిస్సమానః' జ్ఞానహీనుడు పశువుతో సమానుడు కదా? కావున, మానవుడు అవశ్యముగ జ్ఞానవంతుడు కావలయును. కాబట్టి, ఇది సులభమైన మాటలతో రచియింపబడినది ... | 5 | 0 |
| బ్రహ్మసూత్రములు, టీకాతాత్పర్యసహితము. దీనిని పారాయణము జేసినవారు 'బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి' అను వేదవాక్యప్రకారము బ్రహ్మమయు లగుదురు. పునర్జన్మరహితగ్రంథము. | 2 | 8 |
| మహావాక్యరత్నావళి, తెనుగుతాత్పర్యసహితము. భగవంతుడగు శ్రీరాములవారు ఆంజనేయస్వామికి ఉపనిషత్తులలోని వేదాంతమహావాక్యములను ఉపదేశించినవి ... | 2 | 0 |
| భగవద్గీతలు, సమగ్రము, తెనుగువచనకావ్యము. కృష్ణమూర్తి అర్జునునకు ఉపదేశించినది. జగత్ప్రసిద్ధగ్రంథము. సంస్కృతభాష తెలియనిస్త్రీలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలగువారలకు నిత్యపారాయణోపయుక్తము, మోక్షసాయుజ్యము గలుగును ... | 1 | 0 |
| బ్రహ్మసూత్రరహస్యము, తెనుగువచనకావ్యము, ఒక్కడే అయిన పరమాత్మ ఒక్కడుగాను, ప్రపంచరూపుడై అనేకముగాను ఉండుటను తెలుపును. అష్టాంగయోగ రాజయోగాధ్యాయసహితము ... | 0 | 5 |
| సనత్కుమారగీతలు, తెనుగువచనకావ్యము. భగవద్గీతలలో జెప్పబడని అనేక వేదాంతరహస్యవిషయములు కలవు. నిత్యపారాయణోపయుక్తము ... | 0 | 5 |

పైవిలాసము—

బరూరు, త్యాగరాయశాస్త్రులు అండ్ సన్స్,

216, గోవిందప్పనాయనివీధి, మదరాస్.